శ్రీ రస్తు.

శ్రీహయగ్రీవాయనమః

A.160

# ఋగ్వేద సంధ్యావందన భాష్యమ్.

చౌండపాచార్యకృతం, ఆంధ్రతాత్పర్య ప్రత్యేక సంధ్యావందన సహితమ్.

సంపాదకః

తాత్పర్యరచయితా చ

వెంపటి కుటుంబయ్యశాస్త్రీ.

శారదాంబావిలాస ముద్రాక్షరశాలయందు

ముద్రితము.

1926 సం. రం.

కాపీరైటు] [వెల 1 8 0

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

Q1:4146
35F6K

# విషయసూచిక.

| విషయము | పుట |
| --- | --- |


ASIMHASAN ... MANDIR
LIBRARY
Jangamawadi Math Varanasi
Acc. No. 7465

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# విజ్ఞప్తి.

అయ్యలారా!

ఇక ముందుస్మార్తాది ఋగ్వేదగ్రంథంబులు ఋగ్వేదు లందరు ప్రతిగృహమున నొక్క గ్రంథము నుంచఁదలఁచి నచో ముద్రింపవలయు నని యున్నది. "అకారస్సర్వ వర్ణాగ్ర్యః" అనుటచేతను. "అక్షరాణామకారోస్మి" అనుదానిచే నీవేదంబున కితర వేద సంస్కారము ప్రశ స్తము. గాన ప్రతివారు నొకగ్రంథము నింటనుంచిన సంస్కారాంతర బాధతొలఁగును.

ఇట్లు విధేయుడు,

వెం. కుటుంబయ్యశాస్త్రి.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# పీ ఠి క.

స

"సంధ్య" సంధియందగునది (అనఁగా శివశ_క్తిరూ
ములగు పగలు, రాత్రి ఈరెంటికి మధ్యకాలము) వీనిస
వ్యవహారకాలము. విశ్రాంతికాలమని చెప్పుదురు. వ్య
హారకాలము సూర్యునితో సంబంధించినదిగాన సూర్యో
పాస్తియు సంధ్యయందవసరము. ఆతండ స్తమింప జీవుండ
క్రమముగ విశ్రాంతిస్థానమును, నిజరూపముం దాల్చుట
కేగును. కావున నాసంధియందు ఇటు వ్యవహారము న్యా
చరించుటకును, అటు విశ్రాంతిం జెందుటకును తగ నికా
మగుట భగవద్ధ్యానమవసరము మనముచేయు కా
మునువదలి కార్యాంతరసక్తుల మగుచుండఁగఁ గదా
అద్దానిని పొందుటకు ధ్యానించుట కావుననే యుపనయ
నముం ఉపదేశానంతరము సాయంకాలము దనుక జప
మాచరించి యప్పుడు సంధ్యనారంభించుట వాడుకఁ చం
ద్రునికి షోడశకళలునిండిన వెనుక పూర్ణతకలుగునట్లు
"మనశ్చంద్రంప్రవిశతి" మనస్సుచంద్రుని ప్రవేశించు
అనుశ్రుతిచేఁ జంద్రతుల్యమగు మనంబునకు పూర్ణత
ముదురుట పంభవింపకుండ మధ్యకాలమగు నమ ప

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సమయమున నే యుపనయనవిధి యావశ్యకము వెనురు
ాకుదిరినవంగు టశక్యముగదా. కనుక నే యుపనమనము
ని సేకుపదునాఱువత్సరముల దనుక ననుజ్ఞ నొసంగియున్నారు.
ృ* ఈయుపనయనము. విద్యాజన్మయను నామాం
ోత్తరముగల రెండవ జన్మము. బ్రాహ్మణ్యమిందుల
ండనేలభించును. బ్రహ్మప్రాప్తికిది దీక్షా కాలము, కావున
బ్బికనే ఋగ్వేద గర్భాధాన ఖాండమునందు నరుండు
జన్మనొందు నప్పుడుండు చిహ్నలగు కరముకుళన
కొనూవి మొదలగున వికృష్ణాజినాది స్థానీయములుగ వర్ణిం
చియున్నాఁడు. అందుచే ద్వితీయజన్మయగు నుపనయన
దారున జరాయుస్థానీయమగు కృష్ణాజినాదులను ధరించుటా
యచారము. బ్రహ్మాండమందుపలె పిండాండమందును సూ
ర్యాచంద్రమనులుందురు. (ఇచ్చటను దీర్ఘమతి మృదు
చదగు మనంబునకు చంద్రునకు తమః ప్రాప్తియంద "చంద్ర
త్వము" (అనఁగా ననాహ్లాదకరత్వము) సంభవమని సూచిం
చుచున్నది. ఇంతట దీనిని విరమింతము. ఆసుషుప్తినుండి
రిగి వ్యావహారికమునకు వచ్చునప్పుడగు సంధికాలము
పాతః కాలము వ్యావహారికమందు విఘ్నబాహుళ్యముం

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

డుటచే నాదిమధ్యావసానములందుఁ గర్మాభివృద్ధికై వి
శ్రాంతికాలమగు సుషుప్తియందితర జ్ఞానము లేక సుఖజ్ఞాన
ముంటచే కేవల జాగ్రదవస్థ వ్యావహారిక మగుటచేత నభ
యము లేని స్వప్నసదృశమగు సంధికాలమందైన భగవం
తుని నిష్కామ్యముగ ధ్యానింతురను నభిప్రాయముతో
వ్యవహారమధికముగ లేనిప్రాతస్సాయం కాలములయందు
నిష్కామ్యమును నిత్యమునగు సంధ్యావందనాదిసత్క
ర్మలను విధించియున్నారు. ప్రభుని నిత్యము సేవించువా
నిచే వానిదయయే కాని ఫలము నిత్యముగోరఁబడుట సం
భవముగదా మధ్యాహ్నముకూడ యానుషకర్మయగు
భోజనమునకై విశ్రాంతికలుగును గాన నప్పుడును సంధి
యుండును. దాననాసంధ్యయావశ్యకము. ఇట్లు నిద్రాకా
లమందు మొదట స్వప్నము పిదప సుషుప్తిత్రిగి స్వప్న
ము నాంతరధ్యాన కాలములుగ నున్నవి. అదిస్వాభావి
కము అదియే నీత్రికాలసంధ్యలకు జ్ఞాపకము. ఈభాష్య
మందు చెప్పిన మంత్రములుకొన్ని సంధ్యావందన ప్రయో
గమందు మనకువాఁడుక లేకపోవుటచేఁ జేర్పలేదు.

వెం. కుటుంబయ్యశాస్త్రి.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# ఋగ్వేదసంధ్యావందనభాష్యమ్.

---

వందేవందారుగీర్వాణ కిరీటమణిరాజిభిః
నీరాజితపదాంభోజం విఘ్నేశం సర్వసిద్ధిదం

తా॥ నమస్కరించునట్టి దేవతలయొక్క కిరీటములయందుండిన మణిపఙ్క్తులచేనివాళివ్వబడుపద్మమువలెను కుమారమైన పాదపద్మముగల సర్వసిద్ధులనిచ్చు విఘ్నేశుని నమస్కరింపుచున్నాఁడను అని భాష్యకారులచే నిర్విఘ్నపరి సమాప్తిఫలముగాఁగల విఘ్నేశస్తవముచేయంబడియె వానినె ప్రకారాంతరము చేస్తుతించుచున్నాఁడు.

లక్ష్మీశ్లక్ష్మీశముఖ్యైర్మిథునసముదయైశ్చింతితోయస్సమంతాత్ భాస్వత్యాతత్సమష్ట్యాఘటి తనిజతనుః। కుంజరోదారవక్త్రః। పుష్ట్యైశ్లిష్టస్వశక్త్యైసకలసురగణైరర్చితఃకార్యసిద్ధ్యై। దేవోనిత్యం గణేశోవితరతు సమహా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తా॥ మూలాధారనిలయుండగు గణనాథుఁడె వాగాది లక్ష్యములకాకరుఁడుగాన నట్టి సిద్ధులు గలుగుటకై లక్ష్మీశ గణపతిని స్తోత్రము చేయుచున్నాఁడు. లక్ష్మీశ్రియుక్తుఁడగు విష్ణుముఖములగు దేవతా మిథునములచే నెల్లపుడు సేవ జేయంబడువాఁడును, ప్రకాశమానమగు నా లక్ష్మీలక్ష్మీశాది మిథునసమష్టిరూపమగు శక్తియుక్తుఁడును, యేనుఁగ ముఖముగలవాఁడును, పుష్టిరూపమగు స్వశక్తితోఁగూడిన వాఁడును, కార్యసిద్ధికొఱకు సమస్తదేవతాగణములచేఁ బూజింపఁబడువాఁడును అగు గణేశుఁడను దేవుఁడు మాకు స్థిరమగు సంపదను కలుగఁజేయుఁగాత.

శబ్దాకారవివర్తమానమతులజ్యోతిస్స్వరూపాపరా
విద్యాయాచ్ఛ్వైఖరీవిలసితైర్విద్యోతయంతీజగత్।
వర్ణస్తోమవినిర్మితోజ్జ్వలతనుర్బ్రహ్మాదిభిర్వందితా।
సావాణీచఃమవాగ్విభూతిమధికాంకుర్యాత్కృపాదర్శనైః

తా॥ ఆ గణనాథునుంచి శబ్దాకారముగా రూపాంతరముం జెందిన నరుపమానమగు పరారూపమగు యే విద్య ఆశ్చర్యకరమగు వైఖరీరూపముజెంది జగత్తును ప్రకాశింప జేయునో యా వర్ణసమూహముచే నిర్మింపంబడిన దేహ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ముగల బ్రహ్మాదులచే నమస్కారింపబడు సరస్వతికీ కంటి ప్రసారములచే నధికమగు వాక్సంపద నొసంగుఁగాత. ఇట్లు వాణీగణపతుల స్తనము చేసి పిమ్మట గురువందనము చేయుచున్నాఁడు.

నమామిశౌనకాచార్యం వేద వేదాంత వేదిసం।
వేదస్యగుప్తయేయేనగ్రంథానాందశకంకృతం।

తా॥ వేదవేదాంతములు దెలిసినట్టియు వేదములను రక్షించుట కొఱకై గ్రంథదశకమును రచియించినట్టియు నాశ్వలాయన శాఖాగురుఁడైన శౌనకునకు నమస్కరించుచున్నాఁడనని వ్యాఖ్యాత చెప్పెను.

ఆగ్రంథదశక మేదియనఁగా

ఆర్షానుక్రమణీచాద్యాఛాందసీదైవతీతథా।
అనువాకానుక్రమణీసూక్తానుక్రమణీతథా।
ఋక్ఛందసోర్విధానెద్వేబార్హద్దైవతమేవచ।
ప్రాతిశాఖ్యంశౌనకీయకారికేతిదశైవతు॥

తా॥ ౧. ఆర్షానుక్రమణీ, ౨. ఛాందశీ, 3. దైవతీ, ౪. అనువాకానుక్రమణీ, ౫. సూక్తానుక్రమణీ, ౬. ఋగ్విధానం, ౭. ఛందోవిధానము, ౮. బార్హద్దైవతము,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

౯. ప్రాతిశాఖ్యము, ౧౦. శౌనకీయకారికా అని పది విధ
ముల గ్రంథములు శౌనకులు రచించెను.

విరచ్యవినియోగంతుకర్తారంసూత్రగృహ్యయోః ।
పంచమారణ్యకస్యాపివందేతంబహ్వృచాగ్రజం॥

తా॥ ఇంతియేకాక గృహ్యసూత్రములకు వినియోగమును చేసినట్టిన్ని పంచమారణ్యకమునకు వినియోగమునురచించిన ఋగ్వేదమునకు మొదటి ఋషియైన శౌనకాచార్యునకు నమస్కరించుచున్నాఁడను.

ఇఁక స్వగురుధ్యానమును చేయుచున్నాఁడు.

శ్రీ భారతీతీర్థమునివిద్యాతీర్థమునీశ్వరౌ ।
నమామిభాష్యకర్తారౌత్రయీమయమహార్ణవే॥

తా॥ వేదత్రయమనుమహార్ణవమునందు భాష్యములను రచించిన భారతీతీర్థవిద్యాతీర్థమునీశ్వరులకు నమస్కారము.

ఆసీచ్ఛ్రీమచ్చౌండపార్యోవసిష్ఠస్యకులేమహాన్ ।
ఋక్శాఖాయస్యవేదాద్యాసూత్రంయస్యాశ్వలాయనం॥

తా॥ వేదములకాదియగు ఋక్శాఖకలిగినట్టిన్ని ఆశ్వలాయన సూత్రముగల మహాత్ముఁడగు చౌండపార్యుఁడు వసిష్ఠగోత్రమందు గలిగియుండెను.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఏవమార్యః పితా యస్య కామాంబా జననీ సతీ ।
ఆదిత్యమంచకౌ స్యాతాం రవిసోమావివానుజౌ ॥

తా॥ ఆ చౌండపాచార్యునకు తండ్రి ఏవమార్యుఁడు తల్లి కామాంబ, ఆదిత్యుఁడు మంచకుఁడు నని చంద్రసూర్యులవలె సిద్ధగు తమ్ములును గలరు.

యేన దర్శిత మంత్రౌఘప్రయోగకుశలాస్సదా ।
కృతార్థతాం ప్రయాంత్యేవ మహీసుర మహీభృతః ।

తా॥ ఎవనిచేఁ జూపింపఁబడిన మంత్రప్రయోగముగలవారలై బ్రాహ్మణ క్షత్రియులు కృతార్థతను జెందుచుండిరో అట్టి మహానుభావుఁడితఁడు.

ఖిలీకృత స్త్రయీమార్గః కలౌ చ దుర్బుద్ధిభిర్నరైః ।
స్పష్టీకృతో భానునామ్నా స జయత్యార్యపూజితః ॥

తా॥ కలియుగమందు దుర్బుద్ధులచే వేదమార్గము చెఱుపఁబడినది ఆమార్గము (సూర్యునిచేత) అనఁగా నాదిత్యుఁడనువానిచే స్పష్టపఱుపఁపడినది. అతఁడు పూజ్యుఁడై ప్రకాశించుచున్నాఁడు.

తదపత్యేన చాముండీనామ్నా ప్రథితకీర్తినా ।
కృతసన్న్యాసవిధినా ... ప్రయోగః ... ॥

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తా॥ ఆ యాదిత్యుఁడనువాని సంతానమగు చాముండు
నిచే సత్పురుషుల సంతోషముకొఱకు ప్రయోగము చేయఁ
బడినది.

సకదాచిత్సమభ్యేత్యభూసురైః ప్రార్థితస్సుధీః
ఆశ్వలాయనగృహ్యోక్తకర్మానుష్ఠానసిద్ధయే॥
సంక్షిప్తత్వాద్వికీర్ణత్వాద్గృహ్యాబోద్ధుం న శక్యతే।
ప్రయోగః కర్మణాం తస్మాన్మయా సమ్యక్కృతస్త్వయం।
ప్రయోగకాలే మంత్రార్థజ్ఞానే ఫలవిశేషతః।
తత్తత్కర్మణి మంత్రాణామర్థశ్చాఖ్యాయతామితి॥

తా॥ ఆ చాముండుడనువాఁడు బ్రాహ్మణులచే ప్రార్థింపఁ
బడి చౌండపాచార్యులవద్దకివచ్చి ఆశ్వలాయనగృహ్య
కర్మ తెలియుటకు శక్యముగాదు గానను నేను చేసిన ప్ర
యోగమునకు మంత్రార్థముగూడఁగలిగియుండుట విశే
షముగానను. ఆయాకర్మలకు నర్థమును చెప్పుమనియడిగెను.

అంగీకృత్య తథేత్యుక్త్వా చౌండపార్యస్సతాం ప్రియః।
శ్రీభారతీ తీర్థగురోః కృపాదృష్ట్యవలోకితః।
ఋగ్భాష్యం సూత్రగృహ్యే చ తద్వ్యాఖ్యానాని చ స్మృతీః।
ఆలోచ్య కర్మణాం తన్మంత్రార్థవ్యాఖ్యోదయం॥

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తా॥ చౌంకపార్శ్యులట్లనేయని యంగీకరించిభారతీ తీర్థ
గురు కృపవలన ఋగ్భాష్యగృహ్యసూత్ర వ్యాఖ్యానస్మృ
త్యాదుల నవలోకించి కర్మోపయుక్తమగు మంత్రార్థ
మును రచియించెను.

తతస్సమ్యగ్వదాంసర్వసత్కర్మఫలసిద్ధయే।
సంధ్యాకర్మణిసర్వత్రబ్రహ్మభేదఃప్రదర్శ్యతే॥

తా॥ గనుక సత్పురుషులకు సర్వకర్మఫలసిద్ధికొఱకు సం
ధ్యాకర్మయందంతటను బ్రహ్మభేదముజూపంబడుచున్నది.

తత్రప్రకార స్తదర్థశ్చతన్మంత్రార్థవిచింతనం।
వినియోగశ్చమంత్రాణాంరహస్యమపివక్ష్యతే॥

తా॥ ఆకర్మలరీతు ఆకర్మార్థము ఆమంత్రార్థమువినియో
గము మంత్రముల రహస్యార్థము చెప్పంబడును.

అత్రాధికారికృతస్యైవకర్మణఃఫలహేతుత్వాత్
ఆదావధికారీప్రదర్శ్యతే॥ యథాధికారనిర్ణయః॥

తా॥ అధికారిచేచేయఁబడు కర్మకే ఫలమువిధింపబడి
యున్నది గాన ముందుగా నధికారి నిరూపణము చేయు
చున్నాఁడు.

సహివిద్యాతః సం జనయతి తత్ శ్రేష్ఠంజన్మ। శరీరమేవ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మాతాపితరౌజనయతః॥ఇత్యాపస్తంబోక్తః॥

తా॥ ఆ గురువు విద్యవలన రెండవజన్మము కలుగఁజేయుచున్నాఁడు. అది శ్రేష్ఠమగుజన్మ॥ తల్లిదండ్రులు శరీరమునే గలుగఁజేయువారుగాని విద్య వారివల్లకాదు। అని అపస్తంబులు చెప్పియున్నారుగాన విద్యాజనన మావశ్యకము.

జన్మనాజాయతేశూద్రఃకర్మణాజాయతెద్విజః।
ఇతిస్మృతివచనాచ్చ॥

తా॥ జన్మచేశూద్రుఁడై కర్మచే ద్విజుఁడగునను స్మృతిచే తప్పక కర్మరూపమగు విద్య ముఖ్యమైయున్నది.

గర్భాధానాద్యుపనయనాంతసంస్కారసంస్కృతోద్విజస్సన్నధికారీభవతి॥ తదనుష్ఠానే నైవోత్తరసంస్కారయోగ్యతాభవతి॥తదాహతత్ప్రకరణఏవశౌనకః॥

తా॥ గర్భాధానము మొదలు ఉపనయనాంత సంస్కారములచే సంస్కృతుఁడై ద్విజుఁడై యధికారిగాఁగలఁడు. ఆ సంస్కారములచే సంస్కృతుఁడె యుత్తరసంస్కారములకర్హుఁడు అని శౌనకులు ఆ ప్రకరణమందుఁ జెప్పియున్నాఁడు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అనేనవిధినావిప్రఃసంధ్యోపాస్తింకరోతియః।
సర్వపాపైర్విప్రముచ్యేతసజీవేచ్ఛరదాంశతం॥

తా॥ ఈవిధగా విప్రుఁడు సంధ్యోపాసనచేసినచో సర్వపాపవినిర్ముక్తుండై నూఱువత్సరములు జీవించియుండును.

సర్వకర్మసుయోగ్యత్వంభవతీత్యాహశౌనకః॥

తా॥ ఈ సంధ్యావందనముచేయువానికె సర్వకర్మలయందర్హతగలదని శౌనకుఁడు వచించెను.

నన్వేవంచేత్కర్మాణికతివిధాని। కతిసంస్కారా
ఇత్యాకాంక్షాయాముచ్యతె॥ కర్మాణిత్రివిధాని।
నిత్యనైమిత్తికకామ్యభేదాత్॥

తా॥ ఇట్లయిన కర్మలెన్ని ఎన్ని సంస్కారములు అనే ప్రశ్నయందు చెప్పుచున్నాఁడు. కర్మములు మూఁడువిధములు. నిత్యమని నైమిత్తికములని కామ్యములనియుం జెప్పంబడును.

తత్రనిత్యానిత్యానిపునర్ద్వివిధాని! పూర్వసంస్కా-
రోత్తరసంస్కారరూపేణ। గర్భాధానాదయఃపూర్వ
సంస్కారాః।ఉత్తరేతుపాకయజ్ఞసంస్కారాదయః॥

తా॥ అందు నిత్యములు రెండువిధములు. అవి పూర్వసం

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

స్కారములనియు నుత్తరసంస్కారములనియుం జెప్పం బడును. గర్భాధానాదులు పూర్వసంస్కారములు। పాక యజ్ఞాదులు త్తరసంస్కారములు.

తథాచహారీతః॥ ద్వివిధస్సంస్కారోభవతి।బ్రాహ్మో దైవశ్చగర్భాధానసంస్కారోబ్రాహ్మః।పూర్వః। పాక యజ్ఞహవిర్యజ్ఞసోమయాగాశ్చేతిదైవఉత్తరః॥

తా॥ ఆ సంస్కారములను హారీతుఁడు చెప్పియున్నాఁడు బ్రాహ్మమని దైవమని రెండువిధములసంస్కారములుగలవు గర్భాధానాదులు బ్రాహ్మములని పూర్వసంస్కారముల నియు జెప్పంబడును. పాకయజ్ఞహవిర్యజ్ఞసోమయాగా దులు దైవములనియు నుత్తరములనియు నవంబడును.

పూర్వేద్వావింశతిః। ఉత్తరేద్వావింశతిః। మిళిత్వాచ తుశ్చత్వారింశత్ ॥ అష్టావాత్మగుణాః॥

తా॥ పూర్వసంస్కారములు ఇరువదిరెండు। ఉత్తరసం స్కారములు నిరువదిరెండు కలసి నలువదినాలుగు ఆత్మగుణములెనిమిది.

సబ్రహ్మణస్సాయుజ్యంగచ్ఛతీత్యాహ॥ శంఖోపి॥

తా॥ ఈ నలువదినాలుగు సంస్కారములు ఆత్మగుణము

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

లెనిమిది కలిగినవారు బ్రహ్మయొక్క సాయుజ్యమును పొం
దగలరని చెప్పెను. శంఖుండును చెప్పెను.

సంస్కారైఃసంస్కృతైఃపూర్వై రుత్తరైరపిసంస్కృతః।
నిత్యమష్టగుణైర్యుక్తో బ్రాహ్మణో బ్రహ్మలౌకికం।

తా॥ ఈ సంస్కారాదులనుంచి భ్రష్టుఁడుకానివాఁడు
నాశములేని బ్రహ్మపదవిని జెందును.

కేపునరష్టగుణాః। దయాసర్వభూతేషు। దాంతిః। అన
సూయా। శౌచం। అనాయాసః। మాంగల్యం। అకార్పణ్యం।
అస్పృహేతి॥

తా॥ సమస్తభూతములయందు దయగలిగియుండుట అంత
రింద్రియనిగ్రహము అసూయలేకయుండుట శుచియైయుం
డుట ఇచ్ఛలేకుండుట అన నివి యెనిమిదియు నాత్మ
గుణంబులు.

తత్రపాకయజ్ఞసంస్థాదిత్రివిధానామేకవింశతిసం
స్కారాణాం ప్రాశస్త్యం శ్రుతిరప్యాహ॥

తా॥ అందు పాకయజ్ఞసంస్థాదిగా మూఁడువిధములగు
నిరువదిరెండు సంస్కారములకు శ్రేష్ఠతను శ్రుతులు
చెప్పుచున్నవి.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

త్రిస్సప్తయద్గుహ్యాని తేఇత్పదావిదంనిహితాజ్ఞ యాసః తెభీరక్షంత అమృతంసజోషాః పశూంశ్చస్థాతౄ చ్చరథంచపాహితి॥త్రిస్సప్త। ఏకవింశతిసంఖ్యాకాని। గుహ్యాని।రహస్యాని। వేదైకసమధిగమ్యాని॥యత్।యా నిపదాని।పద్యన్తేస్వర్గ ఏభిరితివ్యుత్పత్త్యాపదశబ్దేనా త్రయజ్ఞాఉచ్యన్తె। తేచైకవింశతిసంఖ్యాకాః। ఔపాసన హోమాదయస్సప్తపాకయజ్ఞాః।అగ్న్యాధేయాదయ స్సప్తహవిర్యజ్ఞాః।అగ్నిష్టోమాదయస్సప్తసోమయజ్ఞాః।ఏవ మేకవింశతిసంఖ్యాకాని। యజ్ఞలక్షణానిపదాని। హేఅగ్నె త్వే।ఇత। త్వయ్యేవనిహితాని।స్థాపితాని। తేషాంసర్వేషాం త్వత్ప్రధానత్వాత్ ।నహ్యగ్నిమంతరేణయాగాఅనుష్ఠాతుం శక్యన్తె। యజ్ఞీయాఃసోమయజ్ఞార్హాఃఅర్థిత్వసామర్థ్యవైదు ష్యాదిభిరధికారహేతుభిర్యుక్తాః। తథాచోక్తం।అర్థీసమర్థో విద్వాన్కర్మాధికారీచేతి। ఏవంవిధలక్షణోపేతాయజమా నాఃతానిపదాన్యవిదన్నలభన్త।లబ్ధ్వాచ తేభిర్యజ్ఞలక్షణైః పదైరమృతమమరధర్మాణాం స్వర్గరూపంఫలం మోక్షంచర క్షంతె । పాలయంతిసాధయన్తీత్యర్థః । సజోషాఃత్రైర్యజ మానైస్సహసప్రీతిఃత్వంపశూంశ్చస్థాతౄ।వృక్షాదిస్థావ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రాణిచ । రథంచ। పశువ్యతిరి క్తమన్యద్యత్ప్రాణిజాతమ స్తి తచ్చపాహి । రక్ష। తేషుత్వదీయయాగతఃక ర్తుంశక్య తెనా న్యథా॥ అతస్తానిరక్షేత్యర్థః । యత్ సుపాంసులిగితివిభ క్తే గ్లుక్।సుహ్యాని।సుహోయాంభవాని । భవేఃఛందసీతియత్। యతోనావఇత్యుదాత్తత్వే సుపామిత్యాదినాస ప్తమాం శ ఆదేశః । పదాత్తై వసూత్రేణద్వితీయావిభక్తిర్బహు వచ నంస్యాదితిస్వయమాదేశఃఅవిదక్ష।లుగిదంరూపం॥

తా॥ ఓ అగ్నిహోత్రుఁడా! ఇరువదియొక్కవిధ మగు యజ్ఞములు నీయందుగలవు. అవియన్నియు నీవేప్ర ధానుఁడవుగాగలిగియుండుటవల్ల, నీవు లేనిదిజరుగకుండుట వల్లను, సోమయజ్ఞాధికారిలక్షణములు గలవారలై యజ మానులునిన్నే సేవించెదరు. అట్లుసేవించి స్వర్గమోక్షాది ఫలములనుపొందుచుండెదరు ఆ యజమానులయందు సమా నప్రేమగలిగి వారి పశుధాన్యరథాదులనెల్లప్పుడు పరిపా లించుచుండుమను శ్రుతియం దుత్తరసంస్కారము లావశ్య కములని చెప్పంబఁడియెను.

అయమేవార్థోన్యస్యామప్యృచిదృశ్య తే॥

తా॥ ఈయర్థమునే యింకొకఋక్కుచే చెప్పుచున్నాడు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రథాయ నావముతనో గృహాయనిత్యారిత్రాం పద్వతీంరా
స్యగ్నే। అస్మాకంవీరాముతనో మఘోనోజనాంశ్చ
యాపిపారయాభద్మయాచ॥

అగ్నింపూర్వాభిఃఋగ్భిఃబహుధాస్తుత్వానయాభిలషిత
ఫలంప్రార్థయతే॥

తా॥ ఇదివరలో చెప్పిన ఋక్కులచే నగ్నినిస్తుతించి
తనకిష్టమగు ఫలమును ప్రార్థించుచున్నాఁడు.

హే। అగ్నే ఉత అపిచ రథాయ రక్షణాయ।శీఘ్రమభీష్ట
ఫలప్రాపణాయనోస్మాకంయజమానేభ్యః।నావంసంసారో
త్తారికాం।యాగాత్మికాంసుకర్మాస్తుతిషునారిత్యాదిషునా
రూపేణస్తుతత్వాత్తా।గృహాయ।గృహాణ॥ ఛందసిశాయజా
దేశః। సాధయాస్మాకంకీదృశీంతాం।నిత్యారిత్రాంనియతఋ
త్విగ్రూపోదకాకర్షణకాష్టసాధనోపేతాం । పద్వతీం।ద్రవ్య
మంత్రాదిరూపపాదోపేతాం। ఈదృశీంయాగాత్మికాంనా
వం।రాసి।దేహి॥సంపాదయ।రాతిర్దానకర్మా । రాసతిరా
ప్నోతీతితన్నామసుపాఠాత్ ॥ పునస్సైనవవిశిష్యతే॥ ఉత।
అపిచ । యానాః। అస్మాకంవీరాః । అస్మత్సంబంధినః
పుత్రాదేః ।మఘోనః ... ... ... శేషః ।

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కించయాజనాం శ్చయజమానానస్మానపిపారయా త్పార యేదుత్తారయేత్ ॥పారయ తేర్ణ్యన్తాగమః। జననమరణాది బహుదుఃఖాత్మకస్య సంసారస్యపారం నీత్వానిరతిశయ సుఖాత్మకం బ్రహ్మలోకంప్రాపయేత్ । ఏషపుణ్యకృతాం లోక ఇతియాగాద్యనుష్ఠానవతాం శ్రూయమాణత్వా ద్బ్ర హ్మలోకం ప్రాపయ్యయాచనోః శర్మనిరతిశయం బ్రహ్మ ప్రాపయేత్ ॥

తా॥ ఓ అగ్నిహోత్రుఁడా! మాకు తగిన ఫలముల నిచ్చు టకు తరింపచేయునట్టియు, నిత్యమగు ఋత్విక్కులను తెడ్లుగల ద్రవ్యమంత్రాదిరూపమగు పాదములుగల యాగ మను నావచే జననమరణాత్మకమగు సంసారమునుండి తరింపఁజేయుఁడని యీ ఋక్కుయందుగూడ యాగా ద్యుత్తరాంగములు ప్రతిపాదింపఁబడినవి.

పరస్యాం హైకతాత్మనఃప్రవిశతిపరంపదమిత్యుక్తత్వా త్ ।ధీశుద్ధ్యర్థానద్వారావివిదిషంతి।

తా॥ పరునితో సమానుఁడై పరమపదమును ప్రవేశించు చున్నాఁడని చెప్పుటవల్ల బుద్ధిని శుద్ధిపఱచునవి గనుక యాగాదులను తప్పక తెలుసుకొనుటయని పెద్దలు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కోరుచున్నారు.

యజ్ఞేనతపసాదానేనానశనేనేతిశ్రుతేః। అస్త్యేతేషాం కర్మణాంప్రాశస్త్యం॥

తా॥ యజ్ఞ దాన తపస్సులనునవి ముక్తిద్వారములని శ్రుతులు చెప్పుచున్నవి గాన వీనికి ప్రాశస్త్యముగలదు.

తథాపిగర్భాధానాద్యుపనయనపర్యంతాస్సంస్కారా స్సర్వేపినియతాః। నపునస్నానాదయః।

తా॥ అట్లయినను గర్భాధానము మొదలు ఉపనయన పర్యంతము గాగల సంస్కారములు నిత్యములు స్నానాదులు నియతములు కావు.

తథాద్వితీయమిచ్ఛేత్కర్తుంతమావసేద్యదివేతరథా బ్రహ్మచర్యాదేవప్రవ్రజేత్ ॥ ఇతిశ్రుతిదర్శనాత్॥

తా॥ అట్లు రెండవదియగు గృహస్థాశ్రమధర్మనుగు యజ్ఞాదులును కోరికగలిగిన ప్రవేశింపవలయును. అట్లు కానిచో బ్రహ్మచర్యాశ్రమమునుండియె అనఁగా గర్భాధానాద్యుపనయనాంత కర్మనుండియె సన్యాసాశ్రమము నవలంభించునది యని శ్రుతులు చెప్పుటవల్లను అనియతత్వము స్నానాదులకు అటస్థముయినది.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కించగర్భాధానాది సంస్కారాణాం ప్రాశస్త్యం॥ వ్యాసేనాప్యుక్తం। తేనవర్తన మనుష్ఠానమంతరేణ నవైదికం। ప్రవర్తయే ద్విజాతీనాం ధర్మసిద్ధిమభీప్సు భిరితి॥ తథా చాశ్వలాయనోపి। గృహ్యోక్తానాం గర్భాధానాది కర్మణాం ప్రాశస్త్యంత్రయః పాక। యజ్ఞా ఇత్యత్రసూచితవాన్॥

తా॥ గర్భాధానాది సంస్కారములకు ప్రాశస్త్యమును వ్యాసునిచేత నాశ్వలాయనునిచేతను ధర్మసిద్ధి గోరువాఁడు అనుష్ఠానము లేకుండా వైదికకర్మ ననుష్ఠింపవలదు అని చెప్పబడెను (అనఁగాగర్భాధానాది సంస్కారములకు నిత్యానుష్ఠానము లేదనుట) త్రయఃపాకయజ్ఞాః అను పాకయజ్ఞ వివక్ష స్థలమందు గర్భాధానాది కర్మ ప్రాశస్త్యము జెప్పఁబడినది.

కథంపాక శబ్దఃప్రాశస్త్యేవర్తతే। తంపాకేనమనసా ఇత్యత్రయో మాపాకేన మనసేత్యత్రచదర్శనాత్॥

తా॥ తంపాకేన మనసా। అను స్థలమందు యోమాపాకేన మనసా అనే స్థలమందువలెనే పాక శబ్దమునకు ప్రాశస్త్యర్థము చెప్పవలయును.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అతఃపాకయజ్ఞాః ప్రశస్తయజ్ఞాః। ప్రాశస్త్యం బ్రాహ్మణ్య సాధన త్వాత్॥ ప్రశస్త ఫలసాధనతా।

తా॥ పాకయజ్ఞములనఁగా ప్రశస్త యజ్ఞములు ప్రాశస్త్య మనఁగా బ్రాహ్మణ్య సాధన మగుటవల్ల ప్రశస్తమగు ఫలమును సాధించునదాయెను.

కర్మణాం ఫలసాధనత్వం నామమంత్రార్థ జ్ఞానపూర్వకం కర్మకర్తృసాధన వైగుణ్యాభావేనయేన తిష్ఠన్తితేషాం ఫలప్రదా దృష్టజనకత్వం॥

తా॥ కర్మలకు ఫలమును సాధించు టనఁగా మంత్రార్థ జ్ఞానము కలిగి కర్మ చేయువానికి సాధనమగు కర్మ చెడకుండున ట్లెవ్వ రాచరింతురో వారికి ఫలమునిచ్చు అదృష్టమును కలుగఁజేయుననుట.

ఏతేషాం ప్రశస్త ఫలసాధనత్వం శ్రూయతే।యస్సమిధా। తస్యై దర్వస్తీఋగ్భ్యాం॥

తా॥ ఈ కర్మలకు ప్రశస్తమగు ఫలముల సాధించుట యస్సమిధా తస్యైదర్వస్తీ అను ఋక్కులచే వక్కాణింపఁబడెను.

యస్సమిధాయ ఆహుతీ యో వేదేన దదాశమర్తో అగ్న

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మో। యోనమసాస్వధ్వరః॥ తస్యేదర్వాన్తోరంహయంత।
ఆశవ స్తస్య ద్యుమ్నతమంయశః। నతమంహో దేవ
కృతం కుతశ్చనమ స్త్యకృతం॥ పూర్వయాఋచాపాక
యజ్ఞానాం స్వరూపం ప్రదర్శ్యోత్తర యాఋచాతత్ఫలం
ప్రదర్శ్యతే॥

తా॥ యస్సమిధాయ అహుతీ। అనునట్టియు తస్యేద
ర్వాన్తో అనునట్టి ఋక్కులలో పూర్వ ఋక్కుచే పాక
యజ్ఞముల స్వరూపము చెప్పి రెండవదానిచే వాని ఫల
మును చెప్పినాడు.

పాకయజ్ఞాస్త్రివిధాః। హుతాఃప్రహుతాః బ్రహ్మణిహు
తాశ్చేతి। అగ్నౌహూయమానా దేవయజ్ఞా దయోహు
తాః। అగ్నింవినాక్రియమాణా బలిహరణ బ్రహ్మయజ్ఞా
దయోఃప్రహు తాః। బ్రాహ్మణ భోజనాత్మకాః బ్ర
హ్మణిహుతాః॥

తా॥ పాక యజ్ఞములు హుతములని ప్రహుతములని
బ్రహ్మణి హుతములని మూఁడు విధములు. అగ్నియందు
హోమము చేయఁబడు దేవయజ్ఞాదులు హుతములు
అగ్ని లేక చేయఁబడు బలిహరణ బ్రహ్మయజ్ఞాదులు ప్ర

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

హుతములు బ్రాహ్మణ భోజనరూపము లగునవి బ్రహ్మణి హుతములు.

పూర్వస్యామృచి తే క్రమేణ ప్రదర్శ్యన్తే॥

తా॥ పూర్వపు ఋక్కునందు క్రమముగా నివి చెప్పఁబడినవి. (అనఁగా యస్సమిధా అను ఋక్కునందనుట)

యఃమర్త్యః। మనుష్యః। అగ్నయె। దదాశ।అగ్న్యర్థంపరిచరతి। యఃఆహుతీః। ఆహుత్యా। సుపాంసులు గిత్యాదినా తృతీయాయాః పూర్వసవర్ణ ఈకారః। ఆజ్యచర్వాది రూపయాగ్నిం పరిచరతి। అనేనవాక్యద్వయేనసమిధా ధానరూపాగ్ని కార్యేధ్మాధానా జ్యచర్వాది రూపాహుతయః పాకయజ్ఞావివక్షితాః॥

తా॥ ఎవ్వఁడు సమిత్తులచేతను ఆహుతులచేతను అగ్నిని సేవించుచున్నాఁడో అన్నందువల్ల హుతములగు అగ్నిహోత్ర ప్రధానకర్మలు చెప్పఁబడినవి.

యః। వేదేన సోమస్థానీయ జప బ్రహ్మ యజ్ఞాదినా। గ్న్యుపలక్షితాదేవతాః పరిచరతి। తావత్రైవ దేవతాప్రీతి రస్త్యేవేతి విద్యయైవాప్యస్తి ప్రీతిరిత్యత్ర శ్రుతిదర్శనాత్। అనేనబ్రహ్మయజ్ఞ ... కాః

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ప్రహుతాః పాకయజ్ఞావివక్షితాః ॥

తా॥ ఎవ్వఁడు వేదముచేత సోమసానీయమగు జప బ్రహ్మయజ్ఞాదుల చేగ్నిచే సూచింపఁబడు దేవతలను పరిచరించుచున్నాఁడో వాఁడు (దీనికి విద్యచేతనే దేవతా ప్రీతి గలుగునన్న శ్రుతి ప్రమాణము.) దీనిచే జప బ్రహ్మయజ్ఞాది ప్రహుతములు చెప్పఁబడినవి.

యస్స్వధ్వరస్సన్నమసా। అన్నేనాగ్ని శ్శర్ధంపరిచరతి। అథవానమసా నమస్కారేణ పరిచరతి సోపిస్స్వధ్వరో భవతి । యజ్ఞోవైనమ ఇతిశ్రుతేః। అనేన కర్మాంగ బ్రాహ్మణ భోజనాత్మకాః బ్రహ్మణిహుతా ఉపలక్షితాః॥

తా॥ ఎవ్వఁడు నమస్కారముచేతగాని అన్నముచేతగాని అగ్నిని తననిమిత్తము సేవించుచున్నాఁడో వాఁడు, మంచి యజ్ఞముగలవాఁడు. నమశ్శబ్దమునకు యజ్ఞమర్థమగుటకు యజ్ఞోవైనమః అను శ్రుతిప్రమాణము దీనిచే కర్మాంగ బ్రాహ్మణ భోజనమగు బ్రహ్మణిహుతమను పాకయజ్ఞము సూచింపఁబడినది.

అనఁగా కర్మకుప్రధానమగు నగ్నిహోత్రుడే మూఁటియందు ముఖ్యుడనుటచే సూర్యచంద్ర రూపమగు బ్రా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

హ్మణభోజన జపాదులను సూర్య చంద్రులును అగ్ని ప్ర
ధానులే యని సూచించుచున్నది.

ఉత్తర స్యామృచోర్థః॥ ఇంక నుత్తరఋక్కునకర్థ
ము వివరించుచున్నాఁడు.

యఃపూర్వోక్త త్రివిధపాకయజ్ఞః। తస్యైత్। తస్యై
వ। ఆశవ్తోవ్యాపనశీలాః। అర్వన్తో। అశ్వాః। రంహాయ
న్తె। త్వరయంతి శత్రూన్ప్రతిగంతుమితి శేషః। ద్యుమ్నిత
మందీప్తితమంయశః కీర్తిశ్చతదేవ। భవతి। యద్వాద్యు
మ్నమితిధననామ ధనవత్తమం యశోన్నం చతస్యైవ
అపిచదేవకృతం దేవైః కృతమంహః పాపంకుతశ్చనన
శత్। నప్రాప్నోతి। మర్త్యకృతం మనుష్యైఃకృతం
చతన్ననశత్॥

ఎవ్వఁడు పూర్వమందు చెప్పఁబడిన మూఁడు విధముల
గు పాకయజ్ఞములను చేయునో వానియొక్క అశ్వ
ములు శత్రుసంహారమునై శీఘ్రముగా ప్రయత్నించు
చున్నవి. (అరిషడ్వర్గమును జయించుననుట) అట్టి శత్రు
సంహారమువల్ల కీర్తిగలుగుచున్నది. అట్టి కీర్తివల్ల ధన
CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri
ధాన్యాదులు గలుగుచున్నవి. వానికి దేవనిమిత్తముగాను

మనుష్యనిమిత్తముగాను చేయఁబడిన పాప మెంతమాత్ర మును అంటదు. (అనఁగా విఘ్నములనుట)

ఏవం కర్మణాంప్రశస్తఫలందర్శితం । తచ్చఫలం ద్వివిధమైహిక మాముష్మికంచేతి । అష్టకాదసాధ్యం పుష్టాదికమైహికం ॥

ఇట్లు కర్మలకు ప్రశస్తఫలము చెప్పఁబడినది ఆ ఫలము రెండు విధములు। ఐహికమనియు నాముష్మికమనియు, అష్టకాదులచేఁ జేయంబడు పుష్ట్యాదికర్మ ఐహికము॥

ఆముష్మికంద్వేధా । స్వర్గాది రపవర్గశ్చేతి । తత్రపుష్టిఃస్వర్గాదేస్సాక్షాత్సాధనం । ధర్మ అపవర్గస్య తత్వజ్ఞానోత్పాదనద్వారేణ ॥ తథాచస్మర్యతే.॥ ధర్మాత్సుఖం

నంచ । జ్ఞానాన్మోక్షోధి గమ్యతఇతి ॥

తా॥ ఆముష్మికము రెండు విధములు । స్వర్గాదులు అపవర్గము నని । ఈ స్వర్గాద్యాముష్మికమునకు నైహికమగు పుష్ట్యాదికర్మ సాక్షాత్సాధనము. ధర్మమనునది తత్వజ్ఞానమును కలిగించి అపవర్గమను నాముష్మికమును గలుగజేయును. అట్లు స్మృతి ॥ ధర్మమువల్ల సుఖము జ్ఞానముగలిగి సుఖమువల్ల స్వర్గాదులు జ్ఞానమువల్ల

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మోక్షమును లభించును.

నను నిత్యకర్మణాంఫలమేవనాస్తి। కేవలమకరణె ప్రత్యవాయభయాదనుష్ఠీయన్తె। తథాచోపనయనాధ్యయనాది విహితాకరణె ప్రత్యవాయస్మర్యతె ॥

తా॥ నిత్యమాచరించు కర్మలకు ఫలము లేదు. చేయకున్న ప్రత్యవాయ మగునుగాన చేయక తప్పదు. గనుక నుపనయనాధ్యయనాదులు నిత్యములుగాన చేయక తప్పదు. ఇట్లు విధించుటవలన మన పెదలు నరులకు కామ్యమం దతీచ్ఛగలిగియుండునని దలఁచి విధిఁగ కొన్ని నిత్యములు విధించినచో॥ సతతము సేవించువానికి నిత్యము ఫలమడుగుట యసంభవముగాన నిష్కామ్యమై యా సేవించు దేవతల కనుగ్రహము కలిగినప్పు డధిక ఫలము గలుగుచుండునని తాత్పర్యము దీనివలన నిష్కామ్యసేవ ముఖ్యమని బోధింపఁబడుచున్నది.

శ్లో॥ అతఊర్ధ్వం పతంత్యేతేయధాకాలమసంస్కృతాః।
సావిత్రీ పతితావ్రాత్యాభవన్త్యార్యవిగర్హితాః।

తా॥ కాలమునకు సంస్కృతులు గానివారు పతితులగుదురు. సావిత్రినుండి పతితులగువారలు వ్రాత్యులగుచుఁ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పెదలచే నిందితులగుదురు.

శ్లో॥ యోనధీత్యద్విజో వేదానన్యత్రకురుతేశ్రమం ।
సజీవన్నేవశూద్రత్వమాశుగచ్ఛతిసాన్వయః॥

తా॥ ఎవ్వఁడు వేదములను చదువక మఱియొకదాని యందు శ్రమనుజేయు నాతండు జీవించియుండఁగానే వంశ మంతటితో శూద్రత్వము ౦ బెందును.

శ్లో॥ అకుర్వన్విహితం కర్మనిందితం చసమాచరన్
అనిగ్రహాచ్చేంద్రియాణాంనరఃపతనమృచ్ఛతీత్యా దిస్మృతేః ॥

తా॥ చేయఁదగిన కర్మ నాచరింపక నిషిద్ధకర్మ నాచ రించువాఁడును. ఇంద్రియముల జయింపనివాఁడును పతన ముం బెందునని స్మృతులు చెప్పుచున్నవి.

గ॥ ప్రత్యవాయభయాన్నిత్యకర్మానుష్ఠానేనదురిత ప్రాగ భావపరిపాలనం సంచిత దురితప్రధ్వం సాభావోవాస్యాత్ ॥

తా॥ ప్రత్యవాయము గలుగునను భయమువలననైన నిత్యకర్మ నాచరించినచో దురితప్రాగభావమే యుండు (దురితము పుట్టదనుట) అనాదిస్సాంతఃప్రాగభావః॥ పుటు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కలేక యంతముగలది ప్రాగభావము. దురితము పుట్టినచో దురితప్రాగ భావముండదు. సంపాదించిన పాపముల ధ్వంసచేయుట, ప్రధ్వంసాభావము. మొదలుండి యంతము లేనిది ధ్వంసయగును ఘటధ్వంసకాదియేగాని యంతము లేదు. ప్రాగభావమునకు యంతమేగాని యాది లేదు.

గ॥ దురిత ప్రధ్వంసిత్వంచ త్రి సంధ్యమనుష్ఠీయయా ణేషు
సూర్యశ్చేత్యాది మంత్రేషు విస్పష్టమవభాసతే॥

తా॥ పాపములు నశించుట మూఁడు వేళల నాచరించు సంధ్యా మంత్రముల చేతనే స్పష్టమగుచున్నది. సూర్యశ్చేత్యాది మంత్రములో పాపేభ్యోరక్షన్తాం॥ పాపముల నుండి రక్షించుగాక యనునది యాదిగనుండు మంత్రార్థము వలననే స్పష్టము.

గ॥ ఏవం చోపభోగ్యఫలరక్షిణాం నిత్యకర్మణాం ఫలవత్వాం నదూరతోపాస్తమితి॥

తా॥ ఇట్లుండఁగా ననుభవింపదగిన ఫలమును రక్షింపఁదగిన నిత్యకర్మలు ఫలముగలవియే కాని లేనివి కావు గనుక నిత్యకర్మలు గూడ ఫలవంతము లే ఫలరహితంబులు గావు. (భావిబ్రాహ్మణ్య రక్షణంబులనుట).

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గ॥ తర్హి కథం సర్వకర్మణాం ఫలవత్త్వమితిచేదత్రోచ్యతే।
అస్తుప్రత్యవాయనిరోధిత్వంనై తావతా ఫలాభావః।
మంత్రలింగేనస్మృతివాక్యాభ్యాంచతత్ఫలావగమాత్॥

తా॥ అటులైన నన్ని కర్మలకు ఫలవత్త్వ మెట్లనిన చెప్పెదము. ప్రత్యవాయము రాకుండుటవలన ఫలము లేకపోవుటకాదు. (ప్రత్యవాయము లేకుండుటేగాని వేఱు ఫలము లేదనుటకాదు.) మంత్రమందుండు చిహ్నాలచేతను స్మృతివాక్యములచేతను ఆనిత్య కర్మలకు ఫల మగుపడు చుండును.

గ॥ మయివర్చో బలమోజో నిధత్తేతిమంత్రలింగ ఛందోగ వాక్యం చాశ్రమత్రయస్యలోకహేతుతాంచ తుర్యాశ్ర మస్యమోక్షహేతుతాంచ దర్శయతి॥

తా॥ నాయందు వర్చస్సును బలమును ఓజస్సును తెచ్చు గాక యను మంత్రార్థముగల ఛందోమంత్రము ఆశ్ర మత్రయమునకు లోకహేతుత్వమునున్నూ నాల్గవయాశ్ర మమునకు మోక్షప్రాప్తియు బోధించుచున్నది. బ్రహ్మ చర్యమున వర్చస్సు, గార్హస్థ్యమున బలము, వానప్రస్థ మున ఓజస్సు, ఈ మూడును లోకసాధనములు నాల్గవది

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యగు సన్యాసము మోక్షసాధనమగును.

గ॥ త్రయోధర్మస్కంధాః॥ యజ్ఞోధ్యయ నందానమితి ప్రధమః॥ తపఏవద్వితీయః। బ్రహ్మచర్యాచార్యకులేవాసి త్వంతృతీయః । అత్యంతమాత్మాన మాచార్యకులేవసాద యంత్సర్వఏతే పుణ్యలోకాభవన్తి బ్రహ్మసంస్థోమృతత్వ మేతీతిఏతస్యవాక్య స్యాశ్రమపరత్వం పదార్థంజైమినిరి త్యాదివ్యాససూత్ర ప్రతిపాదితం॥ స్మృతివాక్యంచైతత్॥

తా॥ మూఁడు ధర్మమునకు విభాగములు అందు యజ్ఞదానాధ్యయనములు మొదటి భాగము. తపస్సు రెండవభాగము. బ్రహ్మచర్యము గురుకులవాసము. మూఁడవ భాగము మిక్కిలి గురుకుల వాసమువలన కాలముగడిపిన నందఱు పుణ్యలోకములం జెందుదురు. బ్రహ్మనుపాసించి మోక్షముం జెందగలఁడు దీనికి ఆశ్రమపరముగ నర్థము జైమినిః అను వ్యాససూత్రమున గలదు. దీనికి స్మృతులు కూడఁగలవు.

గ॥ తద్యథా ఆమ్రేఫలార్థీ ఛాయాగంధఇత్యనూద్యన్తే ఏవంకర్మ చర్యమాణమనూద్యన్తే। ఇతీదంవాక్యం చనిత్యకర్మ విషయత్వేనవార్తికే విశ్వరూపాచార్యుడదా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

జహార॥ ఆమ్రేనిమిత్త ఇత్యాదిశ్చాప స్తంబస్మృతేర్వచః।
ఫలవత్త్వంసమాచష్టేనిత్యానామపికర్మణామితి॥

తా॥ అది యెట్లన మామిడిచెట్టునీడ ననుసరించినచో ఫలమును గోరుటను సూచించునట్లు కర్మను చేసినచో తత్ఫలములు గూడ సూచింపఁబడును. అని యీవాక్య మును విశ్వరూపాచార్యులు కర్మవిషయకమగు వార్తిక మం దుదహరించెను. ఆపస్తంబస్మృతియందుగూడ ఆమ్రే నిమిత్త ఇత్యాదివాక్య ముదహరింపఁబడినది దానిచే నిత్యకర్మలకుఁగూడ ఫలము గలదనుట నిశ్చితము.

తథాచమనుః

శ్లో॥ వేదోదితం స్వకంకర్మనిత్యం కుర్యాదతంద్రితః।
తద్ధికుర్వన్యథాశక్తి ప్రాప్నోతిపరమాంగతిం॥

తా॥ వేదమందు జెప్పబడిన కర్మ నిత్యమాచరింపఁ దగినదియె. దానిని యథాశక్తిగఁ జేసినచో పరమపదవి గలుగునని మనువు చెప్పెను.

కూర్మపురాణము.

శ్లో॥ యథాశక్తిచరేత్కర్మ నిందితంచ వివర్జయేత్।
విధూయమోహకలిలం లబ్ధ్వాయోగమనుత్తమం॥

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గృహస్థోముచ్యతేబంధాన్నాత్రకార్యావిచారణేతి॥

తా॥ శక్తినిబట్టి కర్మనాచరింపవలయును నిందితమగు కర్మనుజేయనేకూడదు. ఇట్లు కర్మనాచరింపఁగా మోహమువదలి శ్రేష్ఠమగు యోగముంజెంది గృహస్థుడు బంధమునుండి తప్పక విడువంబడును.

గ॥ నన్వస్త్వేవమభ్యుదయహేతుత్వం। నిశ్శ్రేయసహేతుత్వంతున సంభవతి। ప్రమాణాభావాత్ । ప్రత్యుతశ్రుతిస్మృతిభ్యాంతన్నిషిధ్యతే। నకర్మణానప్రజయేతిశ్రుతిః। జ్ఞానాదేవతుకైవల్యమితిస్మృతిః। అయి ఏవం పరమాత్మప్రకరణే నిశ్శ్రేయసహేతువేదనేచ్ఛాసాధనత్వేన యజ్ఞాదీనాంవిధానాత్। తమేతంవేదానువచనేన బ్రాహ్మణావివిదిషంతి। యజ్ఞేనదానేనేతిశ్రుతేః। నిషేధస్తుసాక్షాన్నిశ్శ్రేయససాధనత్వగోచర ఇష్యతే। తస్మాన్నముక్తావగ్న్యాధానాదికర్మాపేక్షా। వేదనోత్పత్తౌతువిద్యతే॥

తా॥ అట్లయినను వృద్ధికారణంబేగాని నిశ్శ్రేయసహేతుత్వము సంభవింపదు. అట్లు ప్రమాణములేదు. దానికి విరుద్ధముగానే శ్రుతిస్మృతులుగూడఁ జెప్పుచున్నవి. అది యెట్లన కైవల్యమునుసది కర్మచేతను ప్రజచేతను గలు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గదు. జ్ఞానమునుండియే గలుగును. అనిపూర్వపక్షి పలుక గా సమాధానము. పరమాత్మను చెప్పుసందర్భమున నిశ్శ్రే యస హేతువగు జ్ఞానోత్పాదకము లగుటచే యజ్ఞాది కర్మలఁ చేయవలయునని చెప్పుటవల్లను ఆ పరమాత్మను వేదవాక్యముల ననుసరించి బ్రహ్మజ్ఞానులు తెలుసుకొను చున్నారని శ్రుతిచెప్పుటవల్లను కర్మ ప్రజానిషేధమునకు సాక్షాద్ధేతుత్వము కొట్టఁబడినది గనుక ముక్తికారణము కర్మాదులుగావు. జ్ఞానజనకంబు లేయని నిశ్చయము సువ ర్ణమేనగలకు హేతువగునుంగాని మిగిలినవన్ని పరంపరా సాధనములగును. ఆ నగనుజూచి యానందించునపుడితర సాధనముల నవసరము. నగగాదేలునందాక యవసరము. గ॥ తథాచకర్మణాంపరంపరయా మోక్షహేతుత్వం వాయ వీయసంహితయామభిహితం।

కర్మాతిశయమాసాద్య పశోః పాశపరిక్షయః

ఏవం ప్రక్షీణపాపస్యబహుభిర్జన్మభిః క్రమాత్ ॥ఇతి॥

తా॥ దానికి వాయవీయ సంహితయందు పెద్దలచేఁజెప్ప బడియెను. కర్మలుచేయుటవలన పాపక్షయమై జ్ఞానోద యం బగుచున్నను. ఇట్లు పాపక్షయం కాఁగాకాఁగా ననే

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

క జన్మలచే ముక్తుండగును.

గ॥ నచనిత్యస్యాపిఫలవత్వే నిత్యకామ్యయోర్భేదాభావ ఇతిశంకనీయం। కరణేతిశయసామ్యేప్యకరణే ప్రత్యవాయసద్భావాసద్భావాభ్యాంతద్భేదాత్॥

తా॥ నిత్యమునకుఁగూడ ఫలముండినచో నిత్యకామ్యములకు భేదములేకుండుననఁగా నిత్యమును చేయుటలో ఫలము సమానమైనను చేయకుండుటలో దోషమెుం డధికము గనుక భేదము గలదు. కామ్యములకు చేయకుండుటచే దోషములేదు.

గ॥ నఖల్వాయుష్కామపుష్టికామేత్యాద్యకరణేకశ్చిత్ప్రత్యవాయశ్శ్రూయతే।ఏషఏవనిత్యానామ్యయోర్నైమిత్తికేత్యవగంతవ్యం।స్కన్నేజుహోతీత్యాద్యనియతచోదనాద్యధికారి విశేషేణాపేతం నైమిత్తికం నిత్యవత్కామ్యస్యాపి విహితత్వేన శుద్ధిహేతుత్వాన్మోక్షసాధనత్వమితిచేన్న। రాగప్రాధాన్యాచ్ఛుద్ధిస్తూపసర్జనత్వేన రాగవిషయం భోగం సంపాద్యోపక్షీయతే। అత ఏవగీతాయాం భగవతాముముక్షోరర్జునస్య ఫలాసక్తిర్నిషిద్ధా।

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్లో॥ యోగస్థఃకురుకర్మాణి సంగంత్యక్త్వాధనంజయ।
సిధ్యసిధ్యోస్సమోభూత్వా సమత్వంయోగఉచ్యతే॥
కర్మణ్యేవాధికారి స్తేమాఫలేషుకదాచన
ఇత్యాదినా నిత్యకర్మణితుశుద్ధిఃప్రధానం ఫలముపసర్జనం॥

తా॥ ఐనను ఆయుష్కాముండును బలము గోరువాడును చేయకున్న ప్రత్యవాయమని పలుకుదానిని నిత్యనా శ్రయము ననుసరించి నైమిత్తికమునకు గూడ నేలజెప్పగ డదు తడసినను విచ్ఛిన్నమైనను ప్రాయశ్చిత్త హోమ మును జరుపవలెనను నిమిత్తముచే వచ్చిన నైమిత్తికము నిత్యమునకువలె కామ్యమునకుఁగూడ నుండుటచేతను శుద్ధి గలుగఁజేయుటచేతను మోక్షసాధనంబెట్లు కాగూడ దనదగదు. ఏలనన గాస్కన్నే జుహోతీత్యాది కర్మరా గమువలన వచ్చినదిగాన కోరిక దీరినతోడనే యప్రధాన మగును. ఏలనన కోరినకోరిక తీరుటవలనను ధార్మికు నాశ్రయించునపుడు కోరికతో నాశ్రయించిన దాని ఫలము వెంటనే కలిగి తిరిగి కోరుట కశక్యమగును. నిష్కామన యనఁగా కోరిక లేక సేవింపనీ కామ్యముగూడ సిద్ధిం చుచు మోక్షంబు గలుగునని తాత్పర్యము. గనుకనే

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యర్జునునకు భగవంతుఁడగు కృష్ణుండు ఫలముగూడదని చెప్పెను. అది యెట్లన యోగస్థుడవు (అనఁగా కైవల్యమును బొందినవాఁడవయ్యు) కర్మలను జేయుము అట్లుచేయునపుడు సంబంధమును వదలి యాత్మశుద్ధికై జేయుము. నీకు కర్మలయం దధికారముగాని ఫలమునందు లేదు. అని,

తదుక్తం వార్తికకారేణ। నిత్యేషుశుద్ధేః ప్రాధాన్యాత్ భోగోప్యప్రతిబంధకః। భోగంభంగు రమీక్షంతే బుద్ధిశుద్ధ్యనురోధతః।ఇతి॥

తా॥ నిత్యకర్మ శుద్ధికొఱకని వార్తికకారులు చెప్పిరి. నిత్యములయందు శుద్ధి ముఖ్యము గనుక భోగమునకు నడ్డు లేదు. భోగమనునది భంగకరము ఎందువల్లననఁగా బుద్ధియొక్క శుద్ధిని చెఱుచుట చేతను.

నిత్యంచకర్మద్వివిధం । సంస్కారజనకం వివిదిషాజనకంచ। విహితత్వమాత్రబుద్ధ్యా క్రియమాణం సంస్కారజనకం! తథాచస్మర్యతే। యస్యైతే సంస్కారాఃసబ్రహ్మణస్సాయుజ్యం సలోకతాంజయతీతి। ఈశ్వరార్పణబుధ్యా క్రియమాణం వివిదిషాజనకం । తచ్చభగవతాదర్శితం । యత్కరోషియదశ్నాసియజ్జుహోషిదదాసియత్। య

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

త్తపశ్యసికాతేయ తత్కారుష్వామదర్పణం । ఇతి । తత్ర సంస్కారేణ చిత్తస్యయోగ్యతామాత్రం సంపద్యతే । వివిదిషాతుప్రవృత్తిముత్పాద్యావశ్యం వేదనం సంపాదయతి। తస్మాన్ముముక్షోరీశ్వరార్పణం ప్రశస్తం॥

తా॥ నిత్యమగు కర్మ రెండు తెఱంగులు. సంస్కారజనకమనియు, వివిదిషాజనకమనియును, ఈ సంస్కారమనుభవముచేఁ బుట్టి స్మృతిహేతువగుచుండును. గాన సంస్కారమును మనసున కలుగచేయుకర్మ యొకటి వివిదిష యనఁగా తెలిసికొను నిచ్ఛ. దానిని గలుగఁజేయు కర్మయొకటి ఇట్లు రెండు విధములు. ఇది విధిగ జేయతగినదను బుద్ధితోఁ జేయంబడు కర్మ సంస్కారమును గలిగించును. అట్లు స్మృతియు గలదు. ఎవ్వరీ సంస్కారముల నాచరింతురో వారు బ్రహ్మయొక్క సాయుజ్యమును సలోకత్వమును గూడఁ బొందగలరు. అని ఈశ్వరార్పణమను బుద్ధితోఁ జేయంబడు కర్మ వేదనేచ్ఛంజేయును. దానినిగూర్చి భగవంతుడగు శ్రీకృష్ణుండుచెప్పెను. ఏది చేయుదువో, దేనిని తినుదువో, దేనిని హోమముజేయుదువో, దేనిని యిచ్చెదవో దేనిని నాకనుబుద్ధితోఁ జేయు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ము అని యర్జునునకు చెప్పెను. వానిలో సంస్కారము వలన చిత్తమునకు యోగ్యతగలుగును. వివిదిష ప్రవృత్తిని గలుగజేసి తప్పక జ్ఞానమును గలుగజేయును గాన మోక్షము గోరువారలకు నీశ్వరార్పణ బుద్ధియే శ్రేష్ఠము.

ఏవం సర్వేషాం కర్మణాం ప్రాశస్త్యం ఫలవత్త్వంచ ప్రతిపాదితం। అతస్తావద్గృహ్యోక్తానాం। గర్భాధానాది రూపసంస్కారకర్మణాం తదన్యేషామష్టకాది కర్మణాంచ కేషాంచిత్పద్ధతికృతౌత త్రత్యమంత్రార్థకథనే చాస్మాకముద్యమః॥

తా॥ ఇట్లు సర్వ కర్మలకు శ్రేష్ఠత్వము ఫలము గలుగుటయును చెప్పఁబడినది గనుక గృహ్యకర్మలయిన గర్భాధానాదులకు నితరములగు నష్టకాదులకుఁగూడ వాని పద్ధతిని చెప్పునప్పుడు మంత్రార్థము నుచ్చరించుటయందు మామతమని గ్రంథకర్త వాక్యము.

తతస్సర్వకర్మణాం ప్రయోగకాలేమంత్రాణా మార్షాదిజ్ఞానం కర్తవ్యం। తదర్థశ్చజ్ఞాతవ్యః। తదభావేవై గుణ్యం స్యాత్తథాచోక్తం॥

ఋషిశ్ఛందో దైవతంచ బ్రాహ్మణార్థం స్వరాద్యపి।

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అవిదిత్వాప్రయుంజానో మంత్రకంటక ఉచ్యతే॥

తా॥ గనుక తమతమ కర్మలకు ఋష్యాదులను మంత్రార్థ మును తెలిసిచేయనగును. అట్లు తెలియకున్న వైగుణ్య ము గలుగును. దానికి స్మృతి ఋషియు ఛందంబును దైవతమును మంత్రార్థమును స్వరమును తెలిసిచేయవల యును. అట్లు చేయనివాడు మంత్రకంటకుండగును. ఋషి తెలిసినందువలన నమ్మకము గలుగును. ఛందస్సువలన పాఠక్రమము దెలియును. దైవతమువలన ధ్యాతవ్యదేవ తాజ్ఞానము గలుగును. మంత్రార్థమువలన కర్మ విధి ఫల మును దెలియును స్వరమువలనను నర్థజ్ఞానము బాగుగదెలి యునుదీనికి తార్కాణము యదేంద్ర శత్రుస్స్వరతోపరా ధాత్ ॥ ఇంద్రశత్రువనుచో రాక్షసుండు స్వరముతప్పినం దువలన తనకే నాశముగోరినవాడయ్యెను. గాన స్వరా దులుగూడ నర్థజ్ఞానోప యుక్తంబులగును.

తథార్థజ్ఞానహీనసిందా అర్థప్రశంసాచ బహుధా శ్రూయతే॥

తా॥ అట్లర్థజ్ఞానము లేనివారి నింద్యయుగ గలవారి స్తో త్రమును చాలగ నబడుచున్నది.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

స్థాణురయంభారవాహః కిలాభూదధీత్య వేదం నవిజానా తియోఽర్థం। అర్థజ్ఞ ఇత్సకలం భద్రమశ్నుతే। నాకమేతిజ్ఞా నవిధూతపాప్మా ఇతి । యో వేద మధీత్యాప్యర్థంనవిజా నాతిసోఽయం పుమాన్ భారమేవహారతిధారయతి। స్థాణురితి దృష్టాన్తః ! భిన్నశాఖం వృక్షమూలం స్థాణుశబ్దేనోచ్యతే। సచయథేన్ధనార్థమే వోపయుజ్యతే। నతుపుష్పఫలార్థం తథా కేవలపాఠకస్య వ్రాత్యత్వం నాస్తీత్యే తావదేవనతు సమ్యగనుష్ఠానం స్వర్గాదిఫలసిద్ధిర్వాస్తీత్యనేన లోకప్రసి ద్ధిర్ద్యోత్యతే। అర్థజ్ఞ ఇతి । అర్థజ్ఞ ఏవసకలం భద్రమశ్నుతే। ప్రాప్నోతి।కించజ్ఞానవిధూతపాప్మాసన్। నాకమేతి।స్వర్గాద ఫలమేతి॥అస్మిన్నర్థేఋుగ్ద్వయంచ॥

ఎవ్వండధ్యయన మాచరించియు నర్థమును గనఁడో వాఁడు బరువును మోయు కట్టెవంటివాఁడు (అనఁగా కట్టె యెట్లు కాల్చుటకేగాని పుష్పఫలాదుల కుపయో గింపదో యట్లే యీతండు వ్రాత్యుండుగాకుండుటచే కర్మ కరణ సమర్థుండగునేగాని దానికి ఫలమగు స్వర్గాదులంబొం దనేరండనుట) అర్థముం దెలిసినచో సమస్తభద్రంబులుంగ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ల్గి జ్ఞానముగలిగి దానిచే పాపంబులంగొట్టి నాకము జేరును.

శ్రు॥ ఉతత్వఃపశ్యన్నదదర్శవాచముతత్వశ్శృణ్వన్న శృణోత్యేనాం। ఉతోత్వస్మై తన్వాంవిసస్రేజాయేవపత్య ఉశతీసువాసాః॥

వ్యా॥ ఉత। అపిచ। త్వః। ఏకపురుషః। పాఠమాత్ర ప ర్యవసితః। వేదరూపాంవాచం పశ్యన్నపి। నదదర్శ। న ప శ్యతీత్యర్థః। ఉత। అపిచ। త్వః। ఏకః। ఏనాం వేదరూపాంవా చం। శృణ్వన్। నశృణోతి। అర్థజ్ఞానరాహిత్యాత్స్వర శుద్ధిం తద్వినియోగంచనజానాతీత్యర్థః। అర్థంప్రశంసతి। ఉత। అపి చ। త్వస్మై। ఏకస్మై। అర్థజ్ఞాయ। వేదరూపావాక్। స్వకీ యాం। తన్వాం। విసస్రే। స్వరూపంప్రకాశయతి॥ తత్ర దృష్టాంతః। జాయా। సువాసాః। శోభనవస్త్రాద్యలంకృతా। ఉశతీకామయమానాపత్యే। స్వకీయాయఇవ। యథాస్వాం గానిప్రకాశయతి। తద్వత్॥

తా॥ ఒకానొకండు వేదపాఠమునుమాత్ర మాచరిం చియు దానిని చూచుచునే చూడకుండును. అనఁగా నర్థ జ్ఞానములేకుండుటచే బాగుగ తెలియుట తటస్థపడదని య ర్థము. ఒకానొకడు వినియు విననటులేయుండు। ఒకానొ కండు విని నర్థమునె ... వస్త్ర

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ములచే నలంకరింపఁబడిన భార్యవలే సర్వాంగములను జూపును.

శ్రు॥ ఉతత్వంసఖ్యేస్థిరపీతమాహుర్నైనంహిన్వంత్యపివాజినేషు। అధేన్వాచరతిమాయయైషవాచంశుశ్రువాఅఫలామపుష్పాం॥

వ్యా॥ పూర్వార్ధేనార్థజ్ఞప్రశంసా। ఉత్తరార్ధేతన్నిందా॥ ఉత। అపిచ। త్వమేకమర్థజ్ఞంపురుషం। సఖ్యే। వేదరూపాయావాచస్సఖ్యే। స్థిత్వా। స్థిరపీతంఆహుః। స్థైర్యేణ పీతామృతపానం। వేదార్థామృతపానం। అభిజ్ఞాఃకథయన్తి। కించ। వాజినేషు వాచామినేషు। వాజినాః ప్రగల్భాః। తేషు। మధ్యఏనం। వేదార్థకులం। నహిన్వంతి। చోదయితుంన కేపిప్రాప్నువన్తి। అనేనసహావివదితుమసమర్థత్వాత్। యస్త్వన్యఃపాఠమాత్రపరః। అఫలామపుష్పాం। పూర్వకాండోక్తధర్మజ్ఞానంపుష్పం। ఉత్తరకాండోక్తబ్రహ్మజ్ఞానం ఫలం। తద్రహితాంవాచంశుశ్రువాన్। భవతి। అధేన్వా। బ్రహ్మజ్ఞానరూపం క్షీరంనదోగ్ధీత్యధేనుః। తథామాయయాకపటరూపయాసహసంచరతి॥ వేదార్థజ్ఞానరాహిత్యాత్ పరమపురుషార్థం నలభతఇత్యర్థః।

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఒకానొకండు వేదమును చక్కఁగ జదివియు దాని యర్థమను నమృతపానము నాచరించినచో పెద్దలు వా గ్మలయ్యును వానిని కదపఁజాలరు. లేక పాఠమాత్రము నే చేసినచో పూర్వకాండమను పుష్పమును ఉత్తరకాం డమను ఫలమును లేనివాక్కును వినియు బ్రహ్మజ్ఞానమను పాలు లేని కపటరూపమగు నావు నాశ్రయించినవాఁడగును. పరమపురుషార్థమును పొందడనుట. అనఁగాఁ బూర్వ మీమాంస। దానియందు కర్మలు ప్రతిపాదింపబడును. దీనికి పూర్వభూమికలనియు పేరుగలదు. అవి యేడని వసిష్ఠుడు చెప్పెను. అవి పుష్పరూపము లేకాని ఫలమునంచుటకు త్తర కాండ నందవలయును. అవి చాలగగలవని కొందఱి యభి ప్రాయము ఏడేనని వసిష్ఠుని యభిప్రాయము. ఉత్తమీమాం సమనియు పేరుగలది. వేదాంతము దానికిని భూమిక లేడు. అవి యేవియనగా వివిదిషా। విచారణ। తనుమానసా। సత్వాపత్తి! అసంసక్తి। పదార్థాభావిని। తుర్య ఇతి ఇట్లు సేతుబంధమందుగల యోగము లనునవి. ఈ పూర్వ కాండ రూపమగు పూర్వమీమాంసము నీశ్వరార్పణ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

బుద్ధితో చేసిన వివిదిషగలుగును.

ఏవంప్రసంగవశాన్మంత్రార్థజ్ఞానపూర్వక మేవవిహిత తత్వమాత్రబుధ్యాక్రియమాణానాం కర్మణాం సంస్కారజనకత్వం। ఈశ్వరార్పణబుధ్యాక్రియమాణానాం కర్మణాం వివిదిషాజనకత్వమితి సర్వేషామతిశయఫలం ప్రదర్శ్యప్రకృత సంధ్యావందనేపి విశేషతః తత్ఫలం ప్రదర్శ్యతే॥

తా॥ ఇట్లు ప్రసక్తానుప్రసక్తిచే మంత్రార్థజ్ఞానముతో చేయతగినది యను బుద్ధితో చేసిన కర్మలకు గట్టిసంస్కారము గలుగుటను వానినే యీశ్వరార్పణముగాఁ జేసినచో వివిదిష కలుగుటయును వక్కాణించి దానినే ప్రకృతము సంధ్యావందనమునకుఁ గూడ నావశ్యకమైనదానిఁగాఁ జెప్పుచున్నాఁడు.

## సంధ్యావందన ఫలనిరూపణం.

అత్రపరాశరః॥ ఇచ్చోప్పపరాశరుండు వక్కాణించెను.

శ్లో॥ సంధ్యాముపాసతేయేతు సతతంసంసితవ్రతాః।
విధూతపాపాస్తేయాన్తిబ్రహ్మలోకంసనాతనం॥

తా॥ ఎవ్వరు నియమముగలవారలై సంధ్యావందనము నాచరింతురో వారు పాపములను వదలి శాశ్వతమగు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

బ్రహ్మలోకమును జేరుదురు.

కాలేతునన్దితాసన్ధ్యాస్వర్గమోక్షప్రదాయినీ ।
అకాలేవన్దితాసన్ధ్యాసాచవంధ్యావధూరివ॥

తా॥నిర్ణయింపఁబడిన సమయములకుఁ జేసిన సన్ధ్యస్వర్గమును మోక్షమునిచ్చును. నిర్ణయకాలమును మించి చేసిన యెడల గొడ్రాలువలె వ్యర్థమగును. (ఇందు స్వర్గఫలము గూడఁ జెప్పఁబడెను.)

గౌతమః। గౌతముఁడు

అకరణె తత్క్షణదోషోదర్శితః

తా॥ చేయనిచో నాక్షణముననే దోషము గలుగునని చెప్పెను.

సంధ్యాహీనోశుచిర్నిత్యమనర్హస్సర్వకర్మసు।
యదన్యత్కురుతెకర్మనతస్యఫలభాగ్భవేత్॥

తా॥ సంధ్యావందనమాచరింపనివాఁడు నిత్యమున పరిశుద్ధుఁడు కర్మలను చేయుట కర్హుండుగాఁడు. ఇతర కర్మలెన్ని చేసినను వ్యర్థములే॥

గోభిలోపి॥ గోభిలుఁడను నతండును చెప్పియున్నాఁడు॥

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సంధ్యాయేన నవిజ్ఞాతా సంధ్యాయేనానుపాసితా ।

జీవమానోభవేచ్ఛూద్రో మృతశ్శ్వాభిజాయతే॥

తా॥ సంధ్యావందనము నెవ్వఁడు చేయఁడో వాఁడు జీవిం
చినకాలమున శూద్రుఁడుగను మరణానంతరము కుక్క
జన్మము కలవాఁడుగను పరిణమించును.

కూర్మపురాణేపి॥ కూర్మపురాణమున

యోయత్నంకురుతేనిత్యం ధర్మకార్యేద్విజోత్తమః।
విహాయసంధ్యాప్రణతిం సయాతినరకాయుతం॥

తా॥ ఎవ్వఁడు నిత్యము ధర్మకార్యమాచరించునప్పుడు సం
ధ్యావందనమును మానినచో పదివేలనరకములం జెందును॥

తస్మాన్నోల్లంఘనంకార్యం సంధ్యోపాసనకర్మణః
తెహాంతిసూర్యంసంధ్యాం యేనోపాస్తింకురుతేయతః॥

తా॥ గాన సంధ్యోపాసనమును వదలఁదగదు. అట్లు వద
లినవాఁడు సూర్యహత్యను జెందును.

ఏతత్సర్వమనాతురవిషయం

తా॥ ఇదియంతయు నేతొందరలు లేనివారినిగూర్చి చెప్పఁ
బడియున్నది.

యద్దాహయాజ్ఞవల్క్యః॥ యాజ్ఞవల్క్యుఁడు చెప్పి
యున్నాఁడు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అనార్తశ్చేత్సృజేద్యస్తుసవిప్రశ్శూద్రసంజ్ఞికః।
ప్రాయశ్చిత్తీభవత్యేవలోకేభవతినిందితఇతి॥

తా॥ ఎవ్వఁడు తొందరలు లేకుండ సంధ్యావందనమును జేయఁడో వాఁడు శూద్రుడు వానికి ప్రాయశ్చిత్తముతప్పదు. వాఁడు చాలా లోకమునచే నిందింపఁబడుచుండును.

విష్ణుపురాణేపి॥ విష్ణుపురాణమునందును

సర్వకాలముపస్థానం సంధ్యయోఃపార్థివేష్యతే।
అన్యత్రసూతకాశౌచవిభ్రమాతురభీతిషు॥

తా॥ రెండు సంధ్యలను నుపస్థానము జేయుట ముఖ్యము సూతకమృతములు గలిగినవాఁడును, భ్రాంతిఁజెందినవాఁడును, ఆతురుడును, భయస్థుఁడును కాలము నతిక్రమించి చేసినను తప్పులేదు.

అస్యవివరణంస్మర్యతే॥ దీనికి వివేకముస్మృత్యుక్తమైయున్నది.

రాష్ట్రభంగేనృపక్షోభేరోగార్తాసూతకేపిచ।
దేవాగ్నిద్విజవిద్యానాంకార్యేమహతిసంస్థితే।
సంధ్యావందనవిచ్ఛిత్తిః నదోషాయకదాచన॥

తా॥ రాజ్యమునకు భంగము గలిగినప్పుడును రాజవిద్వర

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ముగలిగినప్పుడును, రోగముగలిగినప్పుడును సూతకముగలిగినప్పుడును దేవతలయొక్కయు నగ్నియొక్కయు బ్రాహ్మణునియొక్కయు, విద్యలయొక్కయు గొప్పకార్యములు సంభవిల్లినప్పుడును సంధ్యావందనము మానినను దోషము లేదు.

యత్తుపులస్త్యేనోక్తం॥ పులస్త్యుండునుచ్చరించెను.

సంధ్యామిష్టించహోమంచయావజ్జీవంసమాచరేత్
నత్యజేత్సూతకేవాపిత్యజన్గచ్ఛేత్యధోగతిమితి॥

తా॥ సంధ్యను, ఇష్టిని, హోమమును బ్రతికియున్నంత కాలమును చేయవలయును. సూతకమునఁగూడ వదలగూడదు వదలినచో నధోగతిని చెందును.

తన్మానసికసంధ్యాభిప్రాయకం॥

తా॥ అది మానసిక సంధ్యనుగూర్చి చెప్పినవచనము.

జాతకేమృతకేచైవ సంధ్యాకర్మనసంత్యజేత్।
మనసోచ్చారయేన్మంత్రాన్ప్రాణాయామమృతేద్విజః

తా॥ జాతాశౌచమందును, మృతాశౌచమందును సంధ్యను మానవలదు. ప్రాణాయామమును వదలి మనమున మంత్రముల మాత్ర ముచ్చరింపవలయును.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తేనైవోక్తత్వాత్ ॥ ఆపులస్త్యునిచేతనే నిదియుచెప్పఁబడెను.

ఏవంచసూతకేమానసికసంధ్యాయాసాకల్యేనానుష్ఠానేప్రాప్తే। అర్ఘ్యాంతాయాఏవసంధ్యాయా అనుష్ఠానమాహాశ్వలాయనః॥

తా॥ ఇట్లు సూతకమున మానసిక సంధ్యావందనావశ్యకతఁ గలుగఁగా నర్ఘ్యమువఱకు సంధ్యానుష్ఠాన మావశ్యకమని యాశ్వలాయనులు చెప్పియున్నాఁడు.

అర్ఘ్యాంతాసూతకే సంధ్యాస్నానంస్యాదపికించన॥

తా॥ సూతకమునం దర్ఘ్యముదాఁకసంధ్యవార్చుటయావశ్యకము స్నానమును తప్పదు.

పైఠీనసిరపి॥ సూతకే సావిత్ర్యాచాంజలిం ప్రక్షిప్యప్రదక్షిణంకృత్వాసూర్యంధ్యాయన్ నమస్కుర్యాత్ సావిత్ర్యామనసేతి శేషః॥

తా॥ సూతకమున సావిత్రిని మనమున నుచ్చరించి యర్ఘ్యాంజలిని విడిచి ప్రదక్షిణమాచరించి సూర్యునిధ్యానించి నమస్కరింపవలయును.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఏవంవిదిత్వాయస్సంధ్యాముపాస్తేసంశ్రితవ్రతః।
దీర్ఘమాయుస్సవిందేతసర్వపాపైఃప్రముచ్యతే॥

తా॥ ఇట్లు తెలిసి సంధ్యనుపాసించినచో దీర్ఘాయురాయముగలుగును. పాపములు నశించును.

ప్రాయశ్చిత్తంస్మృత్యంతరేభిహితం।
సంధ్యాకాలేత్వతిక్రాంతేస్నాత్వాచమ్యయథావిధి
జపేదష్టశతందేవీం తతస్సంధ్యాంసమాచరేత్॥

తా॥ సంధ్యావందనకాలము దాటినచో స్నానించి యథా విధిగ నూటయెనిమిది సంఖ్యగల గాయత్రిని జపింపవలయును.

ఏకాహంసమతిక్రమ్య గాయత్ర్యాఅయుతంజపేత్ గౌణకాలఇత్యర్థః॥

తా॥ ఒకరోజున సంధ్యావందనము మానినచో నయుత (మనఁగా పదివేలు) గాయత్రిని చేయవలయును.

కాలాతిక్రమణేచైవ త్రిసంధ్యమపిసర్వదా।
చతుర్థార్ఘ్యంప్రదాతవ్యం గాయత్ర్యాశ్శిరసాసహ॥

తా॥ ముఖ్యకాలమతిక్రమించినచో మూఁడు సంధ్యలందును నాల్గు యర్ఘ్యములను శిరస్సుతో గూడిన గాయత్రిచే

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నిష్ప్రవలయును.

రాత్ర్యంతయామనాడ్యౌ ద్వే సంధ్యాకాలః ప్రశస్యతే।
దర్శనాద్రవిరేఖాయా స్తదంతో మునిభిస్స్మృతః॥

తా॥ వేఁకువను రెండు గడియలు ముఖ్యమగు సంధ్యాకాలము. సూర్యరేఖ కనబడినతోడనే సంధ్యాకాలమంతమగునని మునులు చెప్పిరి.

ఉదయాత్ప్రాక్తనీ సంధ్యాఘటికాత్రయ ఇష్యతే।
సాయంసంధ్యాత్రిఘటికాహ్యా స్తాదుపరిభాస్వతః॥

తా॥ ఉదయమునకుముందు ప్రాతస్సంధ్యమూఁడు గడియలకాలము గలది. సాయంకాల సంధ్య సూర్యుఁడస్తమించిన వెనుక మూఁడు గడియలకాలము గలది.

సంధ్యోత్తమాతృతీయాంశే పంచధాంశేం దినస్యతు।
మాధ్యాహ్నికేత దూర్ధ్వంవాపూర్వంవాస్యాద్ద్వివైవహి।
త్యుపక్రమ్య। నప్రాతర్న ప్రదోషశ్చ సంధ్యాకాలోతి
వర్తతే। ముఖ్య కల్పోనుకల్పశ్చ సర్వస్మిన్ కర్మణిస్మృ
తఇతి॥

తా॥ దినము నైదుభాగములు చేయఁగా మూఁడవ యంశమందు మాధ్యాహ్నిక సంధ్య యుత్తమము. ఆ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మూఁడవయంశకు పూర్వమునఁగాని పరమునఁగాని చేయ
వచ్చును. ప్రాతఃకాలమందుగాని ప్రదోషమందుగాని సం
ధ్యాకాలమునకు ముఖ్యకాలమని గౌణకాలమనియు విభా
గము గలదు.

ప్రాతః ప్రదోషయోస్సంపూర్ణయో స్సంధ్యాకాలత్వే
నోక్తత్వాన్మాధ్యాహ్నిక సంధ్యాయా దివాభాగ
స్సంపూర్ణో గౌణకాలః ।

తా॥ ప్రాతస్సాయంస్సంధ్యలకు ప్రాతఃప్రదోషము
లు పూర్ణముగా కాలమైనట్లు మాధ్యాహ్నికమునకు దిన
మంతయు గౌణకాలము.

అనుకల్పే చతుర్థార్ఘ్యప్రదానం ప్రాతః ప్రదోషయో
రేక కాలాతిక్రమేష్ట శతగాయత్రీజపః ఽనాతిక్రమేయుత
గాయత్రీతి వేదితవ్య మతఏవసంధ్యాయాః కిం ఫలమిత్యుచ్య
మానే ఏతత్పూర్వోత్తర పర్యాలోచన యా బ్రాహ్మణ్య
సంపాదనపూర్వక మాగామిసంచిత పాపకర్మ నివృత్తి
ద్వారా పరమేశ్వరప్రీతిః।

తా॥ ముఖ్యకాలాతిక్రమణమందు నాల్గవయర్ఘ్య మి
CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri
మును ప్రాతః ప్రదోషములను గౌణకాలముగూడ నతిక

ఘించినచో పదివేలు గాయత్రీ జపములను సలుపనగును. అట్లయిన సంధ్యావందనమునకు ఫలమేమియని విచారింపగా బ్రాహ్మణ్యమును రక్షించుచు నాగామిసంచితముల నశింపఁజేయుచు పరమేశ్వర ప్రీతియగుటయే ఫలము. సంకల్పము గూడ నిటులనే జేయనగును. ఆగామియనఁగా రాఁబోవునది. సంచితమన నిపుడు సమకూడినది.

తథాచ తైన సంధ్యోపాసనే ననసాలోక్యాది సంభవతి। అకరణే ప్రత్యవాయః। ఫలంతు నాస్తీత్య పరిశీలకానాం వ్యవహార ఇతిజ్ఞాయత ఏవేతిప్రకృతమనుసరామః।

కావున నీ సంధ్యావందనముచేత సాలోక్య సారూప్య సామీప్య సాయుజ్య కైవల్యములను నైదుభాగములును లేవు. చేయకుండిన ప్రత్యవాయము. ఫలములేదనునది యవివేకుల వ్యవహారమని తెలియుచున్నే యున్నది. ఇంతట ప్రస్తుతమును విచారింతము.

SRI JAGADGURU VIS
JNANA SIMHASAN J
LIBRA
Jangamawadi Ma
Acc. No. 74

## సంధ్యాశబ్దార్థవిచారః

అథసంధ్యావందనస్య ప్రకృతత్వేనతద్వ్యాఖ్యానాత్పూర్వం సంధ్యాశబ్దార్థో విచార్యతే। ఉభే స్తే సంధి వే

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ళాయాం నిశాయాదివసస్యచ। తామేవ
సంధ్యాంతస్మాత్తు ప్రవదంతి మనీషిణ ఇతి

తా॥ ఇటుపైన సంధ్యావందనము ప్రక్రృతము గనుక ముందు సంధ్యాశబ్దార్థమును విచారించెదము. సంధ్య యనఁగా రాత్రికి పగలుకు నడుమ నుపాసింపఁబడునదిగాన సంధ్యయని పెద్దలు నుడివిరి.

గృహ్యాపరిశిష్టకారోపి సూర్యనక్షత్ర వర్జితాయాహోరాత్రయోస్సంధిః సాసంధ్యాసమాఖ్యాతామునిభిస్తత్త్వ దర్శిభిరితి॥

తా॥ సూర్యుడు నక్షత్రములులేని త్రేపవళ్ల సంధికాలము సంధ్యయని తత్వవేత్తలగు మునులు చెప్పిరని గృహ్యాపరిశిష్టమందును గలదు.

ఆగమేపి। రాత్రిరూపాయతోదేవీ దివారూపోమహేశ్వరః। తయోస్తుసంగమే సంధ్యాంప్రవదంత్యుభయాత్మికాం

తా॥ దేవి రాత్రిరూపమును మహేశ్వరుడు దివారూపుఁడునుగాన నిద్దఱిసంధియు నుభయరూపమగుసంధ్యయనంబడును. అని యాగమములలో చెప్పఁబడి యున్నది.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఆచమన ప్రయోగాదివిచారః

ఏవంసంధ్యాశబ్దార్థముక్త్వా శుచిఃకర్మాణికుర్వీతేత్యాదిస్మృతిపర్యాలోచనయా శుద్ధ్యర్థాచమనాది ప్రయోగ ప్రదర్శన పూర్వకం తత్రత్యమంత్రార్థోవక్ష్యతే॥

తా॥ ఇట్లు సంధ్యాశబ్దార్థమును చెప్పి, శుచియై కర్మల నాచరింపవలయునను విధిచే శుద్ధికొఱ కాచమన ప్రయోగమును చెప్పుచు నా మంత్రార్థమునుగూడ వక్కాణించుచున్నాఁడు.

అథకర్మవిశేష ఆచమనవిశేషస్స్మర్యతే॥

తా॥ ఇప్పుడు కర్మభేదముచే నాచమన భేదము నుచ్చరించుచున్నాఁడు.

శౌచాచారే తథాపానే స్పృష్ట్వాస్పృష్టేచపర్వణి
పౌరాణాచమనంకుర్యాన్నామభిః కేశవాదిభిః॥

తా॥ శుద్ధినిమిత్తమందును దాహానంతరమందునుస్పృష్టాస్పృష్టపర్వయందును పౌరాణాచమనము చేయవలయును.

సంధ్యాయాం కర్మకాలేచ స్మృత్యాచమనముచ్యతే
బ్రహ్మయజ్ఞేచసర్వేషాం శ్రౌతాచమనమిష్యతే॥

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తా॥ సంధ్యావందనమందును తదితరకర్మలయందు

ను స్మృత్యాచమనము జరుపవలయును బ్రహ్మయజ్ఞము-
నందు శ్రౌతాచమనము ముఖ్యము.

ఆదిత్యోవరుణస్సోమోవహ్ని ర్వాయు స్తథైవచ|
విప్రస్యదక్షిణేకర్ణే సర్వే తిష్ఠంతి దేవతాః|

తా॥ సూర్యుఁడు వరుణుఁడు చంద్రుఁడు అగ్ని వాయువు, వీరలు విప్రుని దక్షిణకర్ణమందు నివసింతురు. ఇంక నితర దేవతలందరు నుందురు. వేదపాఠము చేసిన యతఁడు విప్రుఁడు॥

తథాచ॥ సమ్యగాచమ్యతోయేన క్రియాఃకుర్వీతవా
శుచిః| దేవతా నామృషీణాంచ పితౄణాం
చైవయత్నతః॥

తా॥ బాగ చక్కఁగ నాచమించి ప్రయత్నము-
తో దేవతలకు ఋషులకు పితృదేవతలకు కర్మల నాచరింపవలయును.

కుర్వీతాలంబనంవాపి దక్షిణశ్రవణస్యచ| యతోవిభవతోప్యేవం పూర్వాభావేతతఃపరం| నవిద్యమానే పూర్వోక్తేచోత్తర ప్రాప్తిరిష్యతఇతి॥

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తా॥ లేక దక్షిణకర్ణస్పర్శనైన గావించవల-

యును. పురాణాచమనము చేయ నశక్తుండగువాఁడు దక్షిణకర్ణస్పర్శను తప్పక చేయవలయును.

అత్రగౌతమః॥ ఇచ్చట గౌతమవచనము గూడఁ గలదు.

కుశపూతంపి బేత్తోయంకుశపూతముపస్పృశేత్ ।
కుశాగ్రమిశ్రితంతోయం సోమపానం దినేదినే॥

తా॥ దర్భనుండి జారిన నీటిని ప్రతిదినము త్రాఁగుట మంచిది. దర్భాగ్రమునుండి జారిననీరు సోమపానమగును.

కనిష్ఠ దేశిన్యంగుష్ఠమూలా నికరస్యాగ్రంచక్రమాత్ । ప్రజాపతి పితృబ్రహ్మతీర్థాని। దక్షిణకరం గోకర్ణాకృతి వత్కృత్వాజలం గోకర్ణాకృతినాత్రిః। పిబేద్బ్రహ్మతీర్థేన సమస్తాంగుళిభిస్సాహిత్యమేవగోకర్ణాకృతిః। తేనపీతంసోమసమం। అసాహిత్యం సురాసమం। ఇత్యాది॥

తా॥ చిటికనవ్రేలికి క్రిందను బొటనవ్రేలుకు మొదటను చేతికి చివరభాగమును వరుసగా ప్రజాపతి పితృ బ్రహ్మలయొక్క తీర్థములనబడును. కుడిచేతిని యావుచెవి వలెఁబట్టి యుదకమును మూఁడుమాఱులు బ్రహ్మతీర్థము తోఁ ద్రావవలెను. అన్ని వ్రేళ్ళు కలిసియుండుటే గోకర్ణా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కృతి యనంబడును. దానితోఁ ద్రాగిన సోమపానమునకు సరియగును. విడియున్నచో సురాపానతుల్యము.

ఆచమనమున నవయవస్పర్శము.

అంగుష్ఠమూలేనాస్యందిర్ద్విః పరిమృజ్య। ప్రదేశిన్యాదిభిస్తిసృభిస్సహితాభిస్సకృదుపస్పృశేదాస్యార్థం। తోయంగృహీత్వా దక్షిణేనప్రోక్షణగ్ంసవ్యహస్తే పాదయోశ్శిరసశ్చతదనంతరం శిఖాంచోపస్పృశేత్॥

తా॥ బొటనవ్రేలికి మొదటిభాగముచే అనఁగా మణికట్టుచే ముఖమును రెండేసిమాఱులు తుడువవలయును. కలసిన ప్రదేశిన్యాదులచే నొక్కమాఱాస్యమును ముట్టునది. ఉదకమును తీసికొని కుడిచేతిచే యెడమచేతియందును పాదములందును శిరస్సునను చల్లుకొనవలయును. పిమ్మట జుట్టుముడిని తాకవలయును.

అంగుష్ఠతర్జనీభ్యాంనాసికే. అంగుష్ఠమధ్యమాభ్యాం చక్షుషీశ్రోత్రే అంగుష్ఠానామికాభ్యాం। అంగుష్ఠకనిష్ఠికాభ్యాంనాభిం। తథాతలేనహృదయంగ్। శిరస్సమస్తాంగుళిభిస్స్పృశేత్ అగుళ్యగ్రైరంసౌ। ద్వాద్విజశ్శుద్ధిమవాప్నుయాత్॥ ఇతిపురాణాచమనమ్.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తా॥ బొటనవ్రేలు రెండవవ్రేలుకలసిన ముద్రతో ముక్కులను తాఁకునది. బొటనవ్రేలు నడిమివ్రేలు కలసిన ముద్రతోఁ గన్నులు తాఁకునది. బొటనవ్రేలు ననామికను కలిపిచెవులను తాకునది. బొటనవ్రేలు చిటికనవ్రేలు కలసిన ముద్రతో బొడ్డును తాకునది. అరచేతిచే హృదయమును ముట్టునది. కలసిన వ్రేళ్లచే శిరస్సును తాఁకునది. వ్రేళ్ళయొక్క చివరలచేత భుజములను రెంటినితాఁకునది. దీనిచే బ్రాహ్మణుడు శుద్ధుఁడగును. ఇట్లు పురాణాచమనము.

## శ్రౌతాచమనం.

శౌనకః॥ దేవ్యాఃపాదైస్త్రిభిఃపీత్వాబ్లింగైర్నవభిస్స్పృశేత్
సప్తవ్యాహృతిభిశ్చైవ శిరోమంత్రైశ్చ పంచభిరితి

తా॥ గాయత్రియొక్క పాదత్రయముచే మున్మూఁడు నీరుత్రాగునది. పిమ్మట నాపోహిష్ఠాదులగు తొమ్మిది మంత్రములచేతను ఏడువ్యాహృతులచేతను అయిదు శిరోమంత్రములచేతను అంగములను తాఁకునది. అని శౌనకుండు చెప్పెను.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అశ్వలాయనోపి ॥ గాయత్ర్యాచపిబత్యాదావాపోహి నవభిస్స్ప్రశేత్ । వ్యాహృతీభిశ్శిరో మంత్రై రంగాని బ్రహ్మయజ్ఞకే॥

తా॥ దీనికి నదియే యర్థము ఈ మంత్రములు ముందు వివరింపఁబడును.

### అంగవివరణమ్

పాణిగండద్వయంచోష్ఠౌపాణిపాదౌశిరోముఖం।నాసాబిలేక్షిణీశ్రోత్రే నాభిహృన్మస్తకాంసకాఇతి॥

కేశవ నారాయణ మాధవాయను నామములచే స్వాహాంతముగా మూమ్మాఱు త్రాపి పిదప పాణుల యందు గండద్వయము, పెదవులు, చేయి, కాలు, శిరస్సు ముఖము, ముక్కులు, కన్నులు, చెవులు బొడ్డు, హృదయము, శిరస్సు, భుజములు, తాఁకునది. పై రెండాచమనములకు స్థానములివియే.

### స్మార్తాచమనము

స్మార్తాచమన ఉదకపానే మంత్రవిశేషమాహాశ్వలాయనః। ప్రణవేన త్రిరాచామే ద్దక్షిణేనతుపాణినేతి।అంగోపస్పర్శనం పూర్వోక్త మేవతూష్ణీంకర్తవ్యమితి॥

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తా॥ స్మార్తాచమనమున నాశ్వలాయనుఁడు మాత్రముదకము త్రాగునప్పుడు ఓంకారముతోఁ త్రాగవలయునని చెప్పెను. మిగిలిన యంగములు తాకుటకుపూర్వమువలెనే. మంత్రములు లేవు.

అనఁగా గోవిందవిష్ణు నామములచే రెండు చేతులను మధుసూదన, త్రివిక్రమ, ఈ నామములచే గండద్వయమును, వామన శ్రీధర ఈ నామములచే పెదవులు రెండును, ఋషీకేశ దీనిచే చేతిని, పద్మనాభ దీనిచే ముఖమును, వాసుదేవ ప్రద్యుమ్న ఈ నామములచే ముక్కుపుటములను అనిరుద్ధ పురుషోత్తమ ఈ నామములచే కన్నులను, అధోక్షజ నారసింహ ఈ నామములచే చెవులును, అచ్యుత దీనిచే బొడ్డును, జనార్దన దీనిచే హృదయమును, ఉపేంద్ర దీనిచే శిరమును, హరే శ్రీకృష్ణ వీనిచే రెండుభుజములును తాఁకునది. ఇట్లే శ్రౌతాచమనమందును మంత్ర విభాగము చేయవలయును. స్మార్తాచమనమున మంత్రము లేకుండ తాఁకవలయును.

ఆచమనఫలం

వ్యా[illegible] స్పర్శన

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మాచరేత్ । బ్రహ్మాది స్తంబపర్యంతం జగత్సపదితర్పయేత్

తా॥ ఇట్లు యే బ్రాహ్మణుఁడు నిత్యము సంగముల త్యాగముచుండు నాతండు బ్రహ్మ మొదలు స్తంబమువఱకు నుండు జంతువులను దృప్తి చేయువాఁడగునని వ్యాఘ్రపాదుఁడు చెప్పెను.

అకరణే దోషమాహ।యః క్రియాఃకురుతే మోహాదనాచమ్యైవనాస్తికః భవన్తీహవృథాతస్య క్రియాస్సర్వాన సంశయః।ఇతి। అతబోధాయనః । హోమే భోజనకాలేచ సంధ్యయోరుభయోరపి। ఆచాన్తః పునరాచామేజ్జపహోమార్చనాదిష్వితి॥

తా॥ ఈ యాచమనమును చేయకున్న దోషము చెప్పుచున్నాఁడు। ఎ క్రియలను మోహాముచే నాచమింపక నాస్తికుఁడై చేయునో అట్టివానికి నవిఫలములనివ్వవు॰ హోమమున భోజనమున రెండు సంధ్యలను నాచమన ద్వయ మాచరింపవలయును. జపహోమార్చనలయందు కూడ నిట్లే చేయవలయును అని బోధాయనమహర్షి చెప్పియున్నాఁడు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఎతేనశౌచాచార ఇతివచనేన శుద్ధిసంపాదనారంభే కేశ

వాదినాపురాణాచమనం సంధ్యాయామిత్యాదినాకర్మాంగస్మృత్యాచమనం కార్యమిత్యర్థో వక్ష్యతే॥

తా॥ ఇఁకను శౌచాచారం అను వచనమువలన ప్రాప్తమగు శుద్ధినిసంపాదించుటకొఱకై పురాణాచమన మంత్రార్థముం జెప్ప నారంభించుచున్నాఁడు.

కేశవాది నామార్థకమ్.

కశ్చ ఈశశ్చ । కేశౌ । బ్రహ్మరుద్రావిత్యర్థః। తాభ్యాం పాలకత్వేన వృత ఇతి కేశవః॥

తా॥ బ్రహ్మరుద్రు లిద్దఱు కేశులని చెప్పఁబడుదురు. వారిరువురచేఁ బరిపాలించుటకు వరింపఁబడినవాఁడుగాన కేశవుఁడని విష్ణువునకు నామము. ఇది స్వాహాంతము, ఉదపానమాచరించునది.

నారాః ఆపః అయనం స్థానం యస్యసః నారాయణః॥

తా॥ నారములన నుదకములు, అవి నిలయముఁగా గలవాఁడుగాన నారాయణుఁడగును. ఇదియు స్వాహాంతమగు నుదపానమంత్రమయ్యెయున్నది.

మాయాః లక్ష్మ్యాః ధవః మాధవః॥

తా॥ మా యన లక్ష్మి, ఆమెకు భర్తగాన మాధ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వుండయ్యెను. ఇదియు స్వాహాంతమగు నుదపాన మం
త్రమే ఇట్లీ మూటిచే నుదపాన మాచరింపవలయును.

గాః గోభిః విందతీతి గోవిందః। వేదవేద్య ఇత్యర్థః॥

గోవులనఁగ వాక్యములు. వానిని గాని వానిచేతగాని తెలిసినవాఁడు తెలియఁబడువాఁడు గాన గోవిందుఁడగును. వేదములచేఁ దెలియదగిన వాఁడని యర్థము.

వ్యాప్నోతీతి విష్ణుః సర్వవ్యాపక ఇత్యర్థః।

తా॥ అంతట వ్యాపించువాఁడుగాన విష్ణుఁవ గును. (సర్వవ్యాపకుఁడనుట)

మధునామానం రాక్షసం సూదయతీతి మధుసూదనః

తా॥ మధువను రాక్షసుని చంపినవాఁడుగాన మధుసూదనుఁడగును.

త్రీణి విక్రమాణి పాదన్యాసా యస్య త్రివిక్రమః।

తా॥ మూఁడు పాదముల మూఁడుచోట్ల నుంచు టచే త్రివిక్రముండాయెను. బలిచక్రవర్తిని వంచించుటకు వామనుఁడై మూఁడడుగులు భూదానమడిగి భూమ్యా కాశములయందు రెంటి నుంచి మూఁడవ యడుగును

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వాని శిరముపై నునిచి పాతాళమునకు ద్రొక్కెనను నితి హాసము గలదు.

త్రైవివామనత్వాద్వామనః॥

తా॥ అచ్చుటనే అనఁగా బలిచక్రవర్తిని వంచిం చుటయందే వామనః పొట్టివాఁడాయెను గాన వామ నుం డనంబడును.

శ్రియఃధరః। లక్ష్మీధర ఇత్యర్థః॥

తా॥ శ్రీనిధరించినవాఁడు గాన శ్రీధరుఁడగును. లక్ష్మీధరుండని యర్థము.

హృషీకాణామింద్రియాణామీశోనియంతా॥ ఇంద్రియ ప్రవర్తక ఇత్యర్థః।

తా॥ హృషీకములన నింద్రియంబులు వాని నియ మించువాఁడు గాన హృషీకేశుఁడగును. ఇంద్రియములను ప్రవర్తింపఁజేయువాఁడని యర్థము.

పద్మంనాభౌయస్య సఃపద్మనాభః॥

తా॥ పద్మము నాభియందు గలవాఁడుగాన పద్మ నాభుండనంబడును.

CC-0 Jangamwadi Math Collection. Digitized by eGangotri

దామవమదరంయస్యసః దామోదరః। భక్తపరాధీన ఇత్యర్థః॥

పూలమాలికవంటి హృదయముగల యతండుగాన దామోదరుండనందగును. భక్తులయందతి మృదుహృదయుండనుట.

సమ్యక్కర్షత్యాకర్షతిపరిపాలనార్థం ప్రాణిన ఇతి సంకర్షణః। వసతీతివాసుః। సచాసౌదేవశ్చవాసుదేవః ॥ ప్రకృష్టంద్యుమ్నం ప్రాణినామితిప్రద్యుమ్నః। ప్రకృష్టధనవత్పుకలత్రప్రాణి స్పృహణీయ ఇత్యర్థః। యోగిభిరపినిరోద్ధుమశక్యత్వాదనిరుద్ధః। పురుషుదేహేషు శేరత ఇతిపురుషాః తత్తదిన్ద్రియాధిష్ఠాతారః। తేషూత్తమః ॥ తన్నియంతృత్వాదితిభావః॥

తా॥ పరిపాలించుటకై బాగుగ నాకర్షించువాఁడుగాన సంకర్షణుండగును. సర్వప్రాణులయందుండు దేవుండుగాన వాసుదేవుండగును. అధికమగు ధనములే ప్రాణులకెల్లరకుం గోరఁదగినవాఁడగుటచే ప్రద్యుమ్నుఁడగును. యోగులచేనైన కట్టుటకు దుర్లభుఁడుగాననని రుద్ధుండగును. దేహములయందుండువారిలో నుత్తముండు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గాన పురుషోత్తముం డగును. తత్తదింద్రియాధిష్ఠాతలను నియమించువాఁడనుట.

అధఃకృతమక్షజ మింద్రియజన్యజ్ఞానం
యేనసః అధోక్షజః భక్తానామిత్యర్థః.

తా. ఇంద్రియములవలనఁ గలుగు జ్ఞానమును (అనఁగా విషయలౌల్యమును) తక్కువఁగఁ జేయువాఁడు కాన నధోక్షజుం డనంబడును.

నరశ్చాసౌ సింహశ్చ నరసింహః సఏవనారసింహః. నవిద్యతేచ్యుతిర్యస్యసః అచ్యుతః. నాశరహితఇత్యర్థః జనమర్దతిప్రాప్నోతీతి జనార్దనః. జనైరర్ద్యతఇతివా జనార్దనః ఇంద్రాదుపర్యుపేంద్రః తస్మాదప్యుత్కృ... ఇత్యర్థః. దుష్టాన్ హరతీతిహరిః శిష్టసంరక్షణార్థ... మా భావః. కృషతి భక్తజనపాపానితికృష్ణః. కృష్ణ... క య ద్వా కృష్ణః, ఏతే నామమంత్రానమోంతాన కాల జ్ఞేయం. స్మృత్యాచమనమంత్రార్థ స్త్వగ్రేవ... మడమ ప్రకృతమనుసరామః. ...

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri.

తా. పూర్వకాయమందు నరరూపము నుత్తర కాయమందు సింహరూపుఁడును గాన నరసింహుడనంబడును. చ్యుతి యనఁగా నాశము. అది లేనివాఁడు గాన నచ్యుతుం డనంబడును. జనులను పొంది ప్రవర్తించువాఁడు గానజనార్దనుండగును జనులచేఁ గోరఁబడినవాఁడనియుఁ జెప్పవచ్చును. ఇంద్రునికన్న పైవాఁడు గాన నుపేంద్రుం డనంబడును. శిష్టులను రక్షించుటకై అనఁగా పరోపకారార్థముగా (స్వార్థముకైకాదనుట) దుష్టులను సంహరించువాఁడు గాన హరి యనిపించుకొనును. భక్తుల యొక్క పాపములను నల్లనిమాలిన్యమును లాగుకొను

ను గానను. అందువలననే నల్లనైనవాఁడును గాన డు గాన డగును. ఈనామమంత్రముల కంతటయందు వుందుగా "నమః" అనుపదముండవలయును. స్మృత్యాచ ప్రాణుల కె ముందు వివరింపఁబడును గాన నిచ్చటవివ డగును. యో ద్ధుండగును.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఏవ మాచ మనంకృత్వా సాక్షాన్నారాయణో భవే దితి శ్రుతివచనాత్పురాణాచమనేన బాహ్యాంభ్యన్తర శుద్ధిం సంపాద్యస్మృత్యాచమనేన కర్మాధికారంసంపా ద్యానంతరం అపసర్పంతు తే భూతా యే భూతా భూమిసంస్థితాః యే భూతా విఘ్నకర్తారః। తే నశ్యం తు శివాజ్ఞయా। ఇతి కాలత్రయవర్తివిఘ్నకారణ భూతా న్పార్ష్ణిఘాతత్రయేణనిరస్య.

తా. ఇట్లు పురాణాచమనంబు చేయువాఁడు నారాయణుండే యగును. అనేకశ్రుతివాక్యముచే పురా ణాచమనంబు నాచరించి దేహాంతర్బాహ్యములను శుద్ధి పఱచి పిమ్మట స్మృత్యాచమనముచేఁ గర్మాధికారమును సంపాదింపవలయును. పిదప భూమియందుండి విఘ్నమా చరించుభూతములు శివునాజ్ఞచేఁ దొలఁగి నశించుగాక యను నర్థముఁగల మంత్రముచే భూతభవిష్యద్వర్తమాన కాల ములయందు కర్మవిఘ్నకరులైన భూతములను మడమ ముమ్మాఱు నేలను దన్నుచు వెడలఁగొట్టవలయును.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అపక్రామత భేతాళ పిశాచ బ్రహ్మరాక్షసాః। సర్వేషా మవిరోధేన బ్రహ్మకర్మసమారభే। ఇత్యుచ్చార్యతీగ్మ దృష్ట్యావలోకనేనా న్తరిక్ష చరాన్నిరస్య.

తా. పిదప "ఓపిశాచబ్రహ్మరాక్షసబేతాళులారా! మీరందఱు పోయినయెడల మీయడ్డు లేకుండ బ్రహ్మకర్మ నారంభించెదను" అనుమంత్రముఁ జెప్పుచు భీకరదృష్టిచేఁ జూచి యంతరిక్షచరులగు వాయురూపమునుం ధరించి రూపరహితులగుపిశాచాదులం దోలవలయును. ఇందుచే భూతశుద్ధియనుకర్మ నిర్వర్తింపఁబడినదియగును.

పృథివ్యాః మేరుపృష్ఠఋషిః। కూర్మోదేవతా సుతలం ఛందః। ఆసనేవినియోగః। పృథివ్యైనమః ఇతిభూమిం నమస్కృత్య.

తా. ఈచందస్సుచే భూమి మేరుపర్వతమును వెనుక నున్నదనియు, కూర్మము నాధారపఱచుకొనియు న్నది. గాన నాకూర్మమే దేవత యనియు సుతలలోకము పైన నమస్పారించి ... మైదుట ... కుపయుక్త

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మైనదని భావము దెలుపంబడుచుండును. దీనినిబట్టిచూడ భూమిగుండ్రనై మేరువను నాయకమణినిధరించి సుతలము వఱకువ్యాపించిహారమువలెనున్నదనిదోచును. అట్టిభూమి ని"భూమికి నమస్కారము" అనుమంత్రముచేతనభారము మోయుటకుఁగాను ప్రార్థించవలయును. దీనినే"భూశుద్ధి" యని చెప్పుదురు.

కుశాద్యాసనం పరి స్తీర్యతస్మిన్ "అనంతాసనాయ నమః" ఇత్యుపవిశ్య ప్రాణాయామం కుర్యాత్.

తా. పిదప "చేలాజినకుశోత్తరం"అనున్యాయము నఁజెప్పఁబడినదర్భాసన, కృష్ణాజిన, చిత్రాసనములనుపఱ చిదానియందు అనంతాసనమగు గాక యను భావము తో అనఁగా వాయుభక్షకుఁడగుననంతుఁడుమృదువరిగనుక నట్టిమృదుత్వమును భావించి కూర్చునిప్రాణాయామము ప్రారంభింపవలయును. ఇదికాకకుండలీభూషపాత్ అను నిఘంటుచే కుండలిని సర్పము గనుక దానినూర్ధ్వముగ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

జేయుటకు ప్రాణాయామక్రియగాబోవును గాననాకుండ లినికిది యాధారము/సను కాక యని భావింపవలయును.

## అథ ప్రాణాయామః.

తత్ప్రమకారస్తుగృహ్యపరిశిష్టే ఆచమ్య దర్భపాణిః ప్రథమమమంత్రకం పంచదశమాత్రకంప్రాణాయామ త్రయంకృత్వాసమంత్రకం సకృత్కుర్యాత్ ఇతి.

తా. గృహ్యపరిశిష్టమందు "ఆచమించి" దర్భను చేతధరించి ముందుగమంత్రము లేకయే పదునైదుప్రాణ యామముల నాచరించి తరువాత నొకమాఱు సమంత్రకప్రాణాయామమును చేయవలయును. ప్రప్రథమమున మంత్రయుక్తముగఁజేయుట కష్టమని యభ్యాసపాటవము నై యిట్లు చెప్పఁబడినది.

సమంత్రకస్యలక్షణమాహ. సవ్యాహృతీంస ప్రణవాం గాయత్రీం శిరసాసహాతిః ప్రశేదాయతప్రాణః ప్రాణ యామస్స ఉచ్యత ఇతి.

తా. సమంత్రకప్రాణాయామలక్షణముం చెప్ప

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చున్నాడు. ప్రత్యేకముగ ప్రణవయుక్తములగు వ్యాహృతులతోఁగూడిన గాయత్రీమంత్రమును శిరస్సుతోఁగూడ ముమ్మాఱుపఠించుచువాయునిర్బంధముగావించినది యొక ప్రాణాయామమగును.

ప్రణవయోగోవ్యాహృతి ష్వపిప్రత్యే కంబోధ్యః.
తథాచ సంవర్తః.

శ్లో. ప్రణవేనతుసంయుక్తావ్యాహృతీస్సప్తనిత్యశఃసావిత్రీం
శిరసాసార్థం మనసాత్రిః పఠేద్ద్విజ ఇతి.

తా. ప్రణవయుక్తవ్యాహృతిసప్తకముగల సావిత్రిని శిరస్సుతోఁ గూడ మనస్సున ద్విజుండు ముమ్మాఱు పఠింపవలయునని సంవర్తకుఁడను ఋషి వచించెను.

సచేత్థం కర్తవ్యః. దక్షిణే రేచనం కుర్యాద్వామేనాపూర్యచోదరం కుంభకేన జపంకుర్యాత్. ప్రాణాయామస్సఉచ్యతే ఇతి.

తా. ఆప్రాణాయామమిట్లు చేయనగును. దక్షిణపుముక్కుపుటముచే రేచనమును యెడమముక్కుపుటముచేపూరణమును వాయువు నుదరమందు కుంభించు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నపుడు జపమును చేయవలయును. ఇట్లు చేసిన నది ప్రాణాయామమగును.

> పంచాంగులీభిర్నాసాగ్రపీడనం ప్రణవాభిధాముద్రేయం సర్వపాపఘ్నీ వానప్రస్థగృహస్థయోః.
> కనిష్ఠానామికాంగుష్ఠైః నాసాగ్రస్యతు పీడనం. ఓంకారముద్రా సాప్రోక్తా యతేశ్చ బ్రహ్మచారిణ ఇతి.

తా. అయిదు వ్రేళ్లచే ముక్కుకొనను పట్టుకొనుటచే ప్రణవముద్ర యనిపించుకొనును. ఇది వానప్రస్థగృహస్థులకు పాపహరణమగును. బొటనవ్రేలితోను చిటికనవ్రేలిచేత ననామికచేతను ముక్కునుపట్టినచో నోంకారముద్ర యగును. ఇది యతికి బ్రహ్మచారికి తగినది.

> ప్రాణాయామె విశేషమాహ. సంధ్యాదావర్ఘ్యదానేచ ప్రాణాయామైకమాచరేత్. అదావంతేచ గాయత్ర్యాః ప్రాణాయామాస్త్రయస్త్రయః ఇతి.

తా. ప్రాణాయామమందు విశేషమును జెప్పుచున్నాఁడు. సంధ్యకు మొదటను, అర్ఘ్యమిచ్చునప్పుడును

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నొక ప్రాణాయామముం జేయవలయును. గాయత్రికి మొదటను చివరను మూఁడేసి ప్రాణాయామములు సేయవలయును.

ఏవం ప్రాణాయామం కృత్వా తిథినక్షత్రవారాణాం నిమిత్తస్యఫలస్యచ ఉల్లేఖనమకుర్వాణో నతస్యఫలభాగ్భవేదితిస్మరణాత్ । తదుల్లేఖనపూర్వక మేక మేవ మమసమ స్తదురితక్షయద్వారా శ్రీపరమేశ్వరప్రీత్యర్థం సంధ్యాముపాసిష్య ఇతిసంకల్ప్యకుర్యాత్.

తా. ఇట్లుప్రాణాయామముం జేసి "తిథి, నక్షత్రము, వారము, నిమిత్తము, ఫలము, వీనిని చెప్పనిసంధ్యవ్యర్థ"మనువచనముచే తిథివారనక్షత్రములచెప్పి నాకు పాపము వదలి పరమేశ్వరప్రీతి యగుటకై సంధ్య నుపాసించుచున్నానని సంకల్పించి చేయవలయును.

నను సంధ్యాముపాసిష్యఇతి సంకల్పవశాత్, ప్రకృతత్వాచ్చ కథంబ్రహ్మకర్మసమారభ ఇతిప్రథమమితి చేన్న.

తా. ఓయీ! సంధ్యాముపాసిష్యే (సంధ్యనుపాసిం

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చుచున్నాను) అనిసంకల్పమందు చెప్పితివిగదా, మొదట బ్రహ్మకర్మసమారభే బ్రహ్మకర్మనారంభించెదనని బ్రహ్మోపాసనము జెప్పుటెట్లు సంగతమగునను ప్రశ్న కూడదని చెప్పుచున్నాఁడు.

పరమేశ్వర ప్రీత్యర్థమిత్యుక్తత్వేన తత్ప్రీతి రేవభవతీతి చేత్సత్యం.తథాపిసంధ్యావందనస్య ప్రస్తుతత్వేనతత్సంకల్పఏవసమ్యక్.

తా. పరమేశ్వరప్రీత్యర్థమని సంకల్పించినాము. గాననా మొదటివాక్యము సత్యమనినచో ప్రస్తుతము సంధ్యావందనమగుటచే సంధ్యాకర్మసమారభేఅనియె చెప్పనగునని.

తథాచ బ్రహ్మకర్మేత్యత్రాయం భావః. యథాఽఽచమనాదినా వేదోక్తావధికారం సంపాద్య బ్రహ్మణా వేదేన వేదమంత్రైరిత్యర్థః. కర్మ సంధ్యోపాసనరూపం కర్మ సమారభే ఇతి యద్వా అవిద్యాసంవళితస్య కర్మావిద్యాశక్తిరితియావత్. ఆరభే తదుపాసనమితివా.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తా. "బ్రహ్మకర్మ"అనుచో నాచమనాదులచే వేదోక్త కర్మాధికారమును సంపాదించి వేదమంత్రములతో కర్మ నారంభించుచున్నాననిగాని అవిద్యతో గూడిన బ్రహ్మో పాస్తియనగా బ్రహ్మశక్తుల సంధినియనుటఁ జేయుచున్నాననిగాని యర్థము వివరింపనగును.

తదుక్తం మంత్రశాస్త్రే. ప్రధానమవ్యయం యోనిరవ్యక్తం ప్రకృతి స్తమః కర్మాక్షరం క్షరశ్శక్తిః మాయాఽవిద్యావిశేషతః మమైవైతానినామాని నిత్యం ప్రసవరూపిణః.

తా. కర్మయనఁగా శక్తియనునర్థము మంత్రశాస్త్రమందు వివరింపఁబడియున్నది. ఎట్లన, ప్రధానమనినను, అవ్యయమనినను, యోనియనినను, అవ్యక్తమనినను, ప్రకృతియనినను, తమస్సనినను, కర్మయనినను, అక్షరమనినను, క్షరమనినను, శక్తియనినను, మాయయనినను, అవిద్యయనినను, నిత్యము ప్రసవించు ధర్మముగల నాయొక్క నామములని శక్తి చెప్పెను.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సీత్యము ప్రసవించుట సర్వప్రపంచమునుబట్టి చెప్పఁదగి యున్నది.

యద్వా బ్రహ్మణఅవిద్యాకర్మణః కర్మఉపాసనారూపమితి వా, యద్వా క్వచిద్బ్రహ్మణఃక్వచిత్సంధ్యాయాః సంకల్పాత్తయోర్దీపదీప్త్యోరివేతి సిద్ధాంతాత్సర్వవేదాంతనిలీనతాత్పర్యం మనసినిధాయ సర్వేషాం కర్మణాం పరమేశ్వరప్రీత్యర్థకస్య సామ్యస్య గీతాయాం యత్కరోషీత్యాదినోక్తత్వాచ్చ శివశక్త్యోరభేదసూచనార్థం యథోక్తిరితి రహస్యం.

తా. లేక బ్రహ్మ యనఁగా నవిద్యాయుక్తుఁడు. వానికర్మ ఉపాసనయనిగాని, ఒకచో బ్రహ్మను, ఒకచో సంధ్యను సంకల్పించుటచే నాబ్రహ్మ సంధ్యలకు దీపదీప్తులకువలె సామ్యమని సర్వవేదాంతతాత్పర్యమని మనస్సుననుంచుకొని సర్వకర్మలు పరమేశ్వరార్పణబుద్ధిచేఁ జేయదగునను "యత్కరోషియదశ్నాసి" యను గీతావాక్యమువలన శివశక్తుల కభేదసూచనఁ గావింపఁబడెనని రహస్యము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నన్వేకఏవాద్వితీయం బ్రహ్మేతిసర్వవేదాంతేషు నిర్ణీతత్వాదుభయవిధత్వంవిరుధ్యతఇతియత్తన్న. యద్యపి బ్రహ్మణఏకత్వం తథాపిదీపదీప్త్యోరివభేదాభేదవిచార ఇతినైకత్వభంగప్రసక్తిరిత్యాగమవిదాంపథాః. తదుక్తంకూర్మపురాణే శక్తిశక్తిమతోర్భేదం వదంత్యపరమార్థతః అభేదమను పశ్యంతియోగినస్తత్త్వచింతకాఇతి అతఏవ చిద్గగనచంద్రికాయామ్ పూర్వాచార్యాప్రాహుః. అంబికేతవ పదద్వయార్చకః త్వన్మయో భవతి నాత్రవిస్మయః యత్త్వయైవవివశోవశీకృతః శక్తిరేవసమభూఃశ్శివస్స్వయం ఇతి. తత్రాపి శక్తిరూపేణోపాసనా కర్తవ్యా అత్రసంధ్యావందనమేవోదాహరణంఇత్థంచ సద్గురుకటాక్షసన్మార్గగతమనసాంజగదీశ్వర్యుపాసనాకర్తవ్యేత్యాయాతః.

తా. పరబ్రహ్మమొక్కండేయనిసర్వవేదాంతములయందుచున్నది. గానరెండువిధములనుట విరుద్ధము,ఐనను బ్రహ్మమొక్కండైనను దీపమునకు కాంతికివలె రెంటికివే

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఱోకాదో? యనువిచారణచేయుటచే నేకత్వంభందముం డదు కూర్మపురాణమందు శక్తికినిశక్తిగలవారికిని భేదము తెలియనివారికిగాని తెలిసినయోగులకుండదని చెప్పియున్నారు ఇట్లు చిద్గగనచంద్రికకారులు గూడ నీపదద్వయమునర్చించువారలు నీస్వరూపులే నీచే వశీకృతుఁడయి నీవేశివుడుగా పరిణమించితివి. అని చెప్పియున్నారుగాన నన్నివిధములచే శక్తిసేవింపఁదగినది. దీనికిసంధ్యావందనమే యుదాహరణము. గాన సద్గురుకటాక్షముచే నుపాసింపదగినది సంధ్యయే శ్రీపూర్వోపాస్తియే ఫలప్రదాయకము.

నను శ్రుతి స్మృతిపురాణసహిత పూర్వమీమాంసా సదాచారాదినా విచార్యమాణే కథం శక్త్యుపాసనా యుజ్యతే తథాహి అత ఏవ మనుస్మృతౌ యా వేదబాహ్యాః స్మృతయః యాశ్చ కాశ్చిత్కుదృష్టయః సర్వాస్తానిష్ఫలాః ప్రేత్యతమోనిష్ఠాహితా స్మృతా ఇతి ఏవం చవాసిష్ఠలైంగే. పాంచరాత్రం ప్రశంసంతి కేచిద్భా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గవతం మునేనాకులం కేచి దిచ్ఛంతి కేచిచ్ఛాక్తం
తథైవ చేత్యాదినా స్కాందే యజ్ఞవైభవఖండే కాపా
లం నాకులం చైవ శైవం భాగవతం తథాశాక్తంచ
శాంభవం చైవ విరుద్ధాన్యేవ సర్వథేత్యాదినా మహా
భారతే ఆగమాస్తు స్వతంత్రాన్యేవ నైవహన్తవ్యాని
యుక్తిభిః అధికారివిభేదేన వైదికేనహితద్బ వేదిలిబాట్ట
తంత్రే విరోధేత్వనపేక్షంస్యా దితి సూక్తవ్యాఖ్యానే
యాన్యేతాని త్రయీవిద్భిర్న పరిగృహీతానీత్యుపక్ర
మ్య, యోగపాంచరాత్ర భాగవతశాక్త నిర్గ్రంధపరిగృ
హీతధర్మాధర్మనిబంధనాదీని తేషామవైదికానామేత
చ్ఛ్రుతివిరోధాత్ అనపేక్షణీయత్వమితి నసురాంపిబే
దిత్యుక్తేమధుపానగతోత్సవామితినసురాంపిబేన్న స్త్రి
యము పేయాదిన్నిరింద్రియస్యాన్నకలజం భక్షయేది
త్యాది. వేదవిరుద్ధయావద్దురాచారనిలయత్వా త్సర్వ
నింద్యత్వమతఏవా వైదికగ్రాహ్యత్వమిత్యాదినావిచార్య
మాణే వైదికబాహ్యత్వేనకథం శిష్టపరిగ్రాహ్యత్వ
మిత్యాక్షేపే ప్రాప్తే తత్రబ్రూమః

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తా. ఓయి శ్రుతిస్మృతిపురాణాద్యంగములు గల పూర్వమీమాంస యను కర్మకాండనుండు సదాచార ప్రకారము విచారించిన శక్త్యుపాసననింద్యమని దోచుచున్నది. అది యెట్లాచరింపందగును. దానికి తార్కాణముగా. మనుస్మృతియందు వేదబాహ్యమగు స్మృతులు కుదృష్టులుగల స్మృతులు నిష్ఫలములు అవియాచరింపఁబడిననరకము గలుగునని యున్నది. ఇట్లే వాసిష్ఠవైంగమందును, కొందఱు పాంచరాత్రంమును కొందఱు భాగవతంబును కొందఱు నాకులంబును కొందఱుశాక్తమును చెప్పుచున్నారని కేచిత్పక్షముగఁ జెప్పఁబడియున్నవి. ఇట్లు స్కాందయజ్ఞవైభవఖండమున కాపాలనాకులశైవ భాగవతశాక్తశాంభవమతములు విరుద్ధములనియున్నది. మహాభారతమందును, ఆగమములు, స్వతంత్రములు యుక్తిచేఁ గొట్టదగినవిగావు అధికారిభేదముచేత నవియు వైదికములగును. ఇట్లే భాట్టతంత్రమందు "విరోధేత్వ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నపేక్షం స్యాత్" అను సూత్రవ్యాఖ్యానంబున ఇవి వేద త్రయాచారవంతులచే గ్రహింపఁబడలేదు. అని మొదలిడుకొని యోగపాంచరాత్రభాగవతశాక్త గంధములేని ధర్మాధర్మములను గ్రహింపవలయును. అవి వేదవిరుద్ధములగుటచేఁ గ్రహింపరాదు. ఎందువలననఁగ సురను త్రాగకూడదని వేదమందునుఆగమము ననాశక్తికిసురయందతిప్రీతిగలదనియునుండుటచేనికను స్త్రీనిపొందగూడదు. కలంజము తినగూడదు. అని యిట్టియాచారవిరోధము వేదబాహ్యమై శిష్టాచారముగాకయుండుటచే నాశాక్తేయాదిమతములుగూడవనుట తటస్థింపగానుత్తరము చెప్పుచున్నాము.

తథాహి శ్రీభగవత్పాద చరణైరేవయోగమత ఖండనేయద్వ్యపీత్యాదినా ఆరభ్య, తథాపి విప్రతిపన్నార్థ ప్రఖ్యాతత్వమవిరుద్ధార్థేగ్రాహ్యత్వమంగీకృతం కించ స్కాందే సూతసంహితా యామపిస్మృతిపురాణభారతశైవాగమాదీనామవిరుద్ధార్థగ్రాహ్యత్వమే వోర

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రీకృతం అతఏవవామనపురాణే, సర్వం వే దావిరో
ధేతు ప్రమాణంనహిసంశయఇతి.

తా. భగవత్పాదాచార్యులచే యోగమతఖండన
మను గ్రంథమందును యద్యపీత్యాదిగ్రంథము మొదలు
తథాపివిప్రతిపన్నులకు విప్రతిపత్తిగలస్థలమున్న [అనఁ
గాసంశయము] వేదవిరుద్ధము కానిది గ్రహింపతగినది
యని చెప్పిరి. ఇట్లేస్కాందపురాణమందలి సూతసంహిత
యందు స్మృతిపురాణభారతశైవాగమాదులలో వేదము
లకు విరుద్ధములుగాని యాచారములు గ్రహింపవలయు
ను వామనపురాణమందును అన్నియు వేదమునకు విరుద్ధ
ములుగానిచో ప్రమాణములు అనియు.

ఏతేన శక్త్యుపాసనాద్వివిధా యథావైదికాగమభే
దేన తత్రవైదికాయథా. తథాహి మహతః పరమ
వ్యక్తమవ్యక్తాత్పురుషఃపరః పురుషాన్నపరం కించి
త్సా కాష్ఠాసాపరాగతిః ఇత్యన్వయః అతఏవ సర్వే
శాక్తాద్విజాప్రోక్తా నశైవానచ వైష్ణవాః ఆదిశ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ముపాసంతే గాయత్రీం వేదమాతరమితి స్మృతిః ఏవంచయద్యపి మూలం పురుషఏవ దీపవత్ తథాపి వ్యావహారిక పురుషాద్వా దీప్త్యా కార్యసిద్ధిః ఏవమేవ శక్త్యాసర్వం సంగచ్ఛతఇతి అతఏవ వేదమాతా గాయత్రీతి.

తా. ఈచెప్పినదానిచే దేవ్యుపాసన రెండుతెఱంగులగుచున్నది. అదివైదికీ ఆగమికీ యనఁబడును. వైదిక్యుపాసన మహత్తుకంటె పూర్వము పరమనువస్తువయు దానికి వెనుక నవ్యక్తమనియు దానికి పరము పురుషుండనియు పురుషునికంటె వేఱులేదనురీతిగ నుపాసించునది వైదికి యగును. శక్తియే ప్రధానమని యుపాసించునది శైవాదులకువలె వేదబాహ్యమై పాషండమతమగును. గనుక సమస్తద్విజులు శాక్తేయులే యగుచున్నారు. సైవులు వైష్ణవులనుట కల్ల. వేదమాతయగు గాయత్రినే యుపాసించుచున్నారు అనియు చెప్పఁబడెను. గాన దీపమువలె పురుషుడని తెలిసి యుపాసించుట వైదిక్యుపా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సనయగును. అట్లుపాసించినను వ్యావహారికపురుషుని యందును కాంతిచేతనే కార్యమగును. గాన సర్వత్ర శక్తియే దృష్టకారణము. కనుకనే గాయత్రి వేదమాత యనంబడును.

కించ దేవీ పురాణేపి విష్ణుపూజాసహస్రాణి శివపూజా శతానిచ, అంబికాచరణార్చాయాః కళాంనార్హంతి షోడశీం ఇత్యాదినా.

తా. ఇట్లు దేవీపురాణమందును గలదు. సహస్ర విష్ణుపూజలకును సహస్రశివపూజలకును శక్తిపూజ యొక్క యొకకళకును బోల్పఁబడియున్నది.

కింబహూనాం సాక్షాచ్ఛివేనైవ పరిష్కృతం, స్కాందే త్వామాశ్రితా మహాభాగే ప్రాప్నువంత్యచిరేణమాం కేవలం త్వా మనాదృత్య మాం భజంతో విచేతనాః నార్హంతి మమసాయుజ్యం బ్రహ్మకల్పశతైరపి, వేద గతార్థేమానాంతరై రుపనిబద్ధాని మహర్షి వాక్యాని స్మృతయః పురాణాని వేదాఏవ తదుక్తం భారతే

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మాధవీయేచ ఇతిహాసపురాణాభ్యాం వేదంసముప బృంహయేదితి వచనాత్పూరణాత్పురాణమితి వ్యుత్ప త్తేశ్చనచావేదేన వేదస్యబృంహణం సంభవతి నహ్యా పరిపూర్ణస్య కనకవలయస్యత్ర పుణాపూరణం నసం భవతిఖలు.

తా. విస్తారముగా చెప్పుటచే ప్రయోజనము లేదు. స్కాందమున శివుండే వక్కాణించియున్నాఁడు. ఎట్లన, హేదేవి నిన్నాశ్రయించినవారలే త్వరలో నన్నుఁ బొందెదరు. గాని తెలియక నిన్ను విడిచి నన్నాశ్రయించినవారలు నాసాయుజ్యమును బొందనేర రు. అని, ఇంతియేగాక పురాణమనఁగా వేదగతమైన యర్థమును నుడువునదియే యగును. స్మృతులనఁగా వేదానుస్మృతులగు ఋషులచే ప్రమాణాంతరములచేగని పెట్టి చెప్పఁబడినవి. గనుక పురాణములు వేదములే, మాధవీయమందు భారతమందు నిట్లే చెప్పఁబడియున్నది. ఇతిహాసపురాణములచే వేదమును చక్కఁగ తెలిసి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కానవలయుననిి, పురాణమనఁగా పూరించుటవలన నయి నది గాన వేదముగాని దానిచే వేదమును పూరించుట యసంభవము. పూర్ణముగాని బంగారుకంకణమును సీసముచే పూరింపనగునా? గాన పురాణములును వేదము పూర్తిచేయునవగుటచే వేదములనియే చెప్పదగియున్నవి.

అపిచ సాక్షాదేవ వేదశబ్దః ప్రయుక్తః పురాణేషు పురాణం పంచమో వేదఇతి. ఇతిహాసపురాణం చ పంచమో వేదఇష్యతే వేదానధ్యాపయామాసమహాభారతపంచమానితి కించ. బ్రాహ్మయజ్ఞాధ్యయనే చ, అమీషాంయద్బ్రాహ్మణా నితిహాసాన్పురాణానీతి హోపినసంభవతి అతఏవాహ భగవాన్ కాలేనాగ్రహణంమత్వా పురాణస్య ద్విజోత్తమాః వ్యాసరూపమహంకృత్వా సంభవామియుగేయుగ ఇతి పూర్వసిద్ధమేవ పురాణం సుఖగ్రహణాయ సంకల్పయామీతి హితస్యార్థః.

తా. ఇంతియేగాక పురాణములయందు వేదశబ్ద

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ప్రయోగమును, పురాణము పంచమవేదమనియు, ఇతిహాసములు పురాణము వేదమేయనియు మహాభారతముతో నైదువేదములఁ జదివించెననియు ప్రసిద్ధిగలదు. ఇది కాక బ్రహ్మయజ్ఞ కాలమున బ్రాహ్మణేతిహాసపురాణములను పఠించవలయునన్న విధికూడ సూచకమే. ఇట్లు భగవంతుండగు కృష్ణుండు కొంతకాలమునకుఁ బురాణములను గ్రహింపకుండుటగని నేను వ్యాసరూపుఁడనై ప్రతియుగమునఁ బుట్టుచుండెదనని తెలిపెను.

మాత్స్యం కూర్మమిత్యాది సమాఖ్యాస్తు ప్రవచననిబంధనాః తన్నిర్మాణనిబంధనాః కారకాదివత్ కిం వేదసంకుచితార్థప్రతిపాదనం పురాణమితిచతదుక్తం నారదీయే వేదార్థాదధికందేవి పురాణార్థం వరాననఇత్యాదినా ఏవంచ వేదరూపాపరాశక్తిర్మహలోకే ప్రవర్తతఇతి కౌర్మవాక్యపర్యాలోచనయాచ సర్వమాలోడ్యనిశ్చిత్య విచార్యమాణే పూర్వోక్తరీత్యాచ తదుపాసనాకర్తవ్యేత్యాయాతం.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తా. పురాణము వేదార్థమును సంకోచించి తెలుపునని నారదీయపురాణాదులయందుఁ జెప్పఁబడియుండుటచేతను వేదరూపమున పరాశక్తిలోకమునందు ప్రవర్తించుచున్నదియను కూర్మపురాణవాక్యమునుబట్టియు నాలోచించి విచారించిచూడఁగా శక్త్యుపాసనకర్తవ్యమనియే నిశ్చయముగఁ దోచుచున్నయది.

ఏవంచ శ్రుతిస్మృతిపురాణేతిహాసాది పర్యాలోచనయా వైదికేన తదుపాసనాకర్తవ్యా ఏతత్సర్వం శ్రీభాష్యకారాదిష్వేవాస్మాకం వ్యక్తమితిస్ఫుటమేవ.

తా. ఇట్లు శ్రుతిస్మృపురాణేతిహాసాదుల నాలోచించుటచే నాశక్త్యుపాసనము వైదికరీతిగఁ జేయఁదగునని భాష్యకారాదులవల్లఁగూడ స్పష్టముగుచున్నది.

అతఏవ యా వేదబాహ్యాస్మృతయ ఇత్యుక్తం. తాంత్రికే అతఏవ వైదిక తాంత్రికయోస్తేజస్తిమిరయోగవద్విరోధ ఇత్యేవ విచార్యసంధ్యావందనాది కర్మారబ్ధే తత్తాంత్రికవిషయమిత్యాదినా వ్యవస్థా అతఏవ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వసిష్ఠలైంగేష్ఠమాధ్యాయే తంత్రప్రవిష్టశాండిల్యం ప్రతిభగవానాహ భూయోపి మత్ప్రసాదేన కర్మ లోకే ద్విజోత్తమాః భూత్వా వర్ణాశ్రమాచారం శ్రౌతంకృత్వా యథాబలం ఇత్యారభ్య బహుక్త్వా వేదమార్గం వినా బ్రహ్మన్నాస్త్యుపాయో విముక్తయే, సర్వ శాస్త్రాణి వేదాంగాన్యుపవేదాస్తథైవచ పురాణానితథాసాంఖ్యం యోగం పాశుపతంతథా దేశజాతి కులానాంచ ధర్మాశ్చాన్యే మహత్తరాః సర్వం వేదావిరోధేన ప్రమాణం నాన్యథాభవేత్. తస్మాత్సర్వప్రయత్నేన బ్రహ్మన్బ్రహ్మవిదాంవర త్యక్త్వా వేదవిరుద్ధాస వేదమార్గం సమాశ్రయ. ఏవం జాతీయకాని కౌర్మాదిపురాణాని- తస్మాద్వేదబాహ్యానాం రక్షణార్థాయపాపినాం విమోహనాని శాస్త్రాణి కరిష్యావో వృషధ్వజ ఇత్యాదినా బహూని నిబద్ధా న్యేతిప్రకృతమనుసరామః.

తా. కనుకనే తాంత్రికమందు వేదబాహుళ్యము స్మృతులు ప్రమాణములు గావనియున్నది. గాన

CC-0 Jangamwadi Math Collection. Digitized by eGangotri

వైదికతాంత్రికములకు తేజస్సునకుచీఁకటికివలె విరోధమేనని విచారించి సంధ్యావందనము మొదలుకొని యిది తాంత్రికవిషయమని వ్యవస్థచేయఁబడినది. కనుకనే వసిష్ఠలైంగమందు అష్టమాధ్యాయమున తత్రప్రవిష్టుండగు శాండిల్యునిగూర్చి భగవంతుఁడు తిరిగి నాయనుగ్రహముచేత భూలోకమున కర్మకలిగి వర్ణాశ్రమాచారశ్రౌతస్మార్తాదులను యథాశక్తిగాఁజేసి అని మొదలుకొని చాలవఱకుఁ జెప్పి వేదమార్గము ననుసరించక మఱివేఱొండుపాయము గానము. సమస్తశాస్త్రములు వేదాంగములు నుపవేదములు దేశజాతికులధర్మములు వేదవిరోధములు గానిచో ప్రమాణములు. గనుక వేదవిరుద్ధములను వదలి సమస్తప్రయత్నములచేతనే వేదోక్తకర్మలనే యనుష్ఠించునది.

ఏవంచ పూర్వోక్తప్రకారేణ కేశవాద్యాచమనద్వయేన బాహ్యాభ్యంతరశుద్ధిం సంపాద్యవిఘ్న కారిణో

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

భూతానుత్సార్యపునః ప్రాణాయామేనత దేవంసంపాద్య కర్మసంకల్ప్యప్రణవయుక్త వ్యాహృతిభిస్సప్రణవ గాయత్ర్యాపోహిష్ఠేతి ప్రతిప్రణవయుక్తనవపదమార్జనేన చ బాహ్యశుద్ధిం సంపాద్య అగ్నిశ్చేత్యాది నాంతరాళికం సంపాద్య పునశ్చవాఙ్మనః కాయకృత దురితస్య ప్రబలత్వే నాచమనంనద్వయేన తత్సంపాదనపూర్వకమేవ పాపపురుషనిరసనాధికారసిధ్యర్థమాపోహిష్ఠేతి నవర్చేన ప్రతిమంత్రంమార్జయిత్వా పాపపురుషం వ్యపోహ్యతద్దహనజనితదోషని వృత్యర్థమర్ఘ్యదానేన పరమాత్మత్వేన సూర్యప్రార్థనాధికారసిద్ధ్యర్థమాచమనద్వయంకృత్వా న్యూనాతిరిక్తదోషనిరహరణద్వారా కర్మసంపూర్త్యర్థంమంతేచ కుర్యాత్.

తా. ఇట్లు ముందుచెప్పినరీతుగ కేశవాద్యాచమనములరెంటిచేతను లోపలిశుద్ధియు, బయటశుద్ధియుఁ జేసిన కొని విఘ్నములనుజేయు భూతములను గొట్టి తిగి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ప్రాణాయామముచే నాశుద్ధినేచేసి చేయునట్టి కర్మను సంకల్పించి ప్రణవముతోను గూడిన 6 వ్యాహృతుల చేతను ప్రణవముతోఁ గూడిన గాయత్రితోను ప్రణవముతోఁ గూడిన యాపోహిష్ఠేత్యాది తొమ్మిదిపదములతోను మార్జన చేయుటచేతను బాహ్యశుద్ధిని జేసికొని, అగ్నిశ్చేత్యాదిమంత్రముచే నాంతరశుద్ధిని సంపాదించి తిరిగి మనోవాక్కాయకర్మలచే నగు పాపము ప్రబలమగుటచేత నాచమనద్వయముచే శుద్ధింగాని పాపపురుషనిరసనాధికారసిద్ధికై యాపోహిష్ఠ మను నవర్చముచేత ప్రతిమంత్రముతోను మార్జనమొనర్చి ఋతంచేత్యాదిమంత్రముచే పాపపురుషుని వెడలఁదరిమి వానిని దహించుటచేఁ గలిగిన పాపముబోవుకొఱకును అర్ఘ్యమిచ్చుటచే పరమాత్మరూపుండగు సూర్యుని ప్రార్థింపనధికారముకొఱకును రెండాచమనంబులంజేసి కర్మయందు లోపాదికదోషములు బోవుకొఱకును కర్మపూర్తిగాఁ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గలందులకును నర్ఘ్యాంతమందుగూడ తిరిగి యాచమన ద్వయం బాచరింపవలయును.

నన్వాచమనద్వయస్య బాహ్యాభ్యంతర శుద్ధిసంపాదన ద్వారా కర్మాధికారసిద్ధి హేతుత్వే సత్యపిపునఃపునః ప్రాణాయామాదినా తత్సంపాదనం కిమర్థమితిచేదు చ్యతే.

తా. ఓయిఆచమనద్వయముచేతనే బాహ్యాభ్యం తరశుద్ధిగలుగుచుండఁగాఁ దిరిగి ప్రాణాయామాదులచే దానిని సంపాదింపనవసరమేల యను శంకకుత్తరము, జెప్పుచున్నాఁడు.

యథాలోకే లోహాంతరసంస్కారా న్మలినం హేమ పునఃపునరగ్నాధ్మాయమానం సతి శుద్ధం స్వస్వ రూపం భజతీతి పునఃపునః స్తత్సంపాదనం కర్తవ్యమ్.

తా. లోకమందు నితరలోహములచేఁ గలుష మయినబంగారమగ్నియందు మాటిమాటికినూదఁబడినదై శుద్ధమయి నిజరూపము నెట్లు పొందునో యటులు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సాత్మశుద్ధికై మాటిమాటికి శుద్ధినిసంపాదించుటతప్పదు.

యథాగహనాకర్మణో గతిరితి భగవద్వచనాత్కర్మ
గతే ర్దురోృధ్య త్వేన యథావిధ్యనుష్ఠానాసంభవాత్
తత్తద్దోషపరిహారార్థం తచ్ఛుద్ధిం సంపాదయన్నేవ
కర్మకుర్యాత్.

తా. లేకున్నను కర్మలరూపమును దెలియుట దుస్తరముగాన యథావిధిగఁ గర్మల నాచరింప నశక్యమగుటవలనను ఆయాదోషములను బోగొట్టుకొనుటకై శుద్ధిని సంపాదించుచునే కర్మలను చేయనగును. శుద్ధిబాహుళ్యమువలన దోషములేదు. ఇదిగాక మనము పాదరసమువలె నతిచంచలముగాన దానినరిగట్టుటకై శుద్ధులనేకములైనగాని బద్ధముకాదు.

ఏవ ంతత్రైవ తదుపాసనాయామప్యహరహస్సంధ్యా
ముపాసీతేతి దోషప్రదర్శనమపి కించిత్క్రియతే.

తా. ఇట్లు సంధ్యనుపాసించుటయందును ప్రతి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దినము దోషములు గలుగునని కొంచెము వివరించిచెప్పు
చున్నాడు. పుణ్యముచేయుటలోను విచారణారహితమ
యినచో దోషముగలదు. దీనికి తార్కాణముగా శేష
ధర్మమం దొకానొక బ్రాహ్మణుడన్న దానము చేయు
చుండెను. వానికొకనాఁడు వ్యాధుఁడు (అనఁగా వేట
గాడు) అన్నమునకు తటస్థించెను. జీవపోషణముముఖ్యం
బని యతని కన్నంబిడెను. అతండు నాయన్నబలిమిచే
నేగి గోవధను గావించెను. అప్పుడాగోవధపాతక మెవ్వ
రిది యను శంకగలిగెను. దానిని భగవంతుండే దీర్పవల
యునని పెద్దలు నుడివిరి. గాన కర్మగతి తెలియ నశక్యము
వ్యావహారికమందు దుఃఖరహితమగు సుఖము లేనటులు
బుణ్యమును పాతకరహితరూపముగనుండుట దుర్లభము
గావుననే పుణ్యమునకుఁ బోయినపాపము వెంటబడెనను
సామ్యముప్పతిల్లినది. ఇట్లని చేయకుండుటయు మూర్ఖ
తయే. ధాన్యమునకు పొట్టును దీయుదుఃఖమున్నదని వద

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

లినచో మూర్ఖుండగును గదా, గానదోషమును బోగొట్టుకొనుటకు శుద్ధినిమిత్తముల నాచరింపుచు కర్మలనాచరింపనగును. కనుక నేకర్మలను తెలిసి చేయవలయును. గాన నర్థమావశ్యకము. అట్లు తెలిసినగాని హంసవలె క్షీరనీరముల వేఱుజేయుట తటస్థింపదు.

అద్భిస్సముత్థితాభిస్తు హీనాభిః ఫేనబుద్బుదైః వహ్నినానచతప్తాభీ రక్షరాభిరుపస్పృశేత్.

తా. నురుగుబుడగలు లేకుండను కాచనిశుద్ధజలముచే నాచమనాదికముఁ జేయవలయునని యున్నది.

గోకర్ణాకృతిహస్తేన మాషమగ్నం జలంపిబేత్ తన్న్యూనమధికంభూత్వాసురాపానసమంభవేత్ ఇత్యాద్యుక్తజలాలాభేన అన్యూతాధికసంభవేనవా ఆచమనేదోషః.

తా. హస్తమును గోకర్ణముతో సమానముగఁబట్టి మినపగింజ మునుగునంతజలమునుంచి యాచమింపవలయుననియుఁ గలదు. అట్లు సంభవింపనిచో దోష

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మావశ్యకముగ గలుగును. గాన పంచియందును మితి
మించినదోషమే యగును. అతిసర్వత్ర వర్జయేత్ అతి
జ్ఞాన మజ్ఞానమగును. గాన మితముగా నడుపవలయును.

మనశ్చలత్వా ద్యత్రకుతా౽పి ప్రసృతంచే త్ప్రాణా
యామేదోషః, ఏవమేవ మార్జనాదావ పియథావి ధ్య
నుష్ఠానలోపేన దోషసంభవః, తస్మాత్త ద్దోషపరి
హారార్థం ప్రకారాంతరేణ తచ్ఛుద్ధిః కర్తవ్యైవ.

తా. మనస్సు చంచలమగుటచేఁ బ్రాణాయామ
మందు చలించి యితర ధ్యాసనొందుట దోషమగును.
గాన యథావిధిగ కర్మనాచరింపకుండుటచేఁ గూడ కొన్ని
దోషములు గలుగును. గాన యీదోషములను బోగొట్టు
టకై శుద్ధిబాహుళ్య మావశ్యకము. పాలకై జ్ఞాలుమో.
యుట తప్పునో? తప్పదు.

ననుబహుదురి తమిలితకర్మణా మాయాస కరత్వేనత
త్పరిత్యజ్య వ్యవహ్రియతాం కిమ చేనేతిచేన్న తదు
క్తం వ్యాసపాదైః, నోక్తః స్మార్తకర్మ ప్రతిపదగహ
నం ప్రత్యవాయాకులాఢ్యం శ్రౌతేవార్తా కథంమే

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ద్విజకులవిపినే బ్రహ్మమార్గే పురారఇతి. శ్రేయాంత్స్వ ధర్మోవిగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్, సర్వారంభా హిదోషేణ ధూమేనాగ్నిరి వావృతా ఇతి, భగవ ద్వచనాత్కర్మ మాత్రస్య దురితమిళితత్వేన దురిత క్షయద్వారా తత్కర్తవ్యమేవనోచేత్పతిత ఏవనాన్యః తస్మాత్పదేపదే ప్రత్యవాయ శాంతిం కుర్వన్నేవ కర్మ కార్యమితి ప్రకృతమనుసరామః.

తా. కర్మదురితములో గలసియుండినపుడు దాని నెందుకై వదలగూడదను ప్రశ్ననుపపాదించి సమాధాన ముం జేయుచున్నాడు. కర్మపాప సంస్పృష్టమనుటకు వ్యా సవచనము. ప్రతిపదమందును కష్టముగలది. స్మార్మకర్మ. ప్రత్యవాయ బాహుళ్యముగలది శ్రౌతకర్మ. బ్రహ్మకుల మున కరణ్యమువంటిది బ్రహ్మమార్గము. కనుకనే నది చేయనశక్తుడనని శివుని ప్రార్థించినాడు. బాగుగఁ జేయు పరధర్మముకంటె గుణరహితమైనను తన ధర్మమెప్పుడు శ్రేయోదాయకము. అన్నికార్యములు ధూమముతో న గ్నివలె దోషయుక్తములుగనే యున్నవి యను భగవ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ద్వచనము వలనను నన్నియు బాపవిశిష్టము లగుటచేత తద్వినాశన ద్వారముననే కర్మచేయకతప్పదు. గనుక ప్రతి పదమందు ప్రత్యవాయశాంతి నాచరింపుచునే కర్మ నాచరింపవలయును.

అథప్రాణాయామే ప్రణవవ్యాహృతి గాయత్రి శిరో మంత్రాణా మర్థో వక్ష్యతే.

తా. ఆవిచారమును వదలి ప్రస్తుతము ప్రణవవ్యాహృతి గాయత్రి శిరోమంత్రముల కర్థముం జెప్పుచున్నాడు.

ప్రణవస్య పరబ్రహ్మఋషిః పరమాత్మా దేవతా దైవీ గాయత్రీఛందః.

తా. ప్రణవమునకు పరబ్రహ్మఋషి (కనిపెట్టినవాడనుట) గురువు. ఉపదేష్ట గనుక శిరమున నుంచవలయును దేవత పరమాత్మ. ఆమంత్రముచే ధ్యానింపదగినది. గనుక హృదయము నందుంచవలయును. చందస్సు దైవీగాయత్రి. ఇది యక్షరరూపముగాన యక్షరోచ్చారణ సాధనమగు ముఖమం దుంచతగినది.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వ్యాహృతీనాం సప్తానాం విశ్వామిత్రాత్రి భరద్వాజ జమదగ్ని వసిష్ఠ కశ్యపాఋషయః, అగ్ని వాయుసూర్య ప్రజాపతీంద్ర విశ్వే దేవా దేవతాః గాయత్ర్యుష్ణిగనుష్టుబ్బృహతీపంక్తి జగత్యః ఛందాంసి.

తా. సప్తవ్యాహృతులకు విశ్వామిత్ర, అత్రి, భరద్వాజ, జమదగ్ని, వసిష్ఠ, కశ్యపులు, ఋషులు. అగ్ని వాయు, సూర్య, ప్రజాపతి, ఇంద్ర, విశ్వే దేవులు, దేవతలు. గాయత్రి, ఉష్ణిక్, అనుష్టుప్, బృహతి, పంక్తి, జగతులు ఛందస్సులు.

గాయత్ర్యాః విశ్వామిత్రఋషిః సవితా దేతా గాయత్రీఛందః ప్రాణాయామే వినియోగః.

తా. గాయత్రికివిశ్వామిత్రుండు ఋషి. సవితృండు దేవత. ఛందము గాయత్రి. ప్రాణాయామమునకై వినియోగము.

ననుగాయత్ర్యాది మన్త్రాణాం తారకత్వేన క్లృప్తత్వాత్తదాదా కిమర్థమోంకారోచ్చారణం తస్యకియ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ద్వర్ణకత్వం కియదర్థకత్వం కీదృశప్రాశస్త్యం కింఫలం ఇత్యాదిక మిత్యతఆహ.

తా. గాయత్ర్యాది మంత్రములే ఓంకార రూపములగుటచే సరిపోవుచుండఁగా వానికి మొదట నోంకార ముచ్చరించుటయేల? అది యెన్నివర్ణములు గలది? ఎంత యర్థము గలది? దానయాధిక్య మేమి? ఫలమెద్ది? అను ప్రశ్నలకు సమాధానంబు జెప్పుచున్నాడు.

తథాహి. తత్రవర్ణాస్తు, అకార ఉకారమ కారాః.

తా. దానినె చెప్పుచున్నాడు. ఆప్రణవమందు వర్ణములు. అకార, ఉకార, మకారములు. అకార, ఉకారములకు ఆద్గుణః అకారమున కచ్చుపరమగునపుడు గుణమనగా "ఏ, ఓ, అ"లలోను కారయకారములకు సవర్ణమగు నోకారము వచ్చును. పిమ్మట మకార యుక్తముగాఁగ'నోం' అనబడును. ఇటులే యహంకారము గూఢయగును. ఉకారము విసర్గరూపమగుటచే హకార స్థానీయము. కామకళయు నిదే. బిందుత్రయ విశిష్టము. ఇదియంతయు గురుముఖమునఁ దెలియఁదగియున్నది.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నను విశేషార్థ ప్రతిపాదక వర్ణానా మేకవర్ణత్వమితి చేత్సత్యం తథాపితత్స్వరూపస్య తాదృశత్వేనవే దేని ర్ణీత తత్వాత్, అతఏవశ్రుతిః. అకార ఉకార మకార ఇతితానే కథాసమభవత్త దేతదోమితి.

తా. విశేషార్థములను దెలుపు వర్ణముల కేకవర్ణత్వ మెట్లగుననను శంకగలదు. అదియున్నను. దాని స్వరూపమట్లే యుండునని వేదమందుఁ జెప్పుటయే సమాధానము. దానికీశ్రుతియే ప్రమాణమనుట.

అతఏవశ్రుతా వ్యుక్తంచేత్కిమితినశంక్యంకుత ఇత్యుక్తేశ్రు తేరనతి శంక్యతాదితి, "సాధ్యత్వ మేతదుపగమాది భ్యఇది", సూత్రవ్యాఖ్యానే భగవాన్భాష్యకారః, ఏతదాస్తాం, "అవ"రక్షణ ఇతిధాతోః అవతేష్టిలో పశ్చేత్యౌ ణాదికసూత్రేణ మత్ప్రత్యయో విహితః, తస్యజ్వరత్వరే త్యాదినాఊర్. తతోగుణః, తత్శిష్టోచ్చారణమితి ప్రక్రియయా ఓమితినిష్పన్నం.

తా. అది యొకేయక్షరము విశేషార్థముల సూచించునను విషయములో వేదమనతిక్రమణీయము గనుక

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యదివే ప్రమాణము. "సాధ్యత్ష్యే తదుప గమః" అను సూత్రమందు భాష్యకారులు గూడచెప్పిరి. "అవ" అనుధాతువునకు టి, లోపముకాగా, అవ్ అనియుండ, పిమ్మట మత్ప్రత్యయముచేయ గాజ్వరత్వరేత్యాదిసూత్ర ముచే నూఠ్ రాగా, పిమ్మట గుణమురాగా శిష్టోచ్చారణ ముచే, ఓం, అనురూపము సిద్ధించినది. దీనివలన సంసార మునుండి రక్షించునదియని యర్థమగును.

శ్రీశంకర భగవత్పాదైరపి ప్రకారాన్తరేణ ప్రపం చితం ప్రపంచసారే.

తా. శంకచార్యులు ప్రపంచసార మందొకవిధిగా వివరించి యుండిరి.

యోయంపరమ హంసాఖ్యో మంత్రసోహ మితీరితః సహోర్లోపేకృతే పూర్వసంధా వోమితిజాయతే, అ కారశ్చ తథోకారో మకారశ్చాత్ర వర్ణకాః ఇతి,అయ మర్థ. సోహమితి పరమహంసాఖ్య మంత్రః తస్యస కార హకారయోర్లో పేపూర్వసంధా చకృతే ఓమితి రూపం జాయతఇతి.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తా. సోహం, అను మంత్రమందు సకారహకారములు లోపింపఁగా మిగిలిన ఓ,అ. అను నక్షరములకు పూర్వరూపసంధి చేయుఁగా "నోం"అను రూపమగునని చెప్పఁబడినది.

ఏతత్సర్వంస ప్రపంచం ప్రపంచితంమంత్రరత్నే, తథాహి. నను ఓమిత్యేకాక్షరం బ్రహ్మ, ఓమితి ప్రవక్ష్యన్నాహ బ్రహ్మణ్ణేషాప్నవానీతి, శ్రుతిః, ఓంకారస్సర్వవేదానాంసార భూతఃప్ర కీర్తితఇతి, వర్ణమాలికాయాం, ప్రణవస్సర్వవేదా నామితి, గిరామస్మ్యేకమక్షరమతి చగీతాయాం, ఏవం వేదశాస్త్రై ర్వర్ణస్యైవ బ్రహ్మత్వం ప్రతిపాదితం, అర్థేకింప్రతిపాద్యతే, కించ యత్రకుత్రాప్యే తాదృశవ్యవహారా భావాచ్చకథమేత దితిచేన్న.

తా. ఇదియంతయు మంత్రరత్నమున విస్తారముగాగలదు. ఎట్లన, ఓమనునక్షరమే బ్రహ్మమనియు, ఓం అనుటచే బ్రహ్మమును జెందుచున్నారనియు, శ్రుతివల్లను అన్నివేదములకు నోంకారము సారమయినది యనువర్ణ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మాలికా ప్రమాణముచేతను, వేదములన్నిటిలో ప్రణవరూపుడును, వాకులలోనొక్క యక్షరమైతిని. యను భగవద్గీతా వాక్యముచేతను, వేదశాస్త్రము లందు వర్ణమునకే బ్రహ్మత్వము చెప్పఁబడియున్నది. ఈయర్థమున కెద్దిగతి. ఇదిగాక నిట్టివ్యవహార మెచటను లేదని యనఁగూడదు.

అయమర్థః. క్వచిచ్ఛబ్దస్యాప్యభిధేయత్వేన వక్తుంశక్యత్వాచ్ఛబ్దార్థయోః నిత్యసంబంధత్వాచ్చ దీపదీప్తివచ్ఛివశక్త్యాత్మకత్వమోంగారస్యేతిసూచనార్థమితి రహస్యం ప్రకృతమను సరామః.

తా. ఒకానొకచోట శబ్దముగూడ నర్థమగును. (ఇదివ్యాకరణ మందువిశేషము గావచ్చును.) ఎట్లన "ద్విరేఫ" శబ్దమునకు భ్రమరశబ్ద మర్థమగునట్లు" గాన శబ్దార్థములకు సంబంధమునిత్యము. దీపమునకు కాంతికి వలెన వినాభావ సంబంధము. శివశక్తి స్వరూపత్వము. ఓంకారమునకుఁ గలుగును. అకారమును, హాకారాత్మకమగును కారమును బిందుతుల్యమగు మకారము నిందుగలవు. గా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ననిదియె యహంకార మనంబడును. అహంకారోత్ప త్తిని కామకళయందిట్లు వర్ణించియున్నాడు. "పరశివర వికరని కరె[ప్రతిఫలతి పిమర్శదర్పణె విశదె. ప్రతిరుచిరుచి రెకుడ్యె చి త్తమయెని విశతెఽహా బిందుః" అకారస్సర్వ వర్ణాగ్ర్యః. హకారోంత్య కళాస్మృతః, అను న్యాయ ముచే సర్వవర్ణాగ్ర్యమగు నకారమను సూర్యునికిరణము లంత్య కళయగు హకారాత్మకమగు నద్దమునఁ బడిన చిత్తమను స్వచ్ఛపుగోడపై మకారమను బిందువుదయిం చి యహమనునది కలిగెనని చెప్పియందుటచే నిదియిప్పు డు."బయోస్కోపు"నకుపోలియున్నది. శివశక్త్యాత్మ కత్వ మును గూర్చియు నిత్యత్వమును గూర్చియు కాళిదా సుండు. వాగర్థా వివసంపృక్తౌ అను శ్లోకమందు స్పష్ట పఱచియున్నాఁడు. వాగర్థౌనిత్యయుతౌ పరస్పరం శక్తిశివ మయావేతౌ అని కామకళయందును గలదు. కనుకవి స్త రభీతిచే నింతట విరమింతము.

ఓంకారె బ్రహ్మవిష్ణీశాః సభార్యా సర్వతోముఖాః,
మాయా బ్రహ్మాపి తత్సత్తా వ్యతిరేకాది హస్థితాః.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తస్మాత్సర్వమయః ప్రోక్తః ప్రణవస్తార ఇత్యపి. ఏవం చవర్ణాన్నం ప్రోక్తారాజ సంజ్ఞావిశేషత ఇత్యాదినా వర్ణనీయ మోంజ్ఞేయం.

తా. ఓంకారమున బ్రహ్మవిష్ణీశులు భార్యలతోఁ గలసి యుందురు. అకారో బ్రహ్మ విష్ణ్వీశక మతెప్పంగణె రణెయను నైఘంటిక ప్రమాణముచే నకారమునకు బ్రహ్మవిష్ణ్వీశులును, శక్త్యాత్మకమగు నుకారమునకు తద్భార్యలగు సరస్వతీ లక్ష్మీపార్వతులు నర్థము. మాయయు బ్రహ్మము. తత్సత్తయు వ్యతిరేకముగా (ప్రతికూలముగా) దాని యందేయున్నవి. బిందునాదాదాత్మకములు. గనుక ప్రణవము సర్వమయము తరింపఁజేయును గాన తారకమని గూడ బిలువంబడును. ఈమూటియందే ప్రపంచాత్మకమగు పంచపంచవర్ణముల చొప్పునఁ గలిగి సమిష్టితోఁగూడ షోడశాకరము లయినవి.

ఆస్తామేతత్ అతఏవ ప్రాణాయామస్య, సకలకలుష. నివృత్తిః ఫలమిత్యాహామనుః.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తా. ఇది యుండనిండు, ఇందువలననే ప్రాణాయామమునకు సమస్తదురిత నాశకత్వము ఫలమని మనువు వక్కాణించియున్నాఁడు.

ఉక్తంచమన్త్రరత్నే, ఓంకారరోచ్చారణం నృణాం దురితక్షయ కారణమ్, తురీయార్థానుసన్ధానం మోక్షభేద ప్రదాయకమితి.

తా. ఇట్లు మన్త్రరత్నమందును గలదు. ఓంకారమును బలుకుట నరులకుఁ పాపనాశనము గలుగును. నాల్గవ యర్థమునందు గూర్చుటచే మోక్షముం జెందును.

ఓమిత్యే కాక్షరం బ్రహ్మధ్యాయన్నేవ జపన్ద్విజః
అవాప్తసర్వ కామోసావాత్మత త్వాయకల్పత ఇతి.
శ్రీశఙ్కర భగవత్పాదైః ప్రతిపాదితం.

తా. "ఓం"అను నక్షరమును బ్రహ్మముగా ధ్యానించుచు జపించిన ద్విజుండు సమస్తకామములను పొందియాత్మతత్వ మెఱుంగునని శంకచారాచార్యులు వచించిరి. దీనివలన నోంకారోపాస్తి నిష్కామ్య కర్మయనియు నిష్కామ్యుఁ డగువానికి కామ్యములు తనంతటనే సిద్ధిం

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చుననియుఁ జెప్పబడియున్నది. మిద్దైనెక్కువానికి మెట్లేల తటస్థింపవు. గానకామ్యములు మెట్లవంటివి గనుకనే కామిగాని మోక్షకామిగాడని వచింపంబడి యున్నది. దీనిచే జఘన్య వృత్తియగు స్త్రీసంభోగమె కామ్యమని యూహింపగూడదు.

ఏవంచపూర్వోక్త పర్యాలోచనయా, ఓంకార స్యసర్వవేద సారత్వం సర్వమన్త్రరాజత్వంచ ప్రతిపాదితం, ఇత్థంచ ఓంకారస్య వర్ణార్థ ప్రాశస్త్య ఫలాదికంసావయవం నిరూపిత మితిజ్ఞేయం.

తా. ఇట్లుండని వన్నియు విమర్శింపఁగా నోంకారము సర్వవేద సారమని తెలిసినది. సర్వమన్త్ర రాజమనియు దెలిసెను. ఓంకారమందుండు వర్ణార్థములు ప్రశస్తములనియుం దెలుపంబడెను.

నన్వేవమే వాష్టాక్షరీ పఞ్చాక్షరీగా యత్రీము ఖానామపిమన్త్రాణాం సర్వవేదసారత్వా దేతదేవ సర్వోత్తమమితి. కథమితిచేన్న వస్తుతస్తూక్త రీత్యా సర్వేషాం తారకత్వమేవ తథాప్యేవం ప్రాచాంపన్థాః, తథాహి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సర్వమన్త్రాణా మోంకార పూర్వత్వేనైవ ఫలజనక త్వం, తస్మాదోంకార స్యసర్వాతి శాయిత్వంజ్ఞాతుం శక్యతఏవ.

తా. ఓయి అష్టాక్షరీ, పంచాక్షరీ గాయత్ర్యాదులుగూడ వేదసారంబులే గాననేల తారకంబులుగా కూడదను ప్రశ్న జనింప వక్కాణించుచున్నాఁడు. నిజమున నన్నియు తారకములే యగునుగాని సిద్ధాంతమార్గమందున్నవారు. అది యెద్దియనిన సమస్త మన్త్రములకు నోంకారమాదియగుట చేతనే ఫలముగలుగును గాననదియే సర్వాతిశాయి యనినమ్మియున్నవారు. ఏదిఫలము నిచ్చునదియే యతిశయ ముంజెందుటరుదా?

ననుసర్వేషా మేకఫలత్వా త్తలాథ మోంకారానుసన్ధానే తన్మంత్రశక్తిరా విర్భవతి. ఓంకారాదే వతత్ఫలస్యచారి తార్థ్యాదితిచేన్న.

తా. ఓయి. పోనీ మన్త్రములకు నోంకారమునకు నొకేఫలమయినచో నది యుండినసేగాని మన్త్రశక్తి యుద్భవింపదను నియమమేల, ఓంకారమువలన

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ననేఫలము గలుగుంగాక. అను ప్రశ్నరాగా సమా
ధానము.

తథాపి ప్రత్యేకముక్తా సర్వేషాం మన్త్రాణాం తార
కత్వే విశేషేప్యు భయోర్మేళనే యేకస్య ప్రదా
నతా ఏకస్యైవ సర్జనత్వం, తథాచ ఓంకార పూర్వ
కత్వే ఓంకారస్య దురితక్షయమాత్రం ఫలంవక్తవ్య
మన్యత్ర తస్మైవ సార్వభౌమత్వం అత ఏవ పూర్వో
క్త రీత్యా ఓంకారస్య సర్వాతిశాయిత్వేనైవ వేదా
దిమం లోక మముంచ పరిత్యజ్యేత్యాది నాయతీనాం
సకల వేదసార భూతత్వ మవగమ్యతే

తా. అయ్యా, సమస్తమన్త్రములు తారకము
లైనను రెండు కలసినపుడొకదానికి ప్రధాన్యము మఱి
యొకదాని కుపసర్జనత్వము (అనఁగా నప్రాధాన్యము)
సిద్ధించును. ఓంకారము పూర్వమందుండిన నోంకారము
నకు పాపనాశకత్వంబును లేనిచో నామన్త్రమునకే సా
ర్వభౌమత్వము (అనఁగా సర్వాధికారిత్వము) చెప్పనగును
కనుకనే వేరగు నోంకారము నీలోకమును వదలినవా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రుపాసింప దగునని యతులకే దీనియం దధికారము నిచ్చి సకల వేదసారమని వక్కాణించియున్నారు.

అత ఏవోక్తం మనునాపి.

తా. కనుకనే మనువుగూడ చెప్పుచునున్నాఁడు.

ఆత్మజ్ఞానే శమేచస్యా ద్వేదా భ్యాసేచ యత్నవాన్, ఇతి తత్ర వేదాభ్యాసః ప్రణవాభ్యాస ఇతి. విజ్ఞానేశ్వరేణోక్త మిత్యాది నావిచార్యమాణే ప్రణవస్యైవ సర్వాతి శాయిత్వం.

తా. ఆత్మజ్ఞానమునందును శాంతియందును మనుజుఁడు యత్న మాచరింప నగును. వేదాభ్యాసమందును యత్నింప వలయును. అనఁగా ప్రణవమందని విజ్ఞానేశ్వరుండు పలుకుటచే ప్రణవమే సర్వాతిశాయి యని చెప్పదగి యున్నది.

అత్రాయం వివేకః, ఓంకారస్య సర్వాతి శాయిత్వేన తుర్యాశ్రమ స్థానా మిత రాశ్రమాపేక్ష యాధి కాతిశయా త్తేషా మేవ తన్మ న్త్రమాత్రజపో యోగ్యః, అన్యేషాం సామర్థ్యాభావా చ్ఛుద్ధోంకార స్వరూపో

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నయోగ్యాః, ఏవంచ ఓంకారాభావే మన్త్రస్య ప్రాశస్త్యాభావా దోంకార పూర్వకత్వేనైవ పూర్వాశ్రమ త్రయ స్థానాం గాయత్రీ జపః కార్యః, అన్యేషామవైదికా నామనర్థేతి.

తా. ఇచ్చట నిట్లు తెలియదగును. ఓంకార మన్నిటికన్న నధికమయినది గాన నాశ్రమములం దన్నిటికి నెక్కుడగు సన్యాసాశ్రమస్థులు జపింపఁ దగియున్నది. ఇతరుల కట్టి సామర్థ్యము తక్కువ గాన శుద్ధోంకార ముచ్చరించుట తగదు. కనుక ఓంకారము లేనిది మన్త్రమునకు ప్రాశస్త్యము లేదు గాన ఓంకార పూర్వకముగానే పూర్వాశ్రమ త్రయమందును గాయత్రి జపింపఁదగి యుండును. ఇతరులగు నవైదికులకు ననర్థ దాయకంబగును.

## వ్యాహృత్యర్థః.

తత్రతత్తచ్ఛబ్ద ప్రకృతికేన సచ్చిచ్ఛుఖాత్మకం బ్రహ్మాభిధీయతే, అహామితి సర్వసాక్షీ ప్రత్యగాత్మాభిధీయతే, తయోస్సామా నాధికరణ్యే నైకత్వం. ఏవం సత్యఖం

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ర్థైక స్వభావం సచ్చిచ్ఛుఖాత్మకం పరబ్రహ్మోభి ధీయతే, స ఏవ ప్రణవార్థః, తధోక్తం, గీతాయాం ఓం తత్సదితి నిర్దేశో బ్రహ్మణస్త్రి విధస్స్మృత ఇతి. ఏవంవిధః ప్రణవ స్సర్వకర్మసు మన్త్రాదౌ ప్రత్యగాత్మా స్వాత న్త్ర్యేణ ప్రయుక్తస్సన్ సర్వపురుషార్థం సాధయతి, తధాచోక్తం గీతాయాం, తస్మాదో మిత్యుదాహృత్య యజ్ఞదానతపః క్రియాః, ప్రవర్తన్తే విధానోక్తాః సతతం బ్రహ్మవాదినా మితి.

తా. తచ్ఛబ్దముచేత సచ్చిచ్ఛుఖాత్మకమగు బ్రహ్మ యర్థమగును. అహం, అనఁగా సర్వసాక్షియగు ప్రత్యగాత్మ చెప్పంబడును. వానికిరెంటికి సామానాధిక రణ్యము చే నేకత్వము. ఇట్లుండ సచ్చిచ్ఛుఖాత్మక మగు పరబ్రహ్మయే ప్రణవార్థమగును. "ఓం తత్సత్" అని చెప్పుట బ్రహ్మకు మూఁడు విధముల నుద్యోతన చేయుచున్నది. కనుక నా ప్రణవము సర్వ కర్మాదియందు నుపయుక్త మగును. అదియె ప్రత్యగాత్మరూపమై సమస్త పురుషార్థములను సాధించును. ఓంకార యుక్తములగుచు యజ్ఞ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దాన తపస్సులు యథావిధిగఁ జేయున వగుచున్నవి, లేని చో నిష్ఫలములు.

అథ వ్యాహృత్యర్థః.

ఏవం ప్రణవార్థ ముక్త్వా వ్యాహృత్యర్థో వక్ష్యతే.

తా. ఇట్లు ప్రణవార్థము జెప్పంబడినది. వ్యాహృత్యర్థముం జెప్పగలడు.

భవ న్త్యస్యాం భూతా నీతిభూః, ౧. భావయతీతి విశ్వ మవకాశ ప్రదానేన స్థితిప్రదానేనవాభువః, ౨. సుష్టు అరణీయం, పాప్యం, సుఖమస్మి న్ప్రాప్స్యమితివాస్వః, ౩. ఏతే అర్థాః ప్రణవార్థా ఏవ.

తా. భూః, దీనియందు భూతములు బుట్టుచున్నవి గాన భూః, అగును, ౧. భువః, ప్రపంచము నవకాశ మిచ్చుటచేగాని స్థితి నిచ్చుటచే గాని భావించునది గాన భువః, అగును, ౨. స్వః, యోగ్యముగా పొందఁ తగిన దియు సుఖమును పొందఁ దగినదియు గాన స్వః, అని యగును ఇవి ప్రణవార్థములు.

ప్రసంగా దుత్తర వ్యాహృతీనా మర్థమాహ.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తా. ప్రసంగ సంగతిచే నుత్తరం వ్యాహృతుల కర్థముం జెప్పుచున్నాడు.

మహ పూజాయా మితిధాతోః సర్వేషాం సర్వ ప్రకారైః పూజ్యం మహః. ౪. సర్గకాలే వియదాదికం సర్వం స్వస్మా జ్జనయతీతిజనః. ౫. తప ఆలోచన ఇతి ధాతోః సర్వాణ్యా లోచయతీతి సర్వజ్ఞః సర్వప్రకాశ్యత్వేన తాపకంచేతి తపః, ౬. సత్య మవిపర్యస్త స్వభావం క్వచిద్దేశే కాల ఏకేనాపి ప్రమాణత్వేనా బాధితం సత్యం, ఆసాంస ప్త వ్యాహృతీనాం సత్తా స్వభావాది రూపార్థస్య ఉక్తత్వేన పరమాత్మ తత్త్వ ప్రతిపాదకత్వా త్తాదృశేన ప్రణవేన ప్రత్యేక మభి సంబంధః.

తా. మహ యను ధాతువునకు పూజ యర్థ మగుటచే నందఱిచేత నన్నివిధములుగఁ బూజింపఁబడునది గాన "మహః," అని యగును. ౪. సృష్టికాలమున నాకాశాది సర్వమును దనవలనఁ బుట్టింపజేయునది గాన "స్వః" యని యగును. "తప" ఆలోచనార్థకమగు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ధాతువు గాన సమస్తము నాలోచించుటచే సర్వజ్ఞము సర్వమును శిక్షించుటచే సర్వతాపకము నగుట "తపః" అని యగును. సత్యమనఁగా ఎప్పుడు మారనిదియు. ఏదేశమందుగాని ఏకాలమందుగాని యొకే ప్రమాణముగలిగి బాధను జెందని దనుట. ఈయేడు వ్యాహృతులకు సత్తయు స్వభావము నర్థమగుటచేఁ బరమాత్మ తత్వముం దెలుపునవి గానఁ బరమాత్మ రూపమగు ప్రణవముతోఁ బ్రత్యేకముగ సంబంధించును.

ఏవమేవ గాయత్ర్యాః ప్రణవార్థే నైకత్వం.

తా. ఇట్లే గాయత్రికిఁ గూడ ప్రణవార్థముతో నైక్యము కలుగుచుండును.

## గాయత్ర్యర్థః.

సవితుః సర్వస్య జగతః ప్రసవితుః, సవితృ శబ్దోపలక్షితస్య మాయాశబలితస్య మాయావ్యుదాసాయ స్వరూప లక్షణమాహ.

తా. సవితుః, అనఁగా సమస్త జగత్తును గనునదని యర్థము. సవితృశబ్దముచే నుపలక్షితమగు మాయచే

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శబలముగు సర్వమునకు మాయ లేకుండుటకే నిజరూపము జెప్పఁబడినది.

దేవస్యద్యోతమానస్య స్వయంప్రకాశ చిదేకరసస్య వేదాంత మహావాక్య తాత్పర్య విషయత్వ సిద్ధయే జిజ్ఞాస్యత్వ సిద్ధయేచ. అనంతానంద స్వరూపమాహ.

తా. తనంతట తాను ప్రకాశించుచు చిదేకరసము గలిగి ప్రకాశించుననుసర్థముగల దేవశబ్దము వేదాంత మహావాక్య తాత్పర్య సిద్ధికొఱకును తెలిసికొనఁదగినవా డనుటకును నంతములేని యానంద రూపమగుటను తెలుపుచున్నది.

వరేణ్యం సవితుర్దేవ స్యవరేణ్యం రూపం వరణీయంచ సర్వైః ప్రార్థనీయం సుఖైకతా రూపం సర్వై స్సుఖస్యైవ ప్రార్థనీయత్వాత్, ఏవం విధరూపస్య సమూల సంసార దాహకత్వ మాహ.

తా. సవిత్రుండగు దేవునియొక్క వరేణ్యం-వరింపదగిన అందఱచే ప్రార్థింపఁదగిన రూపమును (అనఁగా నిరుపాధిక సుఖరూపము, దుఃఖామిశ్రితము) అందరిచేతను

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దుఃఖరూపము లేని సుఖమే కోరఁదగి యుండును. ఇట్టి రూపమునకు మొకటితోఁగూడ సంసారమును దహించు శక్తిని దెలుపుచున్నాడు.

భర్గః సచ్చిదానందైకరసం నిర్గుణంరూపం పరమాత్మ రూపం ప్రకృతి ప్రాకృతాఖ్య సంసార గర్భదాహకం సాంతోయం శబ్దః. ఏవం విధం తత్వ మేవ కార్య కారణాని స్వమాయయా సృష్ట్వాజలే చంద్రవత్తే ష్వను ప్రవిశ్య జీవాఖ్యాం లబ్ధ్వాత్వం పదాభిధేయం సత్. బుధ్యాది ప్రేరకత్వే నావస్థిత మిత్యాహ

తా. భర్గః, సచ్చిదా నందములే ముఖ్యరూపము లుగా గల నిర్గుణమగు పరమాత్మరూపము ప్రకృతియొక్క ప్రాకృతమను సంసారమును దహింపఁజేయునది యని యర్థము (తేజస్సున కుదాహకత్వము సహజము) ఇది సకారాంత శబ్దము. ఇట్టి తత్వమే కార్య కారణములను తనమాయచే జలమందు చంద్రునివలె ప్రవేశించి జీవత్వ ముందాల్చి (నీవు అను రూపమునుదాల్చి) బుధ్యాదులను ప్రేరేపించు చుండునను నర్థముం దెలుపుచున్నాడు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ధియోయోన ఇతి, య ఇతి తృతీయ లింగస్థానే పుం లింగనిర్దేశః, యత ఏవం విధంనః, అస్మాకంమన ఆది కరణ ద్వారామం తవ్య బోద్ధవ్య విషయయోః శబ్దా ది విషయేషుచధియః ధీవృత్తీః ప్రచోదయాత్ సదా ప్రేరయతు, తద్బుధ్యాది ప్రేరకం సవితు ర్వరేణ్యం పరమానందం భర్గస్స మూల సంసార దాహకం నిర్గుణం రూపం ధీమహి ధ్యాయేమహి.

తా. యః అను పుంలింగ నిర్దేశము నపుంసకలింగ స్థానమందు జీవత్వ ద్యోతకము. ఇట్టి తేజస్సు మాకు మనస్సు మొదలగు కరణముల ద్వారాగా మననము చేయఁదగిన తెలియదగిన శబ్దాది విషయములయందు నా బుద్ధివృత్తులను ప్రేరేపించుఁగాత. అట్టి సవిత్రుని యొక్క శ్రేష్ఠమగునట్టియు పరమానందరూప మగు నట్టియు సమూలముగా సంసారమును దహింపఁజేయు నిర్గురూపమగు తేజస్సును ధ్యానించుచున్నామని సమిష్టి యర్థము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఏవం ప్రణవ వ్యాహృతి గాయత్రీణా మేక ఏవార్థః ప్రదర్శితః.

తా. ఇట్లు "ఓం" కారమునకును సప్త వ్యాహృతులకును, గాయత్రికిని యొకటియేయర్థమని చూపఁడినది.

ఇదానీం తచ్ఛిరసోర్థః. ఓమాప ఇత్యాదినా.

తా. ఇప్పుడా గాయత్రి శిరస్సునకు "ఓమాప" మొదలగుదానిచే వివరింపుచున్నాఁడు.

ఓమిత్యుక్తో ఽర్థః, ఆప్నోతీత్యాపః, అఖండ స్వరూపేణస ఏవ వ్యాపకః, సఏవజ్యోతిః, స్వయంప్రకాశః, రసఃస ఏవానందస్వభావః, అమృతం, తదేవామృతం, అమరణ ధర్మకం, బ్రహ్మేత దేవదేశతః కాలతో వస్తుతశ్చా నవచ్ఛిన్నం.

తా. ఓమనుదానికిదివరకే యర్థము వివరింపఁ బడినది. తునుకలుగాక నేకీభావముచే నంతట వ్యాపించుచున్నది గాన "నాపః" అనఁబడును. తనంతట తానే ప్రకాశించునది గాన "జ్యోతిః" యని పిలువంబడును. ఆనందరూపమగునది గాన "రసః" అనంబడును. మరణ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ము లేనిది గాన "నమృత" మని చెప్పంబడును. దేశకాల వస్తువులచే భేదమును జెందనిది గాన "బ్రహ్మ" మనం బడును.

ఏవం భూతార్థస్య వ్యాహృతి త్రయేణైక్య మాహ. భూరిత్యాదినా. ఉక్తోర్థః, ప్రణవవ్యాహృతి గాయత్రీ శిరసాం ప్రతిపాదిత మఖండైక రసస్వభావమర్థం పర బ్రహ్మై వేత్యంగీకరోత్యో మితి.

తా. ఇట్లర్థముగల శిరస్సునకు "భూర్భువస్సుః" అను వ్యాహృతిత్రయముతో నైక్యము నుపపాదించు చున్నాఁడు. అర్థ మిదివరలో చెప్పంబడియే యున్నది. ప్రణవ వ్యాహృతి గాయత్రీ శిరస్సులకు బ్రహ్మమందే తాత్పర్యమని చివరనున్న "ఓం" కారముచే నంగీకార మును దెలుపుచున్నాఁడు.

నను "సర్వేశాక్తాః ద్విజాప్రోక్తాః" ఇత్యుక్తత్వా ద్గాయత్ర్యాః శక్తిరూపత్వేనచ చతుర్వర్గం శత్యక్షు గాగాయత్రీ త్యుక్తత్వా ద్వర్ణాత్మకత్వం కథమితి చేన్న.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తా. ఇచ్చట అంతయు శాక్తేయములే యను వాక్యముచే గాయత్రి శక్తిరూప మగుచుండగా నిరువది నాల్గక్షరములు గలది యను వ్యాక్యముచే నక్షరమయత్వ మెట్లుప పాదింపఁబడినది యనుశంక జనింపఁగానట్లు కాదని సమాధానముం జెప్పుచున్నాఁడు.

శబ్దస్యశక్తిరూపత్వా దర్థస్య శివరూపతః అవినాభావ సంబంధః శివశక్త్యో రితిస్మృతిః, ఇత్యుక్తత్వా ద్దీప దీప్త్యోరివ చంద్ర చంద్రికయోరివ వాశివశక్త్యో ర్భేదా భేదస్య వక్తుమశక్యత్వాది త్యుక్తత్వాత్, గాయత్రీవా ఇదగ్ంసర్వం, య దిదం కించేత్యాది శ్రుతిస్థలే ప్వేత దర్థమేవేతి నిర్ణయాచ్ఛ శక్త్యావర్ణాత్మకత్వ మపీతిన శంకావకాశః.

తా. శబ్దము శక్తిరూపమును అర్థము శివరూప మగుటచే శివశక్తులకుండు సంబంధము ఎడతెగని దగుటచేత దీపమున్నంత కాలము కాంతియును చంద్రుడుండు వఱకు వెన్నెలయు నుండునటు లీశివశక్తులకు భేదమనిగాని యభేదమనిగాని చెప్పశక్యముగాని దగుటచేతను ఈ సమ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

స్తము గాయత్రియే యను నర్థమిచ్చు శ్రుతిగూడ యీ యర్థమునే దెలుపుటచేతను శక్తికి వర్ణరూపమగుట విధి స్పష్టము. అచ్చట శంక లేదు

కించ సోహమర్కః పరంజ్యోతిః, అర్కజ్యోతి రహం శివః, ఆత్మాజ్యోతి రసౌసూర్యః సర్వజ్యోతీ రసోహ మోం ఇత్యాదినా శివో గాయత్రీ మంత్రార్థ ఇతి తాత్పర్యం.

తా. ఆ నేను పరంజ్యోతి యగు సూర్యుండను సూర్యుడను తేజము నేను శివుఁడును. ఆత్మజ్యోతిగూడ సూర్యుండే యగును. సమస్త తేజస్సులును రసమును నేను నగుదును. రసమనునది జలనిష్ఠము. అచ్చటనే స్నేహ ముండును. స్నేహయుతము గానిది దీపముండదు గాన జ్యోతికి కారణమగు రసము సర్వాత్మకనుని వక్కాణించి యున్నాఁడు.

కించ సంధ్యాశబ్దేన శక్తిదేవ నాన్యా లక్ష్మ్యాదికా. అత ఏవాగ్నిర్ముఖ మిత్యాదినా జగదీశ్వర్యా స్సర్వ దేవాత్మకత్వం ప్రతిపాదితం, శివమద్వైతం చతుర్థం

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మత్యంత ఇత్యుక్త శ్రుత్యర్థ పర్యాలోచన యానత యోః పూర్వోక్త రీత్యా నిత్య సంబంధత్వాచ్చ శివ ఏవ గాయత్రీ మంత్రార్థ ఇతి.

తా. ఇంతియేగాక సంధ్యా శబ్దముచే శక్తియే వాచ్యము గాని యితరులగు లక్ష్మ్యాదులు లక్ష్యములు గారు. కనుకనే సంధ్యావందనమందు నగ్నిర్ముఖ మనుట మొదలిడి ప్రాణాపాన వ్యానోదాన సమానాన ప్రాణా శ్శ్వేతవర్ణ సాంఖ్యాయన సగోత్రా గాయత్రీ యను వఱకుండు వాక్యములచే గాయత్రికి సర్వాత్మకత్వము వివరింపఁబడి యున్నది. శివుని యద్వైతునిగాను చతుర్థునిగాను తలంచెదను నర్థముగల శ్రుతివాక్యమును నిత్య సంబంధముచే శివునే వక్కాణించుచున్నది. గాన గాయత్రీ మంత్రార్థము శివపరమే యగునని విస్పష్ట మగుచున్నది. కావుననే కాళిదాసుండు రఘువంశమందు వాగర్థా వివ సంపృక్తౌ వాగర్థ ప్రతిపత్తయే. జగతః పితరౌవందే పార్వతీ పరమేశ్వరౌ. క్వసూర్య ప్రభవోవంశః క్వచాల్ప

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

విషయామతిః, తితీర్షుర్దుస్తరం మోహో దుడుపేనాస్మి సాగరం అని దహరోపాస్తినే సూచించి యున్నాఁడు.

ప్రపంచాసావాదిత్యో బ్రహ్మేత్యాది వాక్యైః ఆదిత్యాన్తర్వర్తి తేజస ఏవబ్రహ్మత్వేన తాత్పర్యంన సూర్యాదేః, అత ఏవమనో బ్రహ్మేత్యుపాసీతేత్యాది ప్రతీకోపాసనేష్వప్యాత్మబుద్ధిః కార్యా, తేషాం బ్రహ్మవికారత్వాదితి శ్రీశంకరభగవత్పాదై రప్యుక్తం

తా. ఇట్లుండగా అసావాదిత్యో బ్రహ్మేత్యాది వాక్యములచేత నాదిత్యునియందుండు తేజమునకే బ్రహ్మత్వముగాని సమష్టికికాదు కనుకనే మనో బ్రహ్మేత్యాద్యపాసనోపాస్తి వాక్యములును! ఆత్మబుద్ధిచే నని తాత్పర్యమును దెలుపుచున్నవి. అందువలననే శంకరులు ప్రతీకములు బ్రహ్మవికారములే గాన తత్త్వేనోపాస్తిని చేయవలయునని చెప్పియుండిరి.

కించ భీషోదేతిసూర్యః, ఇత్యాది శ్రుత్యాబ్రహ్మతేజస ఏవ తాత్పర్యం, అత ఏవ యదాదిత్య గతం తేజః ఇతి గీతా వచనంచ, ఏవంసర్వాసు పూర్షుశేతే, ఏకో

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దేవ స్సర్వభూతేషు గూఢః. ఇత్యాది శ్రుత్యాచ సూర్యస్య జీవకోటి ప్రవిష్టత్వా త్యత్రయత్ర సూర్య స్య బ్రహ్మత్వేనో_క్తిః తత్ర తత్ర బ్రహ్మ తేజ ఏవేతి జ్ఞాతవ్యం.

తా. ఇంతియేగాక భీషో దేతిసూర్యః. అనుశ్రుతియు యదాదిత్య గతం తేజః అను గీతావాక్యమును ఏకో దేవ స్సర్వభూతేషు గూఢ ఇత్యాదిశ్రుతియు నుపాస్తులం దం తట నుండు తేజము బ్రహ్మమయమనియే తెలుపుచున్నది ఎట్లన విద్యుచ్ఛ_క్తి సర్వమం దొకటియైనను ఆయా శక టమును నడుపుటయం దెట్లు యంత్రాదులచే నాకర్షిం చి నడుపబడునో యట్లే సమస్తోపాసనలయందు తేజమొ క్కటియే యైయున్నను పాధినిబట్టి భేద ముచ్చరింపఁబడు చుండును.

కించ య ఏషోంత రాదిత్యే హిరణ్మయః పురుషః హిరణ్య శ్మశ్రు ర్హిరణ్యకేశాః, నమో హిరణ్య బా హవే హిరణ్యవర్ణాయ హిరణ్యపతయేంబి కాపతయ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఉమాపతయే పశుపతయే నమోనమః సయశ్చాయం పురుషే యశ్చా సావాదిత్యేస ఏకః సయ ఏవంవిత్ ఇత్యాది శ్రుత్యాసూర్య మండలాంతర్వ ర్తి తేజ శ్శివ ఏవ, అతఏవప్రాంచః. ఆదిత్య మండలగతం పురుషం హిరణ్యరూపంద్విజాతిభిరుపాసిత మంబి కేశం, యోనః ప్రబోధయతి సర్వమయః చితాత్మా భర్గ స్త మబ్జనిల యం శరణం ప్రపద్య ఇతి. శివశ క్తిసారె.

తా. బంగారు గడ్డము బంగారు వెంట్రుకలు గల పురుషుడు ఈ యాదిత్యుని మధ్య నున్నవాఁడని యర్థము నిచ్చు శ్రుతియు అతఁడే హిరణ్యబాహుఁడు హిరణ్యవర్ణు, డు హిరణ్యాధిపుఁడు నంబికా నాథుఁడు నను శ్రుతియుఁ సూర్యాదులయం దుండువాఁ డొక్కఁడే నను శ్రుతియు సూర్యమండల నుండుండు పురుషుఁడు శివుఁడేనని ప్రతిపా దించుచున్నవి. కనుకనే పూర్వులు సూర్యమండల మం దుండు హిరణ్యరూపుండగు నంబికా నాథుఁను బ్రాహ్మ ణునిచే నుపాసింపఁ దుచుఃబుద్ధులను గలుగఁజేయును యా తండే చిదాత్మకుం డగుచు చంద్రునందుగూడ గలఁడను

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వాక్యమును శివశక్తిసారమున వక్కాణించియున్నారు.

కించ, పూర్వోక్తరీత్యా గాయత్రీ మంత్రార్థశ్శివ
తేజ ఏవనాన్యః, ఏతేనైతత్ప్రకరణే యత్రయత్ర
సూర్యత్వేనోక్తి స్తత్ర తత్ర శివతేజ ఏవేతిధ్యేయం
యేన సూర్య స్తపతి తేజసేద్ధః, నతత్ర సూర్యోభాతిన
చంద్రతారకా నేమా విద్యుతో భాంతి కుతోయ
మగ్నిః ఇత్యాదినా శివతేజ ఏవేతి ద్రష్టవ్యం, ఓం
కారస్థలేపి తద్యై వేతిధ్యేయం, తథా చాయం భావః,
బుధ్యాది ప్రేరకత్వే నోక్తజీవస్య సవితృరిత్యా ద్యు
క్తబ్రహ్మాత్మక తేజసశ్చైక్యేనభావనా కర్తవ్యేతి.

తా. ఇట్లిదివరలో చెప్పినట్లు గాయత్రీమంత్రము
యొక్క యర్థము శివుండే. గాన నీసంధ్యావందనమం
దెచ్చటెచ్చట సూర్యునిగా వర్ణింపఁబడు నచ్చటచ్చట శివుని
తేజస్సుగా భావింపనగును. ఇచ్చట సూర్యుఁడు నక్షత్ర
ములు మెఱుపులు అగ్నియును లేదను శ్రుతిగూడ యీ
శివునే బోధించుచున్నయది. ఓంకారముగూడ నట్టిదియే
గాన నీగాయత్రికి [illegible] తెలిసి యర్థ [illegible] బుధ్యాది

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ప్రేరకుండగు జీవునికిని సవితృ రిత్యాదులచేఁ జెప్పంబడు బ్రహ్మతేజంబునకు నైక్యమని భావింపనగును.

తథాచ గాయత్రీ మంత్రజపం కరిష్య ఇత్యత్ర పూర్వోక్తరూపేణ గాయత్రీ ప్రతిపాదక మంత్రార్థస్యేశ్వరతేజసః తదర్థభావన, మత ఏవ యోగ పాతంజల సూత్రే తజ్జప స్తదర్థభావన మితి, ఏవం చైకాగ్రచిత్తవృత్యా తదర్థానుసంధానం కర్తవ్యమితి ఫలితం.

తా. ఇట్లుండ "గాయత్రీ మంత్రజపం కరిష్యే" అను స్థానమునందు గాయత్రిని చెప్పునట్టి మంత్రార్థమగు నీశ్వరతేజముయొక్క భావనని యర్థము జెప్పనగును. కనుకనే యోగపాతంజలసూత్రమునందు తజ్జపమనఁగా తదర్థభావనమని ప్రతివాదింపఁబడినది గాన నిట్లేకాగ్రవృత్తిచే నర్థవిచారణము జేయందగునని తాత్పర్యము.

కించ, గాయత్రీ మంత్రార్థః శ్లోకరూపేణ విద్యారణ్యస్వామిభిః.

తా. గాయత్రీ మంత్రార్థమును విద్యారణ్యులు శ్లోకరూపముగా నుచ్చరించి యున్నారు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

య ఇత్యలింగం ధర్మజ్ఞ సత్యజ్ఞానాది లక్షణం నోస్మా
కం బహుధాభ్య స్త భిన్న భేద దృశాంతథా. ధియోం
తఃకరణే వృత్తీః ప్రత్య క్ప్రిణవచారిణీః ప్రచోదయా
త్ప్రేరయతి ప్రార్థనేయం విశిష్య తే. సవితు స్సకలో
త్పత్తి స్థి సంహార కారిణః, దేవస్య ద్యోతమానస్య
స్వానందా త్క్రీడతోపివా. వరేణ్య మాశ్రయణీ
యం యదాధార మిదంజగత్, భర్గస్య సాక్షాత్కా
రేణ విద్యా తత్కార్య దాహకం, తదిత్య వాఙ్మనో
గమ్యం ధ్యాయే త్సూర్యమండలే, ధీమహ్య
హంస ఏవేతి తేనైవా భేదసిద్ధయే, ఇతి బ్రహ్మపర త్వేన
వ్యాఖ్యాతం.

తా. లింగము లేనిదియు (అగుటచే గు ర్తింప
రానిదనుటస్పష్టము) ధర్మజ్ఞసత్యజ్ఞానాదు లే లక్షణముగా
గలదియు (అనఁగా ధర్మ సత్యజ్ఞాన రూపమేగాని వేఱు
రూపము లేదనుట) అనేక పర్యాయము లలవడిన వేఱను
దృష్టిగల మాకు (అనఁగా వేఱుగ నున్నదని భేదమునే
తెలుసికొ[illegible] శ్రద్ధ[illegible] నేత్రములకు శ్వేద

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మును జ్ఞానమున కభేదమును తెలియుననుట) ప్రతికూల ముగా నుండునట్టి యంతఃకరణ వృత్తులను ప్రేరేపించు గాతమని ప్రార్థించుట. అది యెట్టిదనిన సకల జగదుత్ప త్తిస్థితి సంహారకారకమును స్వానందమునఁ గ్రీడించుచు ప్రకాశించు దేవునియొక్క జగదాధారమై యాశ్రయిం పఁదగినట్టియు సాక్షాత్కారముచే నవిద్యా తత్కార్య ముల నశింపఁజేయునదియు ప్రసిద్ధమగు నవాఙ్మానస గోచరమైన తేజము నేనేయను నభేదజ్ఞానముతో సూర్య మండలమున ధ్యానించుచున్నానని యర్థమును బ్రహ్మపర ముగా వర్ణించియున్నారు. అనఁగా బ్రహ్మాండ పిండాం డముల కైక్యభావనచే హృదయస్థానమునందు పిండాండ ముననుండు సూర్యునకును బ్రహ్మాండస్థ సూర్యునకును నభేద భావనచే బ్రహ్మస్వరూపము సూర్యమండలస్థమును నాశయముతో ధ్యానింపవలయును.

వస్తుతస్తు గాయత్రీ మంత్రార్థ తాత్పర్యం జగదీశ్వరో పరత్వేన న్యాయ్యం, నసూర్యాది పరత్వేన.

తా. నిజముగ నాలోచింపఁగా గాయత్రీ మంత్రా ర్థము జగదీశ్వరునియందు తాత్పర్యమగుటయే యుక్తము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సూర్యాదిపరమగు నర్థము న్యాయ్యముగాదు.

కుత ఇత్యుక్తే. సంధ్యావందనస్యైవ ప్రస్తుతత్వా
న్మంత్ర జపస్య తన్మూలకత్వాచ్చ, శివశక్త్యోర్దీప
దీప్త్యర్థకత్వేన మహతః పరమిత్యాది శ్రుత్యా తదు
పాసనైవ సమ్యగితి ప్రతిపాదితత్వాచ్చేతి.

తా. ఎందువలన యనిన ప్రస్తుతము సంధ్యా
వందనమే ముఖ్యమగుటచేతను శివశక్తులు దీపదీప్తులవంటి
వారగుటచే మహత్తుకంటె పరమనుశ్రుతిచే శక్త్యుపాసన
యే ప్రతిపాదింపం బడుటచేతను (అనఁగా నష్టమూర్తి
యగు శివుండు కాలరూపమున దివారాత్రి రూపముగా
పరిణమించుటచే శివశక్తులయొక్క సంధిని తెలుసికొనుటకు
శక్తి నుపాసించి తెలిసికొనుట ముఖ్యము. శివుండు సృష్టి
కాలమున శక్తిచే నావరింపఁబడినవాఁడగుటచే శక్త్యు
పాస్తివలనగాని శివుండు గానరాడనుట అందుచే శక్త్యు
పాస్తియే సంధ్యావందనమున ముఖ్యమని తాత్పర్యము.

ఓం తత్సదితి నిర్దేశో బ్రహ్మణ స్త్రివిధ స్మృత ఇతి.
గీతా వచనా త్తచ్ఛబ్దేన బ్రహ్మశబ్ద వాచ్యస్తురీయ
శ్శివ ఇతి.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తా. ఓం తత్సదను నిర్దేశము బ్రహ్మస్వరూపము మూఁడువిధములని తెలుపుచున్నదను గీతా వాక్యముచేఁ బ్రహ్మశబ్దార్థము తురీయరూపుడగు శివుండే యగుచు న్నాఁడు.

ఏవంచ బ్రహ్మాది శ్చతురీయంచ ప్రణవస్యార్థ ఈరిత ఇతి మనువచనాచ్చ శివమద్వైతం చతుర్థం మన్యన్తే ఇతి శ్రుతేశ్చ తచ్ఛబ్దేన శివః తథాచ సర్వ కర్తృ వస్తునః క్వచిన్న పుంసకత్వేన క్వచి త్పుంస్త్వేనాపి నిర్దేశః శ్రుతిషు బహ్వీషు దృష్ట ఇతిన లింగబాధః, యథాస ఏవేహానఖాగ్రేభ్య ఇత్యాదినా పుంస్త్వేన బహ్మావా ఇదమగ్ర ఆసీ దిత్యాదినా నపుంస కత్వేన నిర్దేశః. తథాచ పరవస్తునః నపుంసకత్వాదినా నిర్దేశో నవిరుధ్యతే.

తా. ఇట్లుండ ఓంకారమునకు బ్రహ్మాదులును తురీయము నర్థమను మనువాక్యముచేతను తురీయ మద్వైతము శివమను శ్రుతిచేతను తచ్ఛబ్దమునకు శివుం డర్థము. గనుక సర్వ కర్తయగు వస్తువు నపుంసక లింగముచేతను పుంలింగముచేతను శ్రుతులయం దంతటను చెప్పబడి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యున్నదిగాన బాధకముగాదు. ఇట్లుండ "సఏవేహో సఖా గ్రేభ్యః" అని పుంలింగముగాను "బ్రహ్మవాథ ఇదమగ్ర ఆసీత్" అని నపుంసకముగాను శ్రుతులుగలవు గాన పర వస్తువు నీరెండు లింగములచే చెప్పవచ్చునని తాత్ప ర్యము. (దీనిచే విచారింపఁగా తటస్థుడుగ నూరకుండు కాలమున నపుంసకుండును. సృష్టియందు ప్రవృత్తుఁడగు కాలమున పురుషుడు నగును. ఇట్లు ప్రవర్తించి సృష్టి కారణమును సంధిరూపమునగు శక్తియను మూఁడవ రూపము నాశ్రయించును. ఆరూపము నపుంసక పుంస్త్వ ములకు మధ్యమందునదిగాన నీరెంటియందు సంహారము నగలియును. సృష్టిని విడునుగాన లేనిది మాయయని పేరుగలదై స్త్రీరూపము స్వాతంత్ర్యానర్హమైయుండును గాన స్త్రీ స్వాతంత్ర్యము తగదని మన పెద్దలు నిషేధించి నారు.

తథాచ తత్స్వరూపం భర్గః, భర్జతి తమస్కాండం దహ తీతి వ్యుత్పత్త్యా జగదీశ్వ రాత్మక తేజః, భర్గస్స్వ సాక్షాత్కారేణా విద్యా తత్కార్య దాహక మితి విద్యారణ్యాచార్యాః, ధీమహిధ్యాయేమహి యద్వా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తద్భర్గః వరేణ్యమితి ధీమహీ త్యన్వయః, అయమర్థః, మనోభీష్ట సిద్ధ్యర్థం తత్తేజ శ్శరణ్య మితిధ్యాయ ఇతి, ఏవంచ తచ్ఛబ్దేన శివశక్త్యాత్మకో దీపదీ ప్తినదర్థః ప్రతి భాతి, అథ తద్ధ్యానస్య నిమిత్తం ప్రదర్శయతి, ధియ ఇతి, యః య దిత్యర్థః, యచ్ఛబ్దశ్చ యదిత్యర్థే లింగ వ్యత్య యతోభ వేదితి లోహిత కంఠ వచనాత్, య ఇత్య లింగధర్మం యశ్సత్యజ్ఞానాది లక్షణమితి విద్యా రణ్యాచార్యై రప్యు క్తత్వాచ్చ యత్తే జఃనో అస్మాకం బహువచనం ఛాందసంధియః దీప్తి త్తీః. ప్రచోద యాత్. ప్రేరయతి.

తా. అట్లుకాగా తత్తురూపముగాగల చీకటులను బోగొట్టునది యను నుత్పత్తిగల జగదీశ్వర రూపముగు తెజస్సు తాను గనపడుటచే నవిద్యను దానికార్యమును నశింపఁజేయునని విద్యారణ్యులు సెప్పియుండిరి. అట్టి తెజస్సును ధ్యానించుచున్నామని తాత్పర్యము. లేక ఆతె జస్సుశ్రేష్ఠమయినదనిగూడఁ జెప్పనగును. అట్లు చెప్పఁగా నాయభీష్ట సిద్ధికై యాతెజమే రక్షకమని ధ్యానించెద ననుట. ఇట్లు చెప్పుటవలన తచ్ఛబ్దముచే శివశక్త్యాత్మక

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మగు దీపదీపకాంతులవంటి తెజమని తెలియుచున్నది. ఇట్లు తెజమునుచెప్పి దానిని ధ్యానించుటకు కారణముం జెప్పుచున్నాఁడు. ఏ తెజము (యచ్ఛబ్దమును లింగము మార్చి చెప్పవలయును) విద్యారణ్యులు యచ్ఛబ్దమునకు లింగములేని సత్యజ్ఞాన లక్షణమగు తెజమర్థమని చెప్పిరి. మాకు (బహువచనము ఛాందసము) దీవృత్తులను ప్రేరే పించుకొలకని నిమిత్త కథనము

అయంభావః, యస్మాన్నిర్లిప్తస్యాపి మమా ధ్యాత్మిక ముఖదుఃఖ త్రయంసంభవతి తద్దోష నివృత్తిద్వారా నిత్యసుఖ సంపాదనార్థం తద్ధ్యాయ ఇతి.

తా. ఎందువలన నిర్లిప్తుఁడనైన నాకును అధ్యాత్మికము మొదలగు దుఃఖములు గలుగును గనుక వానిని ద్రోసి నిత్యసుఖము గలుగునో అందుకుగాను ధ్యానించుచున్నానని తాత్పర్యము.

యద్వాసవితు స్సూర్యస్య తన్మండలాంత ర్వర్తిన ఇత్యర్థః, దేవస్య ప్రకాశమానస్య శివస్య వరేణ్యం శ్రేష్ఠం తత్సంబంధా దేవతస్య ప్రకాశకత్వ యోగాదితిభావః, తద్భర్గస్తేజ శ్శక్త్యాత్మక మితి యావత్, ధీమహి ధ్యా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యేమహి, నః ధియః ప్రచోదయా దిత్యుత్తరత్రా న్వయః.

తా. లేక సూర్యమండల మందుండు దేవునియొక్క శ్రేష్ఠమగు శక్తిస్వరూపమగు తెజస్సును ధ్యానించెదము గాన నాశక్తి మా బుద్ధియందుండి ప్రేరేపించుగాత.

అత్రైదం రహస్యం, శివశక్త్యో రభేద సూచనార్థం తద్య ఇత్యుభయ పదప్రయోగః, ననుయత్ర కుత్రాప్యేతాదృశ వ్యవహారాభావా త్సిద్ధాన్త వాక్యత్వాచ్చ సందేహాస్పద పదఘటనం నయుక్త మితిభాతీతి యత్తన్న, తస్య సాదృశ్యా భావాన్న పూర్వోక్తదోషః.

తా. ఇచ్చట నొకరహస్యముగలదు. తచ్ఛబ్దయచ్ఛబ్దార్థములగు శివశక్తుల కభేదసూచనకై యత్తచ్ఛబ్దముల నిర్ణయించిరి. గనుకనే పై యాకరణులుగూడ "యత్తదోర్నిత్య సంబంధః" అని వచించి యున్నారు. ఎచ్చట నిట్టి వ్యవహారము లేదు గాన సిద్ధాంతవాక్యముగాన సందేహాస్పదమగు పదప్రయోగ మసంగతమనిన కూడదు. దానికి సాదృశ్యమే లేదు గాన మీాదోషమున కవకాశమే లేదు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అప్రతిద్వం ద్వందాంపత్య ముమానాథ మహంభజ
ఇతి ప్రాచీనోక్తేః, అతఏవో క్తం కూర్మపురాణే శ క్తి
శ క్తిమతోర్భేదం వదంత్య పరమార్థతః, అభేద మను
పశ్య న్తి యోగిన స్తత్వచి న్తకాః, ఏత దతిశయస్తు
పూర్వం సన్వేకమేవా ద్వితీయం బ్రహ్మేత్యత్రైవశ
మీాచీనతమైవో క్త మిత్యత్రో పరమ్యతే.

తా. కనుకనే ప్రాచీనులు "నిరుపమానమగు దాం
పత్యముగల శివుని భజించెద" మని వాక్రుచ్చి యుండిరి.
అందున కూర్మపురాణమందు నట్లే చెప్పబడియున్నది.
శ క్తి శ క్తిమత్తులకు గుణగుణులకు వలెనే యభేదమేగాని
భేదము లేదు. ఆ యభేదమును యోగులే తెలియగలరు
గాని తదితరుల కభేద్యము. ఘటమునుచూచి యెఱుపు
తెలుపు మొదలగునవి వేఱుగ దలంచు టందఱకు
శక్యము ఘటరూపములకు భేదము పండిత గమ్యముగాని
పామర గమ్యముగాదు.

ఏవంచ సంధ్యావందన స్యై వం విశేషోయో జనీయః.

తా. ఇట్లుండఁగా సంధ్యావందనమున కీవిశేషము
తెలియదగి యున్నది.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

బ్రహ్మచైతన్యస్యైవ గాయత్రీమంత్ర ప్రతిపాద్యత్వా చ్చిచ్ఛక్తి రూపమాదిత్య రూపం గాయత్రీరూపంచ బ్రహ్మ తద్బ్రహ్మ సంధ్యా దేవతేత్యేవ గంతవ్యమ్.

తా. బ్రహ్మాత్మకమగు చైతన్యమే గాయత్రీ మంత్రముచే జెప్పఁబడుటవల్ల చిచ్ఛక్తిరూపము నాదిత్య రూపమును గాయత్రియు బ్రహ్మమేను. ఆ బ్రహ్మము సంధ్యా దేవత యగును.

ఇదమేవో పాసనంధ్యా నాత్మక మాదిత్యస్య బ్రహ్మత్వా దేవ దేవతయా విశినష్టిశ్రుతిః, ఉద్య న్త మ స్తం యంత మాదిత్య మభిధ్యాయ న్కుర్వ న్బ్రాహ్మణో విద్వాన్, సకలం భద్రమశ్నుతె సావాదిత్యో బ్రహ్మేతి బ్రహ్మైవ సన్బ్రహ్మ ప్యేతి య ఏవం వేదేతి. వక్ష్యమాణ ప్రకారేణో పాసనం కుర్వ న్సంధ్యాశబ్ద వాచ్య మాదిత్యం బ్రహ్మేతి ధ్యాయన్నైహికాముష్మికం సకలంభద్రమశ్నుతె, య ఏవము క్త ధ్యానేన శుద్ధాన్తఃకరణో బ్రహ్మ సాక్షాత్కురుతె సపూర్వమపి బ్రహ్మైవ సన్నజ్ఞానా జ్జీవత్వం ప్రాప్తోపి యథోక్త

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ధ్యానేన తదజ్ఞానాపగమె బ్రహ్మైవ ప్రాప్నోతీత్యే తదేవాభి ప్రేత్య వ్యాసోప్యాహ.

తా. ధ్యానాత్మకంబగు నీయుపాసననే సూర్యుండే బ్రహ్మయగుటంబట్టి దేవతఁగా శ్రుతులయందు వర్ణించియున్నాఁడు. అదియెట్లన (ఉదయించు చున్నట్టియు నస్తమించుచున్న యాదిత్యుని ధ్యానముజేయు బ్రాహ్మణుండగు విద్వాంసుఁడు సమస్త శ్రేయముల ననుభవించును. గాన నీయాదిత్యుఁడే బ్రహ్మయని తెలియతగినది. అట్లు తెలిసినఁ దానే బ్రహ్మయగును. (ఇదియే బ్రహ్మోపదేశమనంబడఁదగును. అయితె ఇత నెల్లపుడు బ్రహ్మస్వరూపమే గాన తిరిగి బ్రహ్మయగుననుట పునరుక్తి కాదాయను శంకగలదు. దానికి నజ్ఞానమువలన బ్రహ్మత్వము వదలి తిరిగి జ్ఞానసంపాదనఁ జేయుననుటయే సమాధానము. ఇట్టి యజ్ఞానము నెందుకు పొందవలయునన్న విలాసార్థమనియే చెప్పనగును. "లీలామానుష విగ్రహః" మొదలగు నార్యోక్తులే సూచకములు. దానినే వ్యాసులు గూడ చెప్పియున్నాఁడు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నభిన్నాం ప్రతిపద్యేత గాయత్రీం బ్రహ్మణా సహ,
అహమస్మీ త్యుపాసీత విధినా యేన కేన చిదితి.

తా. గాయత్రిని బ్రహ్మకంటే వేఱుగాఁ దలఁపఁ గూడదు. ఏవిధిచేనైన "సహామస్మి" యను భావనతో నుపాసించుట యుక్తము.

తచ్చోపాసనం గాయత్ర్యైవ కర్తవ్య మిత్యాహస ఏవ.

తా ఈయుపాస్తి నితర మంత్రములచేఁ జేయం దగదా యనువిషయమునుగూర్చి గాయత్రిచేతనే చేయం దగుగాని యితరములవలన గూడదని యాజ్ఞవల్క్యులే చెప్పుచున్నాఁడు.

గాయత్రీనామ పూర్వాహ్ణే సావిత్రీ మధ్య మేహని,
సరస్వతీచ సాయాహ్నే సైవసంధ్యా త్రిధాస్మృతా.
తన్నిర్వచన మపి స ఏవాహ, ప్రతిగ్రహాదన్న దోషా
త్పాతకా దుపపాతకాత్, గాయత్రీ ప్రోచ్యతే తస్మా
ద్గాతారం త్రాయతేయతః, సవితృ ద్యోతనాత్సైవ
సావిత్రీ పరికీర్తితా జగతః ప్రసవిత్రీ వాగ్రూపత్వా
త్సరస్వతీ సవితృ ప్రకాశత్వా ద్వాగాయత్రైవో పాసన
మం కర్తవ్య మిత్యర్థః

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తా. రోజులో మొదటిభాగము గాయత్రీస్థానము. గానము సేయువారల రక్షించు దేవత గనుక దేవతా పూజాదికము ప్రాతఃకాలముననే జేయదగినదని చెప్పబడి యున్నది సంగవమను సంధికాలమువరకు నది విహితము. మధ్యాహ్నమున సావిత్రీరూపము అనఁగా జగత్తును పుట్టించుశక్తి. అనఁగా వ్యక్తరూపము వ్యక్తమధ్యమఃములు జగత్తులని తాత్పర్యము. కనుకనే వ్యక్త కార్యములఁగు మానవపూజాదికములు మధ్యాహ్నమందుజరుపఁదగినవి. అపరాహ్నమువరకు నదియే. సాయంకాలమందు సరస్వతీరూపము అనఁగా వాగ్రూపము. ఈ వాగ్రూపోపాస్తి సాయంకాలమం దుపాసింపదగినది. ఆదియం దుండు దేవతోపాస్తియు నంతమందుండు సరస్వత్యుపాస్తియు నవ్యక్తములే. అంకురోత్పత్త్యనంతర బీజదళములవలె గానకయుండును. ఇవి మాతా పితృరూపములు పితృమాతృరూపములు పూర్వోత్తర పక్షములు వ్యావహారికమందు మధ్యమమగు వ్యక్తమే గ్రాహ్యము క్రియార్హమైన దదియేగాన కర్మలెల్ల నప్పుడే జేయనగును.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అత ఏవగాయత్రీ మభ్యసే త్తావద్యావ న్నక్షత్రాణి పశ్యతి గాయత్రీ మభ్యసే త్తావద్యా వదాదిత్య దర్శన మితిచ.

తా. కావుననే నక్షత్రదర్శన మగుచుండఁగనే గాయత్రి నుపాసింప నగును. సూర్యు డుండఁగనే సాయం సమయమున నుపాసింపవలయును. అని చెప్పియున్నది.

ఏవంచ యత్కెశ్చిదు క్తం, అర్ఘ్యాన్తా సూతకె సంధ్యేత్యాశ్వలాయనోక్తేః, సావిత్ర్యా చాంజలిం ప్రక్షిప్య ప్రదక్షిణం కృత్వా సూర్యం ధ్యాయన్న మస్కుర్యా దితి పైతీన సజ్ఞ్యేక్తైశ్చ, అసావాదిత్యో బ్రహ్మేతి మంత్రేణైవ సూర్యోపాసనం సంధ్యేతి తచ్చి న్త్యమ్.

తా. ఇట్లుండఁగా కొందఱు "సూతకము దర్ఘ్య దానమువఱకే సంధ్య"యని యాశ్వలాయనుండు చెప్పుట చేతను "సావిత్రిచే నంజలినిచ్చి ప్రదక్షిణము చేసి సూర్యు నిధ్యానించుచు నమస్కారము చేయవలయు" నను పైతీనస వాక్యముచేతను ఈ సూర్యుడే బ్రహ్మయను మంత్రముచే సూర్యు నుపాసించుటయే సంధ్యయని చెప్పుదురు. అది కొంచము విచారణీయము [సరిపోదనుట] దీనిని పట్టి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యే బ్రహ్మోపదేశము గూడ నుపనయనమునందుఁ జరుగును. కర్మోపాస్త్యంగము క్రియారూపమగు గాయత్రీశక్త్యుపదేశమువలనను నిష్క్రియోపాస్తియగు బ్రహ్మోపదేశమువలన బ్రహ్మోపాస్తియుఁ గర్తవ్యములని సూచించుచున్నది.

> పూర్వసంధ్యాతు గాయత్రీ సావిత్రీ మధ్యమా స్మృతా, యాభవేత్పశ్చిమాసంధ్యా సావిజ్ఞేయా సరస్వతీతి । సైవసంధ్యా త్రిధాస్మృతేతిచ । గాయత్రీకృతసూర్యోపాసనపనసన్ధ్యాశబ్దప్రయోగాత్ । అఘ్న్యాంతాసూతకే సంధ్యేత్యాదా సంధ్యాశబ్ద ప్రయోగోగాణః.

తా. మొదటిసంధ్య గాయత్రియనియు, మధ్యసంధ్య సావిత్రియనియు, సాయంసంధ్య సరస్వతియనియు, నాసంధ్య మూఁడువిధములు అని యుండుటచే గాయత్రితో చేయంబడు సూర్యోపాస్తియే సంధ్యాశబ్దార్థము. అఘ్న్యాంతా సూతకే సంధ్యయనుచో

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సంధ్యాశబ్దప్రయోగము లాక్షణికము గాని ముఖ్యార్థము గాదు.

అతఏవ యోగయాజ్ఞవల్క్యేన ఓంకారో వ్యాహృతీస్సప్త గాయత్రీచ శిరస్తథా ఆపోహిష్ఠేత్యృచస్తిస్రో ద్రుపదాచాఘమర్షణం పురోవ్యాహృతి రుదుత్యం చిత్రం తచ్చక్షుస్తేజోఽసీతి యథాక్రమం। గాయత్ర్యాశ్చతురీయేణ సంధ్యామే త్రైస్సమాచరేత్ । ఇతి గాయత్రీ కృతసూర్యోపాసనమేవ. సంధ్యాశబ్ద వాచ్యమితి తథాచ గాయత్రీ కృతసూర్యోపాసన మేవ సంధ్యోపాసన మితి తదేవప్రధానం మార్జనార్ఘ్యాది సంధ్యోపస్థానాది కంసర్వం మంగళ మితి వివేకః.

తా. కనుకనే యోగయాజ్ఞవల్క్యుండు చెప్పియున్నాఁడు. ఓంకారము సప్తవ్యాహృతులు, గాయత్రి గాయత్రీ శిరస్సు ఆపోహిష్ఠాది ఋక్కులు మూఁడు ద్రుపదా అను నఘమర్షణము పురోవ్యాహృతి ఉదుత్యంచిత్రంతచ్చక్షు తేజోఽసీత్యాది మంత్రములు. తురీయగాయత్రీ వీనితో జేరినది సంధ్యాశబ్దవాచ్యము. ఇవిలేనిచోట

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గౌణము. గనుక గాయత్రితో చేయఁబడు నుపాసనమే సంధ్యోపాసనము అదియే ప్రధానము మిగిలిన మార్జ నార్ఘ్యాదికము మంగళము కొఱకాచరించఁబడును.

తథాచ తన్మంత్ర జపస్తుమానసిక ఏవ సమీచీనః । ఏవం వాచకాఖ్య ఉపాంశుశ్చ మానసస్త్రివిధస్మృతః । త్రయాణాం జపయజ్ఞానాం శ్రేయాన్స్యా దుత్తరోత్తర ఇతి స్మృతిరత్నాకర వచనేనచ గాయత్రీ మంత్రజపో మానసిక ఏవసమీచీన ఇతి భావః.

తా. గనుక గాయత్రీ మంత్రజపము మానసికమే మిక్కిలి ప్రశస్తమైనది. స్మృతిరత్నాకరమునందు వాచకము ఉపాంశువు, మానసికము. అని మూఁడు తెఱంగుల జపము చెప్పఁబడియున్నది. వానిలో ముందుముందు దిశ్రేష్ఠమయినది.

కించ. బహిఃకృతం హరితేప్రబలం అంతఃకృతం సుకృతే ప్రబలమితిచ సర్వత్రైతద్దృశ్యమా నత్వాత్ । ఏతేన గాయత్రీజపో మాలికయాకార్యః। తదభా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వేతు పర్వభిస్తుజపః కార్యోనాంగుళీనాంని పాతైః
నిపాత నైస్తుయజ్జప్తం తత్సర్వం రాక్షసంభవేత్ ।
ఇతి వ్యాసవచనేన.

తా. ఇదిగాక లోకమందు విజ్ఞులందఱు వెలుపలికి బిగ్గఱగా జపించిన దురితమధికమనియు లోపల జపించిన సుకృత మధికమనియు గణించియున్నారు. గనుక గాయత్రీజపము మాలికచేఁ జేయనగును. అది లేనిచో నంగుళిపర్వలయందు చేయనగును. వ్రేళ్లను లెక్కించుచు జపింపఁగూడదు. అట్లు వ్రేళ్లులెక్కించుచు జపించినచో రాక్షసకృత్యమగును.

అంగుళీజపవిధిః

అనామామధ్య మారభ్య మధ్యమధ్యాంతతశ్శివే
అగ్రక్రమేణ దేవేశి తర్జన్య గ్రాంతకంశివే। గాయత్రీ మాలికాప్రోక్తా సంహారాద్వటకాభిధా। అనామామధ్య మారభ్య మధ్యమామధ్య భాగతః మూలభాగ క్రమేణేవ ప్రదక్షిణమను వ్రజేత్ । చీనమాలాతు సంప్రోక్తా సంహారాత్తే తపాలజా। మధ్యమా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మధ్యమా రభ్య తర్జనీ మధ్యభాగతః। అగ్రక్రమేణ దేవేశి తర్జనీమూలతశ్శివే గాంధర్వ మాలికాప్రోక్తా సంహారాద్వట వాసినః.

తా. అనామికయొక్క మధ్యపర్వము మొదలుకొని మధ్యమయొక్క మధ్యపర్వమువఱకు చివరపర్వముల వరుసను తర్జనీమూలమువఱకు లెక్కింపఁగానది గాయత్రీమాలయగును. సంహారక్రమమైనచో వటుకమనంబడును. అనామికా మధ్యపర్వనుండి మధ్యమామధ్య భాగము గుండ మొదటిపర్వక్రమముచేత ప్రదక్షిణముగా లెక్కించిన చీనమాలయగును. సంహారక్రమమైనచో క్షేత్రపాలజము మధ్యమామధ్య పర్వనుండి తర్జనీ మధ్యపర్వము గుండ చివరనుండి తర్జనీమూలమువఱకు లెక్కింపఁగా గాంధర్వమాలికయగును. సంహారము వలన వటవాసియగును.

సంకల్ప పూర్వకం దర్భేష్వాసీనో దర్భాన్ధారయ మాణస్సోదకేన పాణినా ప్రత్యఙ్ముఖస్సావిత్రీం సహ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ప్రకృత్వా ఆవర్తయేచ్ఛత కృత్వోఽపరి మిత కృ త్వో వేత్యాప స్తంబః.

తా. సంకల్పమాచరించి దర్భలను పఱచికూర్చుని దర్భలు వ్రేళ్లయందు ధరించి ఉదకము గలకమండులువును గ్రహించి పశ్చిమాభిముఖుడై సావిత్రి నుపాసింపవలయును. సాయంకాల సంధ్య ప్రారంభమగును గనుక పశ్చిమముఖత్వము విధించినాడు. ఆయుషాస్తిని వేయి సంఖ్య గలుగునట్లు గాని నూఱు గలుగునట్లు గాని యపరిమితముగాఁ గాని చేయవచ్చును.

మనస్సంతోషణం శౌచం మౌనం మన్త్రార్థచిన్తనం। అవ్యగ్రత్వ మనిర్వేదో జపసంపత్తి హేతవ ఇతి బృహస్పతి వచన పర్యాలోచన యాచమానసిక జపస్యైవసహస్రోత్త మత్వాద పరిమితకృత్వో వేత్యాపస్తంభోక్తి రపితదభిప్రాయేణైవేతి జ్ఞేయా.

తా. మనస్సున సంతోషము, శుద్ధి, మౌనము మంత్రార్థాలోచనఁ తొందర లేకుండుట దుఃఖము లేకుండుట జపము సాగుటకు హేతువులని చెప్పిన బృహస్పతి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వాక్యముచే మానసికజపమే యుక్తమని తోఁచుచున్నది. గనుకనే యాపస్తంబుడును "అపరిమిత కృత్వః" అని చెప్పియున్నాఁడు.

నోచేత్కథం సంఖ్యాయాం మనస్థితం స దంతర్భావయతి। తస్మాద్గాయత్రీ జపంశతవారం సహస్రవారం వాకరిష్య ఇతి సంకల్ప్యైతజ్జపంతథా కుర్యాదిత్యాపస్తంబీయా నామాశ్వలాయనానాంచేతి యదుక్తం తత్సర్వమజ్ఞవిషయం నతద్జ్ఞవిషయ మితి వివేకః.

తా. మానసికాభిప్రాయమే లేనియెడ సంఖ్యయందుండు మనస్సు నంతర్భావము చేయును గనుక గాయత్రీ జపమును నూఱుమార్లు గాని వేయిమార్లు గాని చేసెద నని సంకల్పించి జపమాచరింపవలయు నను నాపస్తంబాశ్వలాయనాదులు చెప్పినదంతయు నజ్ఞానులకు గాని జ్ఞానులకుఁ గాదని యెఱుంగునది.

నోచే త్పూర్వోక్తయావత్ఫక్కికా భంగప్రసక్తిః ప్రసజ్యేత। తత్రైవం పంథాః.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తా. అట్లు గాకున్న పూర్వమందు చెప్పిన మార్గమంతయు భంగమగును. గాన నాయజ్ఞుల పక్షక యిట్లని చెప్పుచున్నాడు.

యథాశక్తి గాయత్రీ మంత్రజపంకరిష్య ఇతి సంకల్ప్య। ఏకమనసా తన్మంత్రార్థాను సంధానం కార్యమితి తద్జ్ఞానాం। అజ్ఞానాంతు తత్ప్రికాలేణేతి॥ అత ఏవవిద్వదవిద్వద్విషయత్వేన తత్తత్కర్మణా మాచారోద్వివిధ ఇతి శ్రుతిస్మృతి వ్యవహారః। యథాజ్యోతిష్టోమేన స్వర్గకామోయజేతే త్యాదికమజ్ఞయజ్ఞః। తస్త్యైవం విదుషోయజ్ఞస్యాత్మేత్యాది నాతద్జ్ఞయజ్ఞ ఇతి వివేకః.

తా. యథాశక్తి గాయత్రీ మంత్రజపంకరిష్యే (శక్తికి తగినట్లుగా యత్రిని చేసెదను) అని సంకల్పించి యేకాగ్రమనస్సుతో నామంత్రార్థమును విచారింపవలయునని జ్ఞానులకు చెప్పఁబడియున్నది. జ్ఞానులు కాని వారలకు సంఖ్యతోనే సంకల్పము విధింపఁబడినది.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కనుక నే కర్మనాచరించుటలో విద్వాంసులకు నవిద్వాం సులకు భేదము శ్రుతిస్మృతులందు జ్యోతిష్టోమముచే స్వర్గకాముండు యాగమాచరింపవలయునని యజ్ఞులకును యజ్ఞముకాత్మయే ప్రధానమని విజ్ఞులకును చెప్పఁబడి యున్నది

అతఏవ శ్రేయాన్ద్రవ్యమ యాద్యజ్ఞాద్జ్ఞాన యజ్ఞః పరంతప। సర్వంకర్మాఖిలంపార్థజ్ఞానేపరిసమాప్యత ఇతి గీతాయాం కించ। స్మృత్యన్తరే। వామేన పూరయేద్వాయుం పూరణాత్పూరక స్మృతః। వాయుం ని గృహ్యమనసాజపే న్మన్త్రమనన్యధీః। కుమ్భకస్స తు విజ్ఞేయః ప్రాణాయామస్య లక్షణమితి। జప లక్షణ పర్యాలోచన యాచవిచార్యమాణె గాయత్రీ మన్త్రజపః। మానసిక ఏవ ప్రశ స్తస్సజ్జానామితి ని రూపిత మితి వేదితవ్యం.

తా. కనుక నే ద్రవ్యముతోఁ జేయుయజ్ఞము కన్న జ్ఞానయజ్ఞమధికము ఎందువల్ల ననఁగా సమస్తకర్మలు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

జ్ఞానమందే లీనమగును గనుక యను గీతావాక్యమునను వామముచే వాయువును పూరించిన పూరకమనంబడును. అట్లు పూరించి మనస్సు వాయువు నరికట్టి మఱియొక దాని యందు మనస్సుంచక మనస్సుచే జపించుట కుంభకము. ఇదే ప్రాణాయామలక్షణము. అనెడు జపలక్షణమును విచారించినను గాయత్రీ మంత్రజపము మానసికమే ముఖ్యమని తెలియుచున్నది

అతఏవ సాంఖ్యభాష్యే। ఆరమ్భప్రకరణే। పశుహింసాది జన్మనాపునః పశుత్వప్రాపకానర్థ హేతునా పూర్వేణజాయమానా। విశుద్ధజ్యోతిష్టోమ నామకాపూర్వాపేక్షయా హింసాది సంకరాభావాద్విశుద్ధత్వమేవ సమ్యగిత్యాదిక ముక్తంవాచస్పతి మిశ్రైః.

తా. కనుకనే సాంఖ్యభాష్యమం దారంభప్రకరణమున వాచస్పతి మిశ్రులచేత జెప్పబడియుండెను. పశుహింసాదులచేఁ గలిగినట్టియు తిరిగి పశుత్వము ననర్థకమును గలుగఁజేయునట్టి యపూర్వము (అనఁగా నదృష్ట

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ముచే గలుగుచుండు విశుద్ధమగు జ్యోతిష్టోమమను నపూర్వముకంటె హింస మొదలగు సంకరములు లేనందున యోగ్యమగు విశుద్ధత్వమని.

కించ । శ్రీమచ్ఛంకరభగవత్పాదైః శాంకర శారీరకభాష్యే । విచారే కర్మణాం తారకాంశే ప్రసక్తిరేవ నాస్తీతి నిశ్చితం । యథా । నకర్మణేత్యాదినా.

తా. విచారించఁగా కర్మలకు తరింపఁజేయుటయందు (కర్మచేగాదను శ్రుతిచే ప్రసక్తియే లేదని శంకరులు వారి శారీరక భాష్యమునఁ జెప్పిరి.

ఏవంచ మన్త్రార్థజ్ఞానవతో భావనా । నపర్యాది గణనావిచారః । తథాచ । దర్భహీనాతుయా సన్ధ్యాదానం చైవవినోదకం । అసఙ్ఖ్యాతం మన్త్రజపం తత్సర్వం నిష్ఫలంభవేదితి శాతాతపవచనం వాచకోపాంశు విషయమితి భావనా నధికారిణా మితి తాత్పర్యమ్.

తా. ఇట్లుండ మన్త్రార్థజ్ఞానముగల వానికి భావనయే ముఖ్యము పర్యాదులందు లెక్కించుటలేదు. గను

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

క, దర్భలేని సంధ్యయు, దానమును, వినోదముకొఱకగు ను (నిష్ఫలమనుట) లెక్కించని జపముగూడ నట్టిదేయని చెప్పిన శాతాతపవాక్యము వాచకోపాంశు జపవిషయ ము గాని మానసిక విషయముగాదు. భావనాధికారము లేని వారి కని తాత్పర్యము.

కించ। బహిర్గణనే భావతో నభావనా సిద్ధిః। తస్యా ఏవ విశేషఫలదాయకత్వాత్ । అతఏవ స్థాణురయం భారహార ఇత్యాది నార్థజ్ఞప్రశంసా। అనర్థజ్ఞనిందాచ పూర్వమేవ ప్రదర్శితా।

తా. ఇఁక నేమనఁగా వెలుపలకు లెక్కించినచో మనసునందు భావనాసిద్ధియుండదు. అట్లు మనంబున భావించుటయే విశేషఫలదాయకము గనుక మన్త్రార్థము తెలియని వాఁడు భారమును మోయుస్తంభము వంటి వాడని యనర్థజ్ఞనిందయు నర్థజ్ఞస్తోత్రము నాచరింపం బడెను.

అతఏవ గాయత్రీ మన్త్రైర్బహిః హ్యాకాన్యానుసన్ధానం కర్త

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వ్యమితి నిర్ణీతే బహిర్వ్యాపార ఏవ యదివినియోగ
స్తర్హి తస్యతత్ఫలం నస్యాత్.

తా. కనుక గాయత్రీమంత్రముచే బ్రహ్మైక్యాను
సంధానము సేయనగునను నిర్ణయముచే వెలుపలి క్రియ
నే వినియోగించుచున్న దానికి ఫలము లేదు.

అతఏవ శ్రీమద్భగవచ్ఛంకరపాదైః శ్శివానంద లహ
ర్యాం.

గంభీరే కాసారే విశతివిజనే ఘోరవిపినే విశాలేశైలే
చ భ్రమతి కుసుమార్థం జడమతిః। సమర్ప్యైకం
చేతస్సరసిజముమానాథభవతే స్థితంచే ద్యోగోసా
సచ పరమయోగీ సచసుఖీ॥ ఇత్యాది నాబహుధాం
తరాళికవ్యాపారస్యైవసమీచీనత్వం ప్రకాశిత మితి
ప్రకృతమను సరామః.

తా. లోతగు చెరువులందును జనములేని యడవు
లందును విశాలమగు కొండలందును పూలకొఱకై దిరిగె
దరు. ఒకచిత్తమను సరసిజమును పార్వతీపతియం
దర్పించి యుండినవాఁడే యోగియు సుఖియు నగునను

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శంకరభగవత్పాద వాక్యముచే చాలవఱకు అంతరంగిక జపమే ముఖ్యమని వచింపఁబడియున్నది. గాన విస్తార మును వదలి ప్రకృతమను సరింతము.

ఎవంచ బహిస్సంఖ్యాంత రాళికయోర్భేజనై లక్షణ్యేన వినియోగ ఉచితఇత్యుత్పశ్యామః.

తా. గనుక లెక్కించుటలోను లెక్కింపక మానసిక మాచరించుటలోను కారణభేద ముండుటవలన వినియోగ భేదముగూడ నుచితమని యూహించుచున్నారము.

## మార్జనాది ప్రయోగః.

ఏవం ప్రాణానాయమ్య। సంకల్ప్య। తతస్సన్ధ్యా ముపాస్మహే। అప ఇత్యాది భిర్మన్త్రైర్నవ భిర్మార్జనం చ కేదిత్యాశ్వలాయనః। విశేషమాహాశౌనకః। తిసృభిర్మార్జనం కుర్యాదాపోహేతి కుశోదకైః। పదేపదే క్షిపేన్మూర్ధ్ని ప్రతిప్రణవ సంయుత మితి.

తా ఇట్లు ప్రాణాయామ మాచరించి సంకల్పించి పిదప సంధ్యాముపాస్మహే (సంధ్యనుపాసింతము) అని చెప్పి "ఆపోహిష్ఠామయోభువః, తానఊర్జేదధాతన"

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఈమొదలగు తొమ్మిది మన్త్రములచే మార్జన గావింప వలయు నని యాశ్వలాయనుండు నుడివెను. ఇదిగాక శౌనకుండుగూడ "ఆపోహిష్ఠ" మొదలగు మూడు ఋక్కులతో దర్భోదకముచే ప్రతిపాదమునకు నోంకార సహితముగా శిరమున నుదకమును జల్లుకొనవలయును. అని చెప్పియున్నాడు.

మార్జనానంతరం కింకుర్యాదిత్యాహ స ఏవ సూర్య శ్చేత్యను వాకేన ప్రాతఃకాలేపి బేదపః। ఆపఃపునం తు మధ్యాహ్నే సాయమగ్నిశ్చ మన్త్రతః.

తా. మార్జనమయిన పిమ్మటచేయు కృత్యమును గూడనాయాశ్వలాయనుండె చెప్పియున్నాడు. అది యెట్లన ప్రాతఃకాలమందు "సూర్యశ్చేతి" మన్త్రముచేతను మధ్యాహ్నమున "అపఃపునంతు" అను మన్త్రముచేతను సాయంతనమందు "అగ్నిశ్చ" అను మంత్రముచేతను దకమును పుచ్చుకొనవలయును. దీనిచే నంతఃకరణ శుద్ధియేర్పడును.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఆచమ్యాథపునశ్చాప ఇత్యృగ్భిర్నవభిః క్రమాత్ ఋగంతే మార్జనం కుర్యాత్ విధనానేన బహ్వృచ ఇతి, విశేషాన్తరమపిస ఏవాహ। కుర్యాచ్చత్వారి పాత్రాణి సన్ధ్యాకాలే గృహేద్విజః। మార్జనే ప్రాశనేచార్ఘ్యే తథైవాచమనే సదా। ప్రణవేనైవ వ్యాహృత్యా గాయత్ర్యా ప్రణవాద్యయా। ఆపోహిష్ఠేతి సూక్తేన చతుర్ధా మార్జనంభవేదితిచ। ఆపోహిష్ఠేతి సూక్తస్యాపి ప్రణవార్థకత్వమస్తీతి సూచనార్థమితిజ్ఞేయం.

తా. అచమనముం జేసి తిరిగి "యాపోష్ఠాదినవ ఋక్కులచేతను ఋగంతమందు మార్జనచేయవలయును. ఇట్లింకొక విశేషముంగూడ నాశౌనకుండే చెప్పియున్నాఁడు సంధ్యవార్చు నప్పుడు పురుషుఁడు మార్జనకు ప్రాశనకును, అర్ఘ్యమునకును, ఆచమనమునకును, నాల్గు పాత్రలను సిద్ధపఱచి యుంపవలయును. ప్రణవముచేఁ గాని వ్యాహృతులచేఁ గాని ప్రణవయుతమగు గాయత్రిచేఁగాని ఆపోహిష్ఠేత్యాది సూక్తముచేఁ గాని నాల్గువిధ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ములుగా మార్జనమాచరింపవచ్చును. ప్రణవార్థమును అపోహిష్ఠేత్యాది ఋగర్థమును నొకటియని యీప్రమాణముచే సూచింపఁబడియున్నది.

తతఃకిం కుర్యాదిత్యత్రాహ। బ్రహ్మ ఋతం చేత్యభిమన్త్ర్యాపః సమాఘ్రాయక్షిపేదథః। ఋతం వాఽపి త్ర్యృచం వాపిజప్త్వా తదనపేక్షితః। సమాచమ్యాతతస్తిష్ఠేదీషచ్చాభిముఖోరవేః॥ ఇతి॥

తా. పిమ్మటచేయు విధానమును బ్రహ్మచెప్పియున్నాఁడు "ఋతంచ యను ఋక్కుచే నుదకము నభిమంత్రించి వాసనఁజూచి భూమిపై చూడకుండ నుంచవలయును. ఋతంచేత్యాది మూఁడు ఋక్కులు చెప్పినను చెప్పవచ్చును. పిమ్మట నాచమనమాచరించి సూర్యాభిముఖుండు గావలయును. ఇది తాంత్రికమంచుండు. పాపపురుష దహనమునకు గాను ప్రతినిధియగును.

శౌనకోపి॥ ఉద్ధృత్య దక్షిణేనైవ జలంగోకర్ణవత్కరం। నిధాయనాసికాగ్రేత త్పాపపూరుష ముచ్చరణ్॥ ఋతంచేతి త్ర్యృచంవాపి ద్రుపదాం వాజపే.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దృచమ్ । దక్షునా సాపుటేనైవ పాపాత్మానమపో
హామేత్ । తజ్జలం నానలోక్యాథ వామభాగేక్షితౌ
క్షిపేత్ । విసృజ్య దర్భాంస్తత్రైవ ధృత్వాదర్భాన్త
రంతతః । పాణిభ్యాం జలమాదాయ గాయత్ర్యా
చాభిమన్త్రితమ్ । రవేరభిముఖస్తిష్ఠన్ త్రిరూర్ధ్వం
సన్ధ్యయోఃక్షిపేత్ .

తా. శౌనకుండుగూడ చెప్పుచున్నాఁడు ఎడమ
చేతిచే నీటిని గ్రహించి యాచేతిని గోకర్ణమువలెఁ బట్టి ము
క్కుకొననునిచి పాపపురుషు స్మరించుచు ఋతంచయను
ఋక్కుతోఁ గాని ద్రుపదాదను ఋక్కుచేగాని మంత్రించి
దక్షిణ నాసాపుటముగుండ పాపపురుషుని వెడలగొట్ట
వలయును ఆయుదకమును తిరిగి చూడఁగూడదు. ఎడ
మభాగమున నుంచనగును. పిమ్మట నాదర్భలను విడిచి
క్రొత్తదర్భల గ్రహించి రెండుచేతులచే జలము గ్రహించి
గాయత్రిచే మంత్రించి సూర్యునకెదురుగ నిలిచి పైగా
మూడుసంధ్యలందు జలము విడువవలయును.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గాయత్ర్యాచాభిమన్త్రితమిత్యత్ర ప్రణవవ్యాహృతి యోగో బోద్ధవ్యః।

ఓంకార వ్యాహృతియుతాం గాయత్రీం వేదమాతరమ్। జప్త్వా జలాంజలిం దద్యాద్ధ్యానం ప్రతి తన్మనా ఇతి భావః। ప్రాతర్మధ్యాహ్నయో రప్సుక్షిపేత్సాయం మహీతలే.

తా. గాయత్రిచే నభిమంత్రించు నప్పుడోంకారముతోను వ్యాహృతులతో నుచ్చరింపవలయును. ప్రాతఃకాలమున మధ్యాహ్నమున నుదకమందే యుదకాంజలి నుంచవలయును సాయంకాలమందు భూమియం దుంచవలయును.

అత్రవిశేషస్స్మర్యతే, ద్వౌపాదౌ తుసమౌకృత్వా పూరయేదుదకాంజలిం, గోశృంగమాత్ర ముద్ధృత్య జలమధ్యే జలంక్షిపేత్.

తా. ఇచ్చట కొంతవిశేషముగలదు. రెండుపాదములు జతచేసి యుదకము నంజలియందు నింపియాదోయిలిని శిరస్సుకుపైగా సాపుకొమ్మంత యెత్తున నెత్తిజల

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ములోనే జలము నుంచదగును.

తర్జన్యఙ్గుష్ఠయోగేన రాక్షసీముద్రికాభవేత్, యో దదాతి తథా చార్ఘ్యం తత్తోయం రుధిరంభవేత్.

తా. తర్జనివ్రేలును బొట్టనవ్రేలును కలిసిన రాక్షసీముద్ర యగును గాన నట్లుచేయఁదగదు. చేసినచో నాయుదకము రక్తమే యగును.

అసావాదిత్య మన్త్రేణ సోదకే నైవ పాణినా, ప్రదక్షిణ మనువ్రజ్య త్వాచ మేత్సన్ధ్యయోర్ద్వయోరితి.

తా. "అసావాదిత్యో బ్రహ్మ" అనుమంత్రముచే నుదకపాణియై ప్రదక్షిణ మాచరించి పిదప నాసంధ్యల రెండిట నాచమింపదగును.

అథ మధ్యాహ్నే విశేష మాహాశ్వలాయనః

తా. ఇఁక నాశ్వలాయనుండు మాధ్యాహ్నిక సంధ్యయందుండు భేదము నుగ్గడించుచున్నాఁడు.

మధ్యాహ్నేతు విశేషోయం ప్రదద్యాద్ధంస ఇత్యృచా, త్రిర్వా కృష్ణేన మంత్రేణ గాయత్ర్యాహంస ఇత్యృచా.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తా. మాధ్యాహ్నిక సంధ్యయందు "హంస" అనెడి మూఁడు ఋక్కులచే ముమ్మారైనా, "ఆకృష్ణేన" అను మంత్రముచేతను గాయత్రిచేతను "హంస" అను ఋక్కుచేతను ముమ్మారైనా యర్ఘ్య మాచరింపవల యును.

ప్రాయశ్చిత్తార్ఘ్యదానే విశేషః.

తా. ప్రాయశ్చిత్తార్ఘ్యదానమందు విశేషమును చెప్పుచున్నాఁడు.

౧ యదద్యకచ్చ వృత్రహన్, ఇతి ప్రాతఃకాలే
౨ ప్రాత ర్దేవీ మదితింజో, ఇతి మధ్యాహ్నే
3 ఉద్ఘే దభిశ్రుతామఘమ్, ఇతి సాయమ్.

తా. యదద్యేతి ఋక్కుచే ప్రాతఃకాలమందును, ప్రాతర్దేవీమిత ఋక్కుచే మధ్యాహ్నమందును, ఉద్ఘేద భీతి ఋక్కుచే సాయంకాలమందును ప్రాయశ్చిత్తార్ఘ్య మీయవలయునని కొందఱమతము. లేనిచో గాయత్రి తో నైన నీయవలయును. ఇది కాలాతిక్రమణ ప్రాయ శ్చిత్తము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఉపస్థానంచ మధ్యాహ్నే కుర్యాత్సూర్యస్య సమ్ముఖ ఇతిచ.

తా. మాధ్యాహ్నిక సంధ్యయం దుపస్థానము గూడఁ జేయవలయును.

పునశ్చ సింహావలోకనన్యాయేన మార్జన బలికర్మార్చన భోజనాని దేవతీర్థేన కుర్యాదితి హారీతవచనాత్తచ్చ మార్జనం ధారాచ్యుతేన నకార్యమ్, తథాచ, బ్రహ్మ, ధారాచ్యుతేనతోయేన సన్ధ్యోపాస్తిర్విగర్హితా, పితరోనప్రశంసంతి న ప్రశంసంతి దేవతాః.

తా. తిరిగి సింహావలోకనన్యాయముచే మార్జన బలికర్మ, అర్చన, భోజనాదికము దేవతీర్థముచేఁ జేయనగు నను హారీతవచనముచే మార్జనము ధారఁగా చేయగూడదనువిషయమును వివరింపుచున్నాఁడు. దానికి ప్రమాణము. బ్రహ్మరంధ్రమునుండి ధారఁగా వచ్చునట్లు మార్జనమాచరించుట తగదు. దానిని పితృదేవతలు గాని దేవతలు గాని హర్షింపరు.

కథంతర్హి మార్జనమిత్యత్ర సప్రవాహ, నద్యాంతీర్థే

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

త్రహ్మదేవాపి భాజనే మృణ్మయేపివా, ఔదుమ్బరేథ సౌవర్ణేరాజతే ధాతుసమ్భవే, కృత్వాతువామహస్తే వా సన్ధ్యోపాస్తింస మాచరేత్. కృతోద్వేదకమితి శేషః, ఔదుంబరే తామ్ర మయే.

తా. మార్జనముచేయుటెట్లను ప్రశ్నకుత్తర మొసంగుచున్నాఁడు నదియందైనా, తీర్థమందైనా, మడుగునందైనా, మట్టిపాత్రయందైనా, మేడియాకుల దొప్పయందైనా, బంగారుపాత్రయందైనా, వెండిపాత్రమందైనా, ధాతుపాత్రమందైనా, యెడమచేతనైనా, యున్న యుదకముచే మార్జన నాచరింపవలయును. త్రామ్రపాత్రకుగూడ ప్రాశస్త్యముగలదు.

ఏవంచ యదుక్తంవామహస్తేజ లంకృత్వా యేతుస న్ధ్యాముపాస తే, సాసన్ధ్యానిష్ఫలాజ్ఞేయా అసురాస్తేన తర్పితాః, ఇతి తత్తుమృణ్మయాది పాత్రసద్భావేన కర్తవ్య మిత్యవిరోధః.

తా. ఇట్లుండ (ఎవ్వరెడమచేత నుదకముంచి సంధ్యావందన మాచరింతురో వారి యాసంధ్యనిష్ఫల మగు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చు ననురప్రీతిం చేయు ననువాక్యము న్మృణ్మయాది పాత్ర లే నిసమయమందు చేయవలయునను నర్థముచే విరోధ ము లేని దగును.

ఏవం మార్జనాది ప్రకారముక్త్వాతన్మన్త్రార్థో విశదీక్రియ తే, త్రిసంధ్యా మార్జనే ప్రణవా దీనాముక్తోర్థః, అపోహి ష్ఠేతినవర్చస్య సూక్తస్యసిన్ధు ద్వీపామ్బరీషో వా, ఆపంగాయత్ర మనుష్టుబన్తం, పఞ్చమీవర్ధమా నా సప్తమీప్రతిష్ఠా, అన్త్యేద్వేనుష్టుభౌ, మార్జనే వినియోగః.

తా. ఇట్లు మార్జనాదిక మాచరించు విధిని చెప్పి యు మంత్రార్థమును వక్కాణించుచున్నాఁడు. మూఁడు సంధ్యలయందు మార్జనమందు ప్రణవాదులకుఁ జెప్పిన యర్థమే. అపోహిష్ఠాది తొమ్మిదిఋక్కులుగల సూక్త ము (ఇది ప్రక్షిప్తములు చేరకుండుటకు) సింధుద్వీపుఁడు గాని యంబరీషుడు గాని ఋషి (ఈతఁ డాచరించిఫలము ను బొందినవాఁడు) ఆపంగాయత్రమని గాయత్రీఛంద మారంభమై యనుష్టుబంతముగా గలదియని యర్థము

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

(ఛందోనియమము) అయిదవది వర్ధమానఛందము. ఏడవది ప్రతిష్ఠాఛందము. మిగిలినయాఱును గాయత్రీఛందములు.

మార్జనమన్త్రాః.

ఆపోహిష్ఠా మయోభువః, తానఊర్జేదధాతన, మహేరణాయచక్షసే.  ౭–౯–౫.

వ్యా. హేయస్మాత్కారణాత్, హేఆపః, యూయం మయోభువః, సుఖస్యభావయిత్ర్యః, స్థఃభవథ, తాః, తాదృశాయూయం, నోఽస్మాన్, ఊర్జే, అన్నాయదధాతన,ధత్త,అన్నప్రాప్తియోగ్యానస్మాన్కురుతేత్యర్థః.

తా. ఓ యుదకములారా? ఎందువలన సుఖమునకు స్థానమైయుండిరో అందువలన మమ్ములను, అన్నమును పొందతగినవారినిగా జేయుఁడని ఋగర్థము దీనికి తాత్పర్యముగా "నపఏవ సర్జాదౌ" అను ప్రమాణముచే ప్రధానసృష్టిగ నెన్నబడియున్నదిగాన సుఖహేతువనుటకు సంశయములేదు. జీవనమనియు నామాంతరముగలదు. తొమ్మిది ఋక్కులవరకును మండలాధ్యాయసంఖ్య యొకటే.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యో వశ్శివతమో రసః తస్య భాజయతేహనః ఉశతీరివ మాతరః.

వ్యా. హే ఆపః, శివతమాః, అత్యంతమఙ్గళాః, సర్వజీవనహేతుత్వాదితి భావః, యః, వః, రసః, ఇహాద్య, నః, తస్యతం భాజయత ఉశతీస్సమృద్ధిం కామయమానా, మాతర ఇవ మాతరో యథా స్తన్యస్య రసం, భాజయంతి పాయయంతి, తద్వదితి.

తా. ఓ యుదకములారా? మీరు జీవజీవనప్రదులు గనుక వృద్ధిని కోరు తల్లులు స్తన్యాదుల చేపెంచురీతిగా మీరు మమ్ముల బెంపుడు.

తస్మా అరంగమామవో యస్య క్షయాయ జిన్వథ, ఆపో జనయథా చనః.

వ్యా. హే ఆపః, యూయం, యస్య, పాపస్య, క్షయాయ అరం, క్షిప్రం, వః, యుష్మాన్, గమామ, గమయామి, వయం శిరసి ప్రక్షిపామేత్యర్థః, యద్వా యస్య అన్నస్య క్షయాయ నివాసార్థం, యూయమోషధీర్జిన్వథ, తర్పయథ, తస్మై తదన్నముద్దిశ్య, వయం, అరం,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పర్యాప్తం, యథాభవతి తథా, వో యుష్మాన్ గమామ, గచ్ఛామః, కించ, హేఆపః, నః, అస్మాన్, అజనయథ చ, పుత్రపౌత్రాది-జననేన ప్రజనయథ, ప్రకృష్టజనాన్కురు తేత్యర్థః,

తా. ఓయుదకములారా? ఏపాపక్షయము కొఱకుగాను మిమ్ముల శిరసుననుంచుచున్నామో ఆపాపక్షయముం జేయుడు అనిగాని అన్నము గలుగుటకై ప్రార్థించుచున్నాము గాన నన్నదాయకములగు నోషధులను పొందింపుడు. ఎప్పుడు భూమిని సస్యవంతముగ జేయుండనిగాని యర్థము. ఓ యుదకములారా? అట్టి యన్నము నిచ్చిగాని పాపక్షయముం జేసిగాని మమ్ముల వృద్ధిఁజెందువారిఁగాఁ జేయుడు. "ఆపస్స్వభావతో మేధ్యాః" అనుటచే పవిత్రమగు నుదకములచే గాని పాపక్షయమగుచు వృద్ధి గానేరదు.

శన్నో దేవీ రభిష్టయ ఆపోభవన్తుపీతయే, శంయోరభి స్రవన్తునః.

వ్యా. నోస్మాకం పాపనోదనద్వారేణ, శంసుఖంభవతు,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దేవీః, దేవ్యః, ద్యోతమానాః, ఆపః, అభీష్టయే, అభ్యేషణాయ, అభీష్టప్రదానాయ భవంతు, పీతయే, పానాయచ భవన్తు, తథాశ మున్పన్నానాం రోగిణాం శమనం, యాః, అనుత్పన్నానాం, యాపనం, పృథక్కరణం కుర్వన్తు, అపిచ నోస్మాక, మభిఉపరి, స్రవన్తు, శుధ్యర్థం సిఞ్చన్తు.

తా. మాకు సుఖముం గలుగఁజేయును గాత. ప్రకాశమానమగు నుదకములు మాయభీష్టముల నిచ్చుగాక. త్రాగుటకు తగినవగుగాక. పుట్టినవారలకు సుఖమును పుట్టనివారలను వేఱుగజేయుట మొదలగు కార్యములఁ జేయుగావుత. (ద్రవ్యాదిపిండీభావ హేతుర్గుణస్స్నేహః, ద్రవ్యాదుల నుముద్దజేయు గుణము స్నేహమనబడును.) అను కాణాదవచనముచే పిండోత్పత్తి వృద్ధులకు దకములే కారణము లనుట.

ఈశానా వార్యాణాంక్షయ న్తీశ్చర్షణీనాం అపోయాచామిభేషజం.

వ్యా. వార్యాణాం, వారిప్రభవానాం, వ్రీహియవానాం,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యద్వా, వరణీయానాం, ఈశానాః, ఈశ్వరాః, చ ర్షణీనాం, మనుష్యాణాం, క్షయన్తీః, నివాసయిత్రీః, ఆపః, ఉదకాని, భేషజం, సుఖనామైతత్, పానా యోదకసుఖంయాచామి, అహం ప్రార్థయే.

తా. ఉదకమువల్ల పుట్టిపెరుగు ధాన్యాదుల కీశ్వరులును లేక సేవించువారల కీశ్వరులు నయినట్టిన్ని, మనుజులకు నివాసయోగ్యమగు నుదకములు భేషజములగు కాక, "అపోయాచామి భేషజం" భేషజము లనఁగా సుఖహేతువలగు నుదకములను గోరుచున్నాననుట ప్రాణిజీవనహేతువులు గనుక.

అప్సుమేసోమో౽బ్రవీత్, అన్తర్విశ్వాని భేషజ అగ్నిం చ విశ్వశంభువమ్.

వ్యా. అప్సుజలేషు, అంతః, మధ్యే, విశ్వానిభేషజాని, సర్వాణ్యౌషధాని, సంతీతిమే మహ్యాం మన్త్రదర్శినే మునయే సోమో౽బ్రవీత్, విశ్వశంభువం, సర్వస్యజగతిస్సుఖకరం, ఏతన్నామకం చాగ్నించ, అప్సువర్త మానం, సోమో౽బ్రవీత్. యస్మాదేవంతస్మా... అ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గ్నే(స్త్ర)మోజ్యాయాగ్ంస ఇత్యనువాకే, సోపఃప్రా
విశత్, అగ్నేరప్యప్సు ప్రవేశమామనన్తి, లతాగుల్మ
మూలాదీనాం వృష్టిజన్యత్వేన జలవర్తిత్వం ప్రసిద్ధం.

తా. ఉదకమధ్యమందే సమస్తమగు నోషధిజాల
మును గలదు. అని మంత్రార్థము దెలిసిన సోముఁడు చె
ప్పెను. సమస్తలోకమునకు సుఖమునిచ్చునగ్నియు నుద
మందేక లండని యూతండు నుడివెను. అగ్నికంటె పెద్దవి
మూడుగల వనుచు ననువాకమందు చెప్పబడి యుండెను.
తరుగుల్మాదులు గూడ నుదకాధారములే కృపీటయో
నిర్జ్వలనః” అని నిఘంటువుగూడ ప్రమాణము.

ఆపఃపృణీతభేషజం వరూథంతన్వే 3 మమజ్యోక్చ
సూర్యం దృశే.

వ్యా. హేఆపః, మమ, తన్వే, శరీరార్థం, వరూథం, రో
గనివారకం, భేషజ, మౌషధం, పృణీత, పూరయత,
జ్యోత్, చిరంద్రష్టుం, నీరోగా వయం శక్నువామేతి
శేషః.

తా. ఓయుదకములారా! నాశరీరమునకు రోగ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నివారణముం జేయుడు అట్లుచేసిన చిరకాలము నన్నుచూ డగలరు. అని యుదకములను జీవనములు గనుక ప్రార్థించెను. దీనిచే నుదకమయమగు వైద్యము సూచించుచున్నది.

ఇదమాపః ప్రవహాత యత్కించదురితంమయి యద్వాహామభిదుద్రోహ యద్వా శేప ఉతానృతమ్.

వ్యా. మయి, యజమానే, యత్కించ దురితం, అజ్ఞానాన్నిష్పన్నంవా, అథవా, అహం యజమానః, అభిదుద్రోహ, సర్వతోబుద్ధి పూర్వకం ద్రోహం కృతవానస్మివా. (అనగా శేప, సాధుజనంశప్తవానస్మితియదస్తి, ఉత, అపిచ, అనృతముక్తవానితి యదస్తి, తదిదమఖిల మపరాధజాతం ప్రవహాత, అస్మత్తాపనీయ ప్రవాహేణాన్యతోనయత.

తా. యజమానుఁడనైన నాయందుగల దురితములనఁగా నేనే యజమానుఁడ నను నహంకృతితో నంత ట బుద్ధిపూర్వకముగఁ జేసిన ద్రోహమును సాధుజనుల నిందించుట ... అబద్ధము పలుకుట

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యను పాపమును ఈమొదలగు పాపముల నన్నిటిని యో యుదకములారా! వాయుసఖుండగు నగ్నికికారణము లగుటచే జ్వాళనమొనర్చి ప్రవాహముచే వేఱొకచోటికిఁ గొంపోయి నన్ను పావనునిఁగఁ జేయుఁడు. పూర్వజన్మ కృతంపాపం వ్యాధిరూపేణ పీడ్యతె అనుప్రమాణముచే పాపమే వ్యాధిమలినమను నామములచే వాఁడఁబడును గాన దానిని పోగొట్టుసామర్థ్య ముదకములందే గలదు

ఆపో అద్యాన్వచారిషం రసేనస మగస్మహి,
పయస్వానగ్న ఆగహితమ్మాసం సృజవర్జస.

వ్యా. అద్యాస్మిన్దినే అవబృధార్థాః, ఆపః, అన్వచారిషం జలాని ప్రవిష్టోస్మి, ప్రవిశ్యర సేనజలసారేణ, సమగన్మహి, సంగతాస్మః, హేఅగ్నే, పయస్వాన్, జలేవర్తమాత్వేన ఉక్తః, త్వమాగహి, త్వమస్మి న్కర్మణ్యాగచ్ఛన్తం మాదృశం స్నాతం, మాంచ, వర్చసా, తేజసా సంసృజ యోజయ.

తా. ఈరోజున అవబృధము (కర్మాంతమందు చేయుస్నానము) దీనియందు ప్రవేశించి జలమును దుండు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సారముతో గలిసితిని అసారమగునో యజ్ఞే నీవచ్చుట నుందువు గాన శుభ్రతకొఱకు వచ్చిన నన్ను తేజోవంతు నిగఁ జేయుము.

సస్రుషీస్తద పసోదివానక్తంచ సస్రుషీః,
వరేణ్యక్రతూ రహమాదేవీ రవసేహువే.

వ్యా. సస్రుషీః, సరణశీలాః, అతఏవ, దివానక్తంచ సస్రుషీః, ప్రవహన్తః, ఆదేవీః, సమన్తాద్ద్యోతమానాః, తత్ప్రసిద్ధాః, అపసః, ఆపః, వరేణ్యక్రతుః, శ్రేష్ఠజపయజ్ఞః, అహం, అవసే, రక్షణార్థం, హువే ఆహ్వాయామి, ఆపోమాం రక్షన్త్వితి.

తా. ఎల్లపుడు ప్రవహించు నుదకములారా! అంతట ప్రకాశించుమీరు శ్రేష్ఠమగు జపయజ్ఞమును సలుపుచున్న నన్ను రక్షించుటకై నేనుమిమ్ముల పిలుచుచున్నాను.

అత్ర ప్రథమమాపోహీ త్రిభిః ప్రణవేన సహ ప్రతిపదం మార్జయిత్వా, సూర్యశ్చేత్యాదిభిరభిమన్త్రితంజలం త్రిసన్ధ్యంపిబేత్, సూక్తాదా ప్రణవంచోక్త్వా ఋగన్తే మార్జయేత ఇతి శౌనకోక్త్యా సూక్తే

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సచ, మార్జనం కుర్యాదితి.

తా. మొదటిపర్యాయము "ఆపోహి" అను మూఁడు ఋక్కులను తొమ్మిదిమార్లు ప్రతిపాదమునకు ప్రణవమునుచేర్చి మార్జనచేయవలయును. "సూర్యశ్చ" మొదలగు మంత్రములచే నభిమన్త్రితమగు జలమును మూఁడు సంధ్యలయందు ముమ్మాఱు పుచ్చుకొనఁదగును. ఈవిషయమున శౌనకుఁడు సూక్తాదియందు ప్రణవమును చెప్పి ఋగంతమున మార్జనము సలుపవలయునని చెప్పెను.

ననుప్రతిపదం ప్రణవసాహిత్యంకి మర్థమితిచే దుచ్యతే, శ్రుత్యాపాం సర్వాత్మకతాం ప్రథమం సంపాద్య విశేషతః వ్యాహృతి ప్రణవాత్మకత్వంచ ప్రతిపాదయిత్వా పదేపదేతద భిన్నత్వద్యోతనార్థంత దుచ్చారణ మితి వేదితవ్యమ్, యథా, ఆపోవా ఇదగ్ంసర్వ మిత్యారభ్యాపో భూర్భువస్స్వరాప ఓం, ఇత్యన్తేనేతి ఏతేనా పాంసర్వత్ర బ్రహ్మత్వం సూచితమితి ప్రకృతమను సరామః.

తా. అట్లయిన సూక్తాదియందే ప్రణవము గాని

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ప్రతిఋక్కునకు పాదమునకు చెప్పుట యసంగతమను ప్రశ్నకు సమాధాన మిచ్చుచున్నాఁడు. శ్రుతిచే నుదకము లంతటను వ్యాప్తమయినవి యని ముందు చెప్పి పిమ్మట వ్యాహృతి ప్రణవాత్మకత్వమును చెప్పి ప్రతిపదమందు తత్తదభిన్నమని చెప్పుటకై యట్లు చేర్చఁబడినదని తెలుపుటకని తాత్పర్యము. ఇదంత నుదకమయము. పిండీభావగుణమగు స్నేహముదకనిష్ఠమగుటచే నుత్పత్తికంతకు ప్రథమముదకమవసరము. గాన నదియే బ్రహ్మమనందగును. ఇకముం దావిచారణనువదలి ప్రస్తుతమవలంబింతము.

## అథ ప్రాశన మన్త్రార్థః.

అగ్నిశ్చేత్యస్య మన్త్రస్య యాజ్ఞవల్క్య ఋషిః, అగ్నిమామన్యుమన్యు పతయో హార్దేవతా ప్రకృతీ ఛందః, సాయంజలాభి మన్త్రణేవినియోగః, అగ్నిశ్చ మామన్యుశ్చ మన్యుపతయశ్చ మన్యుకృతేభ్యః, పాపేభ్యో రక్షన్తామ్ యదహ్నా పాపమకార్షమ్ మనసా వాచాహస్తాభ్యాం, పద్భ్యాముదరేణ శిశ్నా, అహ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

స్తదవ లుంపతు యత్కించ దురితంమయి, ఇదమ
హం మామమృతయోనౌ సత్యేజ్యోతిషిజుహోమి
స్వాహా.

వ్యా. యోయమగ్నిరస్తి యశ్చమన్యుః క్రోధాభిమానీ
దేవః, యేచమన్యుపతయః, క్రోధస్వామినః తన్ని
యామకాః దేవాస్సన్తితేసర్వేపి మన్యుకృతేభ్యః మ
దీయకోపనిష్పాదితేభ్యః, పాపేభ్యో రక్షన్తాం పాపినం
మాంతత్పాప వినాశేనపాలయన్తు, కించ, అతీతేనా
హ్నా చాస్మిన్నహని యత్పాపమకార్షమ్ కృతవాన
స్మి తేనసాధనేన మనఆదిభిః శిశ్నాంతైర వయవైః
తత్సర్వం పాపమహఃలుంపతు అహరభిమానీదేవో
వినాశయతు, పరహింసాది చిన్తనంమానసంపాపం
కృతవానస్మి అప్రియానృతాదిభాషణం వాచికం, అ
భిచారాది హోమాదికం హస్తకృతం, పాదేనగోబ్రా
హ్మణస్పర్శనాదికం పాదకృతం అగమ్యాగమనం
శిశ్నకృతం, అథవాకిమనేన పరిగణనేన యత్కించమపి
దురితంమయి సమ్పన్నమిదం, పాపజాతం సర్వకర్తారం

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మాంచలింగ శరీరరూపం అమృతయోనౌ మరణర
హితే జగత్కారణే, సత్యే, బాధరహితే, జ్యోతిషి
స్వయం ప్రకాశే వస్తుని జుహోమి, ప్రక్షిపామి, అహ
మనేనతత్సర్వం పాపజాతం భస్మీకరోమీత్యర్థః, తద
ర్థమిదమభి మన్త్రితం స్వాహా, స్వకీయవక్త్రాగ్నౌ సు
హుతమస్తు, అనేన సూర్యశ్చేత్యను వాకో వ్యాఖ్యా
తః, అగ్నిశబ్దస్థానే సూర్యశబ్దః, అహశ్శబ్దస్థానే రాత్రి
శబ్దః, సత్యశబ్దస్థానే సూర్యశబ్దః, సూర్యే, అనిష్పాదక
సూర్యోపాధికే, అన్యత్సమానం, అత్రాప్యహోరాత్ర
శబ్దాభ్యాం శివశక్త్యో రభేద ఏవ ప్రదర్శితః, కుత ఇ
త్యుక్తే తయోస్సన్ధి రేవ సన్ధ్యేతి ప్రదర్శితత్వాత్తద్విష
యక దురితస్య తన్నివర్త్యత్వా దేవతత్వార్థేనేతి
జ్ఞేయం.

తా. "అగ్నిశ్చ" యనుమంత్రమునకు ఋషియాజ్ఞ
వల్క్యుఁడు, అగ్ని మన్యువు మన్యుపతులుగలుగు పవతే
దేవత, ప్రకృతియే ఛందము సాయంకాల జలాభిమంత్ర
ణము వినియోగము అగ్నియు క్రోధము క్రోధాధిపతులు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

క్రోధమును నియమించు దేవతలు నాయొక్క మన్యుకర మగు పాపములను హరింతురుగాక. పాపాత్ముండ నైన నన్ను పాపనాశన మాచరించి పాలింతురు గాక. గడచిన రోజునను యీరోజునను మనస్సువల్ల నగు పరహింసాది విచారణమును అప్రియానృతాది భాషణరూపమగు వాచికమును. మరణహోమాదులగు హస్తకృతపాపములను గోబ్రాహ్మణస్పర్శాది పాదకృత పాపములను అగమ్యాగమనము మొదలగు శిశ్నకృతపాపములను! యింకనే పాపమయినను, సర్వకర్తనగు లింగశరీరరూపమగు నన్ను మరణరహితమగు జగత్కారణమందును బాధలేని స్వయంప్రకాశమగు జ్యోతియగు వస్తువందు హోమము చేయుచు నాపాపముల నన్నిటిని భస్మముచేయుచున్నానను భావనతో తనముఖాగ్నియందు హోమముచేయుచున్నానని నీటిని త్రాగవలయును. దీనిచే సూర్యశ్చమంత్రముగూడ వ్యాఖ్యానము చేయఁబడినది. ఆమంత్రమం "దగ్ని" యనుచో "సూర్య" అనియు "సత్య" అనుచో "సూర్య" అనియు చెప్పుచు "సూర్య" అనుదానికి నిష్క

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పట సూర్యోపాధికమగు తేజమను నర్థము చెప్పుచు హో మ మాచరించవలయును ఇచ్చటను శివశక్తిరూపములగు రాత్రింబవళ్లను మాటసూచింపఁబడియున్నది. వాని యొక్క సంధియే సంధ్యాశబ్దార్థము. గాన దురితనివర్తన ము కాలమును బట్టే జరుగును గాన యాకాలమునందే జరుగు గాకయని యర్థము.

## మాధ్యాహ్నిక మంత్రము.

ఆపఃపునన్త్విత్యస్య మన్త్రస్య, పూతర్షిః, ఆపో దేవతా, అష్టీఛన్దః, అపాంప్రాశనే వినియోగః. ఆపఃపునన్తు పృథివీం పృథివీపూతాపునాతుమాం, పునన్తు బ్రహ్మణస్పతిః, బ్రహ్మపూతాపునాతుమాం, యదుచ్ఛిష్టమభోజ్యం యద్వాదుశ్చరితంమమ సర్వంపునన్తు మామాపోసతాంచ ప్రతిగ్రహంస్వాహా.

వ్యా. యాఆపః సన్తితాః, ఆపః పృథివీం పునన్తు, ప్రక్షాళనేనశోధయన్తు, యాచపృథివీపూతా, శుద్ధాసతీ మామనుష్ఠాతారంపునాతు, శోధయన్తు, యథాచ బ్రహ్మణో వేదస్యపతిః తంపతిం పాలకం ఆచామేనా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పః పునన్తు ఆచార్యేణోపదిష్టం బ్రహ్మ వేదస్వరూపం స్వయంపూతస్సన్ మాంపునాతు, అన్యద్భుక్తావశిష్టం యదుచ్ఛిష్టమస్తి యచ్చాప్యభోజ్యం భోక్తుమయోగ్యం తాదృశం కదా చిన్మయా భుక్తమయోగ్యం. తాదృశం మయాభుక్తం యద్వా, దుశ్చరితమన్యదపి ప్రతిషిద్ధాచరణరూపంమమ కించిత్సం పన్నం తత్సర్వం పరిహృత్యేతి శేషః, తతోమమా పః పునన్తు, అథాసతాం శూద్రాదీనాం ప్రతిగ్రహంచ మయాకృతంచ తత్సర్వం పునన్తు తదర్థమభిమన్త్రిత ముదకంస్వాహా, మదీయవక్త్రాగ్నౌ జుహోమి, సుహుతమస్తు.

తా. ఉదకములు కడుగుటచేత భూమిని పవిత్రము జేయు గాక. ఆభూమితాను పవిత్రమై సదనుష్ఠానము జేయునన్ను పవిత్రుని జేయు గాక. వేదసృష్టిచేసిన బ్రహ్మనుగూడ నుదకములాచమనముచే పవిత్రముచేయునట్టి యుదకములు నన్ను పావనము సేయుగాక. ఆచార్యోపదిష్టమగు వేదము మమ్ముల బున్నీతుల గావించుగాక (వేదమాచార్యోపదిష్టముగా నుండినసే ఫలదాయక మని

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తాత్పర్యము.) భుజించఁగా మిగిలినదానిని భుజించినను భుజింపఁదగని వస్తువును తినినను. యింకనే దుష్కృతము నైనను వానినన్నిటిని నివారించినన్ను దకములు గా పాడుగాలిమని మంత్రార్థము.

ననుసాయం ప్రాతస్సదా సన్ధ్యామిత్యాదినా బహుస్మృతిష్వపి మాధ్యాహ్నికసన్ధ్యా ప్రాయశో నోక్తా, అత స్తదేవనాస్తి, తత్కిమర్థమితి యత్తన్న.

తా. ఓయి! సాయంప్రాతఃకాల సంధ్యలే స్మృతులందుఁ జెప్పఁబడుటచే మధ్యాహ్నికసంధ్య యవసరము లేదని నయాశంకగూడదు.

ప్రత్యుత వేదే ఉభావేపి కైశ్చిత్స్మృతికారై రను క్రమణికానుగుణం పరిష్కృతత్వా ద్వ్యవహారాచ్చ, అష్టకాది వన్మాధ్యాహ్నిక సన్ధ్యావన్దనమపి కార్యమేవ.

తా. నిజముగా వేదమందు లేకపోయినను కొంతమంది స్మృతికారులచే ననుక్రమణికలందను సరించి పరిష్కరించుటచేత నష్టకాశ్రాద్ధాదికములవలె నీమాధ్యాహ్నిక సంధ్యయు నాచరింపక తప్పదు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అత్రాప్యమృతయోనావితి మన్త్రార్థపర్యాలోచన యాచపర్యవశ్యతీతి నశఙ్కావకాశః, స్మృతేరనతి శంక్యత్వా దధ్యాహార్యోవాస్తు, అపాం సర్వాత్మక త్వాద్వాస్వరాడాప ఇత్యుక్తత్వాద్వా తేజసోనుక్తి రితిన చిన్త్యమ్.

తా. అందునన్నున్న "అమృతయోనా" అను మంత్రార్థము నాలోచించిన నామాధ్యాహ్నిక సంధ్యావిష యము తేలును గాన నీశ శంకింపఁగూడదు. స్మృతియం దున్నదాని నతిశంకింపందగదు గాన వేదాధ్యాహారమైన నాచరింపఁదగును. "అనంతా వైవేదాః" అనుటచే వేదముల కంతులేదు గనుక పాఠమందు ఖిలమయినదని చెప్పనగును. ఉదకములే సర్వాత్మకము లగుటచే "స్వరాడాపః" (స్వరాట్టి యుదకము) అనువాక్యముచే నట్లు చెప్పుటవలన తేజస్సు వేఱుగ చెప్ప నవసరము లేదు. (తేజః కారణము లుదకము లగును గాన.)

పాపపురుష విసర్జన మంత్రార్థః.

ఋతంచ సత్యంచేత్య స్యసూక్తస్య, అఘమర్షణ ఋ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

షిః, భావవృత్తో దేవతా, అనుష్టుప్ఛన్దః, పాపపురుషజల విసర్జనేవినియోగః, ఋతంచ సత్యంచా భీద్ధాత్తప సోధ్యజాయత, తతో రాత్ర్యజాయత, తతస్సముద్రోర్ణవః, సముద్రాదర్ణవాదధి సంవత్సరో ఽజాయత, అహోరాత్రాణి విదధద్విశ్వస్య మిషతో వశీ సూర్యాచన్ద్రమసౌ ధాతా యథాపూర్వమ కల్పయత్, దివంచ పృథివీం చాంతరిక్షమథోస్వః.

వ్యా. రాత్ర్యాదీనాం భావానాం సృష్ట్యాది ప్రతిపాదకత్వాత్తాదృగ్భూత ఏవార్థో దేవతా, ఋతమితి సత్యనామ, ఋతం మానసం యథార్థసంకల్పనం, సత్యం వాచికం యథార్థసంభాషణంచ కారాదన్యదపి శాస్త్రీయం ధర్మజ్ఞానం సముచ్చీయతే, తత్సర్వమభీద్ధాత్, అభితప్తాత్, బ్రహ్మణాస్సృష్ట్యర్థం పురాకృతాత్, తపసోఽధితపస ఉపర్యేవాజాయత, ఉదపద్యత, సతప స్తప్త్వా ఇదగ్ం సర్వమసృజతేతి శ్రుతేః, తప స్స్రష్టవ్య పర్యాలోచన లక్షణం, యస్యజ్ఞానమయం తప ఇతిశ్రుతేః, యద్వా, అభీద్ధాత్, అభితః ప్రకాశ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మానాత్, స్వప్రకాశాత్, పరమాత్మనో మాయా ధిష్ఠాన రూపోపాదాన భూతాత్, ఋతం సత్యం చాజాయత, తత స్తస్మాదేవేశ్వరా ద్రాత్రిరజాయత, ఏత దుపలక్షణమహ్నోపి, అహోరాత్రిశ్చార్ణవః, అర్ణసా, ఉదకేనయుక్త స్సముద్రశ్చాజాయత, సము ద్రశబ్దాత్సాధారణ ఇత్యభిమతార్థ ప్రకాశనాయార్ణ వేన విశిష్యతే, అర్ణవాత్, సముద్రాత్ సృష్టాత్, అధి, ఊర్ధ్వం, సంవత్సరః, ముహూర్తాః కాష్ఠాశ్చేతి, సచేశ్వరః, అహోరాత్రాణి, ఏతదుపరిస్థితాని సర్వా ణి భూతాని విదధత్, కుర్వన్, సృజన్, మిషతో నిమేషాదియుక్తస్య, విశ్వస్య, సర్వస్యప్రాణిజాతస్య తస్య, వశీ, స్వామీ, భూత్వావర్తతే, సతాదృశోధా తా పరమేశ్వరః, సూర్యాదిదేవాన్, పృథివ్యాదిలో కాంశ్చ యథాపూర్వ మతీతసృష్టౌయస్య యాదృశం రూపం తాదృశమనతిక్రమ్య కల్పయత్, సంకల్ప మాత్రేణసంపాదితవాన్, అయంభావః, సర్వంజ్ఞాన స్వరూపేణైవ వ్యజీనం సంతతిమృష్టీతి గీతావచ నాత్తేతా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దృశ్జ్ఞానేనైవ పాప్మన్యపోహ ఇతిజ్ఞేయం.

తా. రాత్ర్యాదిభావముల సృష్టించుటచే నవియే దేవతలు, ద్రవ్యసృష్టిభావమనియు నభావమనియు రెండు తెఱంగులు, అందు రాత్ర్యాదులు భావములు, ఋత మనఁగా మానసయథార్థసంకల్పము, సంకల్పముయథార్థ మని యయథార్థమని రెండువిధములు, సత్యం వాచికసంకల్పము. ఇదియు యథార్థమే కావలయును, చకారమువలన నిక ధర్మజ్ఞానాదికము లన్నియు గ్రహింపఁబడును. ఈ సమస్తము బ్రహ్మయొక్క తపస్సుకు పిమ్మటనే కలిగినవి. (ఎందువల్ల ననఁగా నాబ్రహ్మతప మాచరించి యీ జగత్తును సృజించెనని శ్రుతియుండుటచే) అదియేది యనఁగా నెట్లు సృష్టించెదనను నాలోచనయే తపము, లేక, అంతట ప్రకాశమానుఁడగు పరమాత్మనుండి మాయాధిష్ఠానముగుచు ఋతము సత్యము పుట్టెను. వానినుండియే రాత్రి కలిగెను. ఇది పగలుకుఁగూడ నుపలక్షణము. అహోరాత్రులనుండి యర్ణవమగు సముద్రము పుట్టెను. సాధారణవిశేషజ్ఞానము కొఱకెన్నవవి శేషణము

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గ్రహింపఁబడినది. పిమ్మట సంవత్సరము, కళ, కాష్ఠా మొదలగు కాల ముప్పతిల్లెను. పిమ్మట సర్వభూతజాతి ముత్పన్నమాయెను. అప్పుడు పీనికి వశ్యుఁడై పీనియందే యీశ్వరుండు నుండెను ఆసృష్టిని పూర్వసృష్టి నతిక్రమింపకుండఁ జేసెను. సమస్తము జ్ఞానముచేఁ దాఁట తగి యున్నది.

అను గీతావాక్యముచే జ్ఞానము ముఖ్యమైన పాపమును పోగొట్టు సాధనము.

ద్రుపదాది వముంచతు ద్రుపదాది వేన్ముముచనః స్విన్నస్స్నాత్వీ మలాదివ పూతంపవిత్రేణే వాజ్యం, ఆపశ్శుంధన్తు మేనసః.

వ్యా. అత్రద్రుపదశబ్దేన పాదబన్ధనముచ్యతే, యథాలోకేకశ్చిచ్చౌర్యాదికర్మణ్యాభియుక్తః, పదబన్ధనేన బద్ధస్సన్పశ్చాద్ధనదానాదినాముముచానోభవతి, యథా స్వేదాదినాసమాక్రాన్తశరీరః శారీరకాన్మలాత్, స్నాత్వీ స్నాతవాన్, తేనస్నానాదికర్మణా శారీరమలమపనయతి యథా వాపవిత్రేణపూతం ఘృతం హవన

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యోగ్యంభవతి, యూమేనసః, మహాపాతకాది దినా సమాక్రాన్తశరీరం, భోఆపస్సున్తన్తు పవిత్రీకుర్వన్తు, యుష్మాభిరహం పవిత్రీకృతః కర్మయోగ్యోభవామీ త్యర్థః.

తా. ద్రుపదమనఁగా కొయ్యసంకెల లోకమున దొంగతన మాచరించిన వాఁడెటులు సంకెలలు వేయఁ బడినవాఁడై పరిశుద్ధుఁడగునో యటులనే చమట మొదలగు దుర్వాసనలచే దూషితమగు శరీరముగల వాఁడా మలములను పోగొట్టుకొనునట్లు ఎట్లు పవిత్రమగు నేయి యేహోమమునకు యోగ్యమోయట్లుమహాపాతకములచే నాక్రమింపఁబడిన శరీరముగల నన్ను "ఓ యుదకములారా! ఆపాతకములనుండి విడిపింపుడు మీరట్లు చేసినచో నేను కర్మయోగ్యుఁడ నయ్యెదను.

త్రిసంధ్యమేవం పాప్మానం వ్యపోహ్యాచమ్య ప్రాణానాయమ్య, సంధ్యాద్వయే గాయత్ర్యాఽర్ఘ్యం కుర్యాత్, ఏవమాశ్వలాయనాది భిర్బహ్వృచ విషయే ఉక్తత్వాదాచారాచ్చేతి సఙ్క్షేపః.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తా. మూఁడుసంధ్యలందునిట్లు పాపపురుషదహన మొనర్చి పిమ్మట ప్రాణాయామ మాచరించి రెండుసంధ్యలయందు (ననఁగా ప్రాతస్సాయంసంధ్యలందును గాయత్రిచేతనే యర్ఘ్యమివ్వఁదగియున్నది. నాల్గవ ప్రాయశ్చిత్తార్ఘ్యముఁగూడ గాయత్రిచే నిచ్చుట వాడుక. ఆశ్వలాయనులునే నిదివఱకర్ఘ్య విచారణస్థలమం దుదహరించిన మంత్రములచే నైనఁ గావింపవచ్చును. ఇట్లాశ్వలాయనాదులు సెప్పుటవల్లను శిష్టాచారమువల్లను జరుగునది యని భావము.

## మాధ్యాహ్నికార్ఘ్యమన్త్రః.

హంసశ్శుచిషదిత్యస్య గౌతమోవామదేవ స్సూర్యోజగతీ, అర్ఘ్యదానే వినియోగః. హంసశ్శుచిషద్వసు రన్తరిక్షసద్ధోతా వేదిష దతిథిర్దురోణసత్, నృషద్వర సదృతసద్వ్యోమ సదబ్జాగోజాఋతజా అద్రిజాఋతమ్.

వ్యా. యఏషో న్తరాదిత్యే హిరణ్మయః పురుషోదృశ్యతే హిరణ్యశ్మశురిత్యాది శ్రుత్యుక్తమండలాభిమానీదే.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వోఽస్తి, యస్సర్వప్రాణిహృదిస్థితః పరమాత్మాయ
స్సమస్తనిరస్తోపాధికం పరబ్రహ్మ తత్సర్వమహమే
వేతిప్రతిపాద్యతే, హంసఇతి గత్యర్థః, సర్వత్రసర్వ
దా, గన్తా యోహంసో సావిత్ర్యాదిశ్రుత్యుక్తక్రమే
ణైకీకృత్యోపాస్యః, పరమాత్మమన్త్రప్రతిపాద్యః, ఆ
దిత్యః, సః, శుచౌ, దీప్తే; ద్యులోకే సీదతీతి శుచిష
త్, అథయదతః పరోదివోజ్యోతిర్దీప్య ఇత్యాది
శ్రుతేః, అనేన ద్యుస్థాన ఆదిత్యః ప్రతిపాదితః, సఏవ
మధ్యస్థానే వాయురిత్యాహ, వసుస్సర్వస్య వాసయి
తా, వాయుః, సచాన్తరిక్షసత్, అన్తరిక్షసఞ్చారీ, అథ
తస్యైవవ్యక్తిస్థానే వైదికాగ్నిరూపతామాహ, హో
తా, దేవానామాహ్వాతా, వేదనిష్పాదకః, వేదిషత్,
వేద్యాంగార్హపత్యాది రూపేణస్థితః, అతిథివత్సర్వ
దా పూజ్యోఽగ్నిః, దురోణసత్, దురోణఇతి గృహ
నామ, తత్రపాకాది సాధనత్వేనస్థితః, అనేనలౌకికా
గ్న్యాత్మకత్వముక్తం, నృషత్, నృషుమనుష్యేషు,
చైతన్యరూపేణ సీదతీతినృషత్, అనేన పరమాత్మ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రూపత్వముక్తం, పునరప్యాదిత్యాత్మతామాహ, వ రసత్, వరే, వరణీయే, మణ్డలే, సీదతీతి వరసత్, అదిత్యఃపరంవా, ఏతత్సద్మనాం యస్మిన్నేష ఆసన్నః, తపతీతిశ్రూయతే, ఋతింసత్యం బ్రహ్మయజ్ఞోవా, తత్రసీదతీతి, వ్యోమసత్, వాయుః, ఇదానీమాదిత్య త్రోచ్యతే, అబ్జాః, ఉదకేషుజాతాః, ఉదకమధ్యే ఖల్వాయంక్షీయతే, గోజాః, గోషురశ్మిషుజాతాః ఋ తజాః, ఋతంసత్యం, సర్వైర్దృశ్యత్వేనసత్యాజాతః, నహ్యసావింద్రాదివదపరోక్షోభవతి, యద్వోదకే వై ద్యుతరూపేణవాజాతః, ఏవంమహానుభావ ఆదిత్యః, ఋతం, సత్యం, సంబుద్ధ్యైవసర్వాధిష్ఠానం బ్రహ్మ తత్వంతద్రూపోప్య సావేవాదిత్యః, ఉక్తరూపత్వం హంసశ్శుచిషదిత్యేషవైహంసశ్శుచిషత్, ఇత్యాది నా బ్రహ్మణిసమామ్నాతం.

తా. సూర్యునిమధ్యను హిరణ్యవికారమగు నొ కానొక పురుషుఁడుగలఁడను శ్రుతిచేఁ జెప్పంబడిన సూ ర్యమండలాభిమానియగు దేవుండు. ఈతండె పాణివ్యాద

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యములయందు చేరి దహరోపాసకులచే నుపాసింపఁబడు చుండును. సూర్యుండు మిశ్రబిందువనియాగమములఁ వాఁడఁబడుచున్నది. ఊర్ధ్వజ్వాలగలిగిన యగ్నినుండి ధ యీామండలమునకు వేడిమియు. జలజుండగు చంద్రు నుండి యీతని చల్లదనంబును తగిలికలిసి మిశ్రరూపుఁ డై అర్యక్కిరణములు గలవాఁడై తనకిరణములచేఁ జం ద్రునివెలుఁగఁ జేయుచున్నాఁడు. జనులకు మిశ్రస్థా నము హృదయము, సంశయస్థానము గనుక మధ్యాహ్న ముగూడ బ్రహ్మాండమునకు హృదయము వంటిది. అట్టి కాలమందు పాసనయుచితము. యూవనమువంటిది. అతి తీక్ష్ణమయినకాలము. ఈయర్థమునే యీమంత్రముచేఁ జెప్పుచున్నాఁడు. హంసయనఁగా గమనమర్థముగాన నం తట గమనించువాఁ డీతండెగాన నీతండె శుచియగు ద్యు లోకమందుఁ బ్రకాశించుచుండును. వసువగుచు నంత రిక్షమందు వాయురూపుండయి యుండును. హోతయగు చు భూమియందు వైదికాగ్నిరూపమున వేదనిష్ఠుండగును. అతిథియై గృహములందు పాకాగ్నిరూపమున నుండువాఁ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

డు మనుష్యులయందు చైతన్యరూపమగు జాఠరాగ్నిగ నుండును. వరేణ్యుఁడగు సూర్యమండలస్థుండగు నీతండే ఋతమందును, ఆకాశమందును నుండువాఁడై ఉదకజాతములను రశ్ములందు గలుగువానిని ఋతజులను సత్యమునగును, ఇంద్రాదులవలె నప్రత్యక్షుఁడు గాడనుట లేక యుదకజము లనఁగా మెఱుపు మొదలగు రూపములచే నంతట వ్యాప్తమై బ్రహ్మమువలె ప్రత్యక్షముగా నిండియుండు దృశ్యదేవతయని యర్థము.

ఆకృష్ణేనేత్యస్య, ఆంగిరసోహిరణ్యస్తూపస్సవితాత్రిష్టుప్. ఆకృష్ణేనరజసావర్తమానోనివేశయన్నమృతం మర్త్యంచ హిరణ్యయేనసవితారథేనాదేవోయాతి భువనానిపశ్యన్.

వ్యా. సవితాసూర్యః కృష్ణేనరజసా, కృష్ణవర్ణేన, కృష్ణం, కృష్యతేస్నిర్కికషోవర్ణ ఇతియాస్కః, లోకారజాంస్యుచ్యన్త ఇతిచ, అన్తరిక్షలోకోహి సూర్యాగమనాత్పూర్వాకృష్ణవర్ణోభవతి, తేనాన్తరిక్షమార్గేణ వర్తమానః పునఃపున రాగచ్ఛన్నమృతం దేవం మర్త్యం. మను

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వ్యంచ నివేశయన్, స్వస్థానేఽవస్థాపయన్, యద్వాఽమృతం మరణరహితం ప్రాణం, మరణసహితం శరీరంచ, నివేశయన్, తథాచారణ్యకే, అమర్త్యోమర్త్యేనాసయోనిరితి, ఏతస్య మన్త్రభాగస్య వ్యాఖ్యానరూపేణ బ్రాహ్మణే యథోక్తార్థోవగమ్యతే, మర్త్యానిహేయానిశరీరాణి, అమృతైషా దేవతేతి, యథోక్తగుణోపేతః, సవితా, దేవో, భువనాని, సర్వాన్, లోకాన్, పశ్యన్, అవేక్షమాణః, ప్రకాశయన్నిత్యర్థః, హిరణ్యయేన సువర్ణనిర్మితే న రథేన, ఆయాత్యస్మత్సమీప మాగచ్ఛతీతి.

తా. సూర్యుఁడు కృష్ణవర్ణమగు నికషోపలమందు ప్రకాశించుచుండును. ఆకాశము సూర్యాగమనమునకు పూర్వము నల్లనై యుండును. లోకములు రజోగుణ విశిష్టములని యాస్కాదులు చెప్పియుండుటచే నాకాశమే ఒరపిడి రాయివంటిది దానియందు సువర్ణమువలె ప్రకాశించుచుండువాఁడు సూర్యుండు దేవతలను మనుష్యులను ప్రవేశించియుండు ననిగాని మృతమగు శరీరమున మృత

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మగు ప్రాణమును ప్రవేశించియుండు ననిగాని చెప్పనగు ను. ఇట్టి గుణములుగల సూర్యుండు సర్వలోకములను జూచుచు బంగారు తేరెక్కి సంచరించుచు మనసమీప ముం జేరును.

కాలాతీత ప్రాయశ్చిత్తార్ఘ్యమన్త్రాః యదజ్జసవితా త్రిష్టుప్ ॥ కాలాతీతార్ఘ్య ప్రదానంకరిష్యే।

యదజ్జ కచ్ఛవృత్రహన్ను దగాదభి సూర్యసర్వం తదింద్ర తేవసే।

ప్రాతర్దే వీమత్యాక్షర బ్రహ్మత్రిష్టుప్। మధ్యాహ్న।

ప్రాతర్దే వీమదితిం జోహవీమిమాధ్యందిన ఉదితా సూర్య సర్వతా తేళ। త్రోకాయతన యాయశీలమోః।

ఉద్దేదభిస్సవితా త్రిష్టుప్। సాయం॥

ఉద్దేదభీ శ్రితామఘం వృషభన్నర్యాపసం। హస్తా శమేవసూర్య॥

ధ్యానప్రకారమాహ, ఏవమర్ఘ్యప్రదానానం తరం

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గాయత్రీం ధ్యాయేదిత్యా హాశ్వలాయనః, ఆచామే దుపవిశ్యాథ ప్రాణాయామత్రయంచ రేత్, ధ్యాత్వా దేవీం కుమారీంచ తత్తత్కాలాను రూపిణీం, జపే త్ప్రణవ పూర్వాభిర్వ్యాహృతీ భిస్సహైవతు, ఇస్మృ భిర్బ్రహ్మ ప్రభృతిభిః గాయత్రీం బ్రహ్మరూపిణీ మితి తత్తత్కాలాను రూపం గృహ్య పరిశిష్ట ఉక్తం॥

తా. ధ్యానించువిధిని చెప్పుచున్నాఁడు. ఇట్లర్ఘ్య ప్రదానమిచ్చి గాయత్రినిధ్యానింపవలయు నని యాశ్వ లాయనుఁడనెను అర్ఘ్యానంతరము గూర్చుండి యాచ మించి మూఁడు ప్రాణాయామములను జేసి యాయా కాల ములకుఁ దగినదేవిని ధ్యానించునప్పుడు ప్రణవవ్యాహృ తులం జేర్చి భూరాదిత్రయమును జేర్చి జపింపవలయును. ఈ విషయము గృహ్య పరిశిష్టమునఁ జెప్పఁబడియున్నది.

ప్రాతర్బాలాం బాలాదిత్య మండలమధ్యస్థాం రక్త వర్ణాం రక్తాంబరాను లేపన స్రగాభరణాం చతుర్వ క్త్రాం దండకమండల్వక్ష సూత్రాభయాంక చతుర్భు జాం, హంసాసనారూఢాం బ్రహ్మదైవత్యాం ఋగ్వే

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దము దాహరన్తీం భూర్లోకాధిష్ఠాత్రీం గాయత్రీం నామ దేవతాంధ్యాయేత్.

తా. ఉదయమందున బాలారూపమై బాలాదిత్యు నం దుండునట్టి యెఱ్ఱనగునట్టి యఱ్ఱనివస్త్ర మాల్యాదుల ధరించి నాలుగుముఖములు గల్గి దండకమండలము అక్షసూత్రాభయములను నాల్గుభుజముల ధరించినట్టి హంసనెక్కినట్టి బ్రహ్మదేవత గాఁగల ఋగ్వేదముం జెప్పు భూర్లోకాధిష్ఠాతయైనఁ గాయత్రి నుపాసింపఁదగును.

అథమధ్యందినేతాం యువతీం యదాత్యమణ్డల మధ్యస్థాం శ్వేతవర్ణాం శ్వేతాంబరాను లేపనస్రగా భరణాంపఞ్చవక్త్రాం ప్రతివక్త్రత్రినేత్రాం పఞ్చశేఖరాం త్రిశూలఖడ్గ ఖట్వాంగడమరుమృగాంక చతుర్భుజాం వృషభాస నారూఢాం రుద్రదైవత్యాం యజుర్వేద ముదాహరన్తీం భువర్లోకాధిష్ఠాత్రీం సావిత్రీం నామ దేవతాం ధ్యాయేత్.

తా. పిమ్మట మధ్యాహ్నమందు యౌవనవతియును, అట్టి యాదిత్యునం దుండునదియును, తెల్లనె తెల్లని

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వస్త్రాభరణాదుల ధరించినదియును, ఐదుముఖములు గల దియును, ప్రతిముఖమందు మూఁడేసి నేత్రములుండునది యును, ఐదు శిరోభూషణములు గలదియును, త్రిశూలము ఖడ్గము మంచపుకోడు, డమరుకము, మృగములను ధరిం చినదియు, నాల్గుబాహువులు గలదియు, వృషభము నె క్కినదియు, రుద్రుఁడు దేవతఁగాఁగలదియు, యజుర్వేద ముం జెప్పునదియు, భువర్లోకాధిష్ఠాత్రియునగు సావిత్రిని గొల్చుచుండవలయును.

అథసాయం వృద్ధాంవృద్ధాదిత్య మణ్డలమధ్యస్థాం శ్యా మవర్ణాం శ్యామాంబరాను లేపనస్రగా భరణామేక వక్త్రాంశంఖచక్రగదా పద్మాంక చతుర్భుజాంగరుఁడా సనారూఢాంవిష్ణుదైవత్యాం సామవేదముదాహరన్తీం స్వర్లోకాధిష్ఠాత్రీం సరస్వతీం నామదేవతాం ధ్యా యేత్.

తా. సాయంకాలమందు వృద్ధురాలయినట్టియు వృద్ధమండలమం దుండునట్టియు నల్లనివర్ణము గలిగినల్లని వస్త్రాదులం ధరించునట్టియు ఒకే ముఖము గలిగినట్టియు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శంఖచక్రగదాపద్మంబులను నాల్గుచేతులందు ధరించునట్టి యు గరుడాసనమునెక్కి విష్ణువధిష్ఠాన దేవతగాఁ గలిగినట్టి యు సామవేదమును చెప్పునట్టి స్వర్గలోకాధిష్ఠాతయైన సరస్వతిని సేవించనగును.

అథవాత్రిసన్ధ్యమేక రూపమేవ ధ్యేయన్త్వరూపం జ్ఞాతవ్యం, తదపితత్త్రివో క్తం, యాసన్ధ్యోక్తా సైవమన్త్రదైవతాఖ్యలూపాస్యతే, తాంసర్వదైక రూపాంధ్యాయే దనుసన్ధ్యమన్యోభిన్న రూపాంవా.

తా. లేక మూఁడు సంధ్యలందునొకేరూపముగా ధ్యానింపనగును ఆవిషయమునాపరిశిష్టకారుండే వచించి యున్నాఁడు. సంధ్యయన మంత్రదేవతగాన నామె మూఁడు సంధ్యలం దొకేరూపమైయుండును. అట్టి దానినిగానే సేవింపఁదగును

యదైకరూపాం ఋగ్యజుస్సామత్రిపాదాం త్రిర్యగూర్ధ్వాధరదృక్షట్కుక్షిం పఞ్చశిర సమగ్నిముఖీం విష్ణుహృదయాం బ్రహ్మశిరసం రుద్రశిఖాం దండకమండల్వక్షసూత్రాభయాంక చతుర్భుజాం శుభ్రవర్ణాం శు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

భ్రాంబరాను లేపనస్రగా భరణాం శరచ్చంద్ర సహ స్రప్రభాం సర్వదేవమయా మిమాం దేవీం గాయత్రీ మేకామేవత్రి సన్ధ్యంధ్యాయే దితి.

తా. ఏకరూపముగా సేవించునపుడు ఋగ్యజు స్సామములను మూఁడు పాదములును అడ్డముగాను పై గాను క్రిందుకాను నాలుచూపులుగల యూఁలుకుత్సులు నై దుశిరములును అగ్నియే ముఖమును విష్ణుపుహృదయ మును బ్రహ్మశిరస్సును రుద్రుఁడుశిఖయును దండకమండ ల్వక్షసూత్రాభయములను ధరించిన నాల్గుభుజములును తెల్లని కాంతి వస్త్రాభరణాదులును గలిగి శరచ్చంద్రుని కాంతిగలిగి సర్వదేవమయమగు నీగాయత్రి నొక్క-దాని నే ముమ్మాఱును గొల్వవలయునని పరిశిష్టకారుఁడు వక్కాణించెను.

ధ్యానానంతర మావాహనం కర్తవ్యమిత్యాహవాం సః, ఆవాహయేత్తు గాయత్రీం సర్వపాపప్రణాశినీం ఆయాతువరదాదేవీ, ఇతి. శౌనకస్తు, త్రిసంధ్యా, మార్జనాదూర్ధ్వం గాయత్ర్యావాహనం భవేదితి,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శిష్టాచారతో వ్యవస్థాకల్పనీయా.

తా. ధ్యానించిన పిదపనావాహన చేయవలయు నని వ్యాసుండును శౌనకుండును చెప్పియున్నారు. సర్వ పాపహరమగు గాయత్రిని ముమ్మారుసంధ్యలందు "వర ములిచ్చు దేవతయగు గాయత్రివచ్చు గాత"అని యావాహ నము సలుపనగును ఇది శిష్టాచారమునుబట్టి చేయనగును.

ఓమిత్యేకాక్షరం బ్రహ్మ, అగ్నిర్దేవతా, బ్రహ్మ ఇ త్యార్షం, గాయత్రంఛన్దం, పరమాత్మం సరూపం, సాయుజ్యం వినియోగం.

వ్యా. ఏవం ఛందర్ష్యాది పూర్వకమేవ వ్యాహృత్యాదిభిః ప్రాణాయామత్రయం కుర్యాదితి తాత్పర్యం, అనం తరం పూర్వోక్తప్రకారేణ ధ్యాత్వావాహయేత్.

తా. "ఓ" ఇదియొకె యక్షరము బ్రహ్మస్వరూప ము దీనికగ్ని దేవత; బ్రహ్మయే ఋషి గాయత్రియే ఛం దస్సు అది పరమాత్మతో సమానమగు రూపముగలది. శక్త్యాత్మకము. యీమంత్ర వినియోగము సాయుజ్యము కొఱకు ఇట్టి ఛందర్ష్యాదులు చెప్పి వ్యాహృతులు పూ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ర్వమం దుండునట్లు మూఁడు ప్రాణాయామముల నాచ
రింపవలయును. పిమ్మట వెనుకటి ప్రకారము ధ్యానించి
యావాహనసలుపునది.

ఆయాతు వరదాదేవీ హ్యక్షరం బ్రహ్మసమ్మితం, గా
యత్రీం ఛందసాంమా తేదం బ్రహ్మజుషస్వ మే.

వ్యా. వరదా అస్మదభీష్ట ప్రదా దేవీగాయత్రీఛందోఽభి
మాని నీదేవతా, అక్షరం వినాశరహితం సమ్యగ్వే
దాన్తప్రమాణేన నిశ్చితం బ్రహ్మతత్కారణం పరతత్వ
ముద్దిశ్యాయాత్వాగచ్ఛతు, అస్మాకం బ్రహ్మతత్వం
బోధయతు, మామాగచ్ఛత్విత్యర్థః, అయమేవార్థ
ఉత్తరార్థే నార్థక్రియతే. ఛందసాం, గాయత్రీత్రిష్టు
ప్తాదీనాం, మాతా, జననీ, దేవతా, గాయత్రీశబ్దాభి
ధేయా, నోఽస్మాకం, ఇదం బ్రహ్మవేదాన్త ప్రతిపాద్యం
జుషస్వ, బోధయతు ఉపదిశత్విత్యర్థః.

తా. అభీష్టములనిచ్చు గాయత్రియను ఛందస్సు
న కభిమానదేవత నాశరహితమును వేదాన్తప్రమాణా
దులచే నిశ్చయించఁబడిన పరబ్రహ్మను తత్కారణ తత్వ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ము నుపదేశించు గాత. ఈయర్థమునే యుత్తరార్థముచే స్పష్టపఱచి నాఁడు.

యదహ్నాత్కురుతే పాపం తదహ్నాత్ప్రతిముచ్యతే,
యద్రాత్ర్యాత్కురుతే పాపం తద్రాత్ర్యాత్ప్రతి
ముచ్యతే, సర్వవర్ణేమహాదేవి సంధ్యావిద్యే సరస్వతి.

వ్యా. ఉపదేశస్య ఫలమాహ, యదహ్నాత్, అహ్నాత్కార
ణాద్యత్పాపంకురుతే తత్, అహ్నాదేవ ప్రతిముచ్య
తే, ఏవముత్తర త్రాప్యయమితిసర్వత్రావ్యాహార్యః,
సర్వవర్ణే సర్వవర్ణాత్మికే, శబ్దస్యశక్తిరూపత్వాతిభా
వః, మహాదేవి మహత్, దేవస్య, దీప్త్యాత్మకే, సం
సంధ్యోపాసనమైవ, వేద్యే, సరస్వతి. హేగాయత్రి.

తా. ఉపదేశఫలమును వక్కాణించుచున్నాఁడు· పవలుపాధిగా గలిగిచేసిన పాపము పగలే నశించును· వ్యావహారికమనుట రాత్రికృతమగు పాపము రాత్రియే నశించుననుట యీరెండును శిశ్నోదరకృతములు.

ఓజోఽసి, సహోఽసి, బలమసి, భ్రాజోఽసి దేవానాం ధా
మనామాసి విశ్వమసి విశ్వాయురభిభూరోం గాయ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

త్రీమావాహయామి, సావిత్రీమావాహయామి, సర
స్వతీమావాహయామి, ఛన్దర్షీనావాహయామి, శ్రి
యమావాహయామి, బలమావాహయామి, గాయ
త్ర్యా, గాయత్రీ, ఛందః, విశ్వామిత్రర్షిః, సవితా
దేవతా, అగ్నిర్ముఖం, బ్రహ్మాశిరః, విష్ణుర్హృదయం,
రుద్రశ్శిఖా ప్రాణాపానవ్యానోదానసమానా సప్రాణా
శ్వేతవర్ణా సాంఖ్యానసగోత్రా గాయత్రీ చతుర్వింశ
త్యక్షరా త్రిపదా గాయత్రీ పఞ్చశీర్షోపనయనే విని
యోగః,

వ్యా. ఓజోసి తేజోసి బలహేతు భూతాష్టధాతురూపాసి
అష్టధాతవస్తుత్వ గసృగ్మాంసమేదోస్థి మజ్జాసుక్ల
ప్రాణాః, త్వమితి శేషః, సహోసి శత్రూణామభిభవ శ
క్తిరసి, శత్రవస్తుకామాదయః, బలమసి శరీరగతవ్య
వహారగతసామర్థ్యరూపాసి, భ్రాజోసి దీప్తిరూపాసి
దేవానాం ధామనామాసి, తద్దేవతవనామేత్యర్థః,
కించ, విశ్వమసి ప్రపంచం త్వమేవాసి విశ్వాయుః,
తత్స్థితహేతురసి సర్వమసి సర్వాత్మికాసి సర్వాయు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రసి విశేషణాద్వా ఋష్య బ్రహ్మాభిన్నాసీతి భావః, అభిభూః, అభిభావతీత్యభిభూః, సంహార్త్ర్యసి ఓం ఏతాదృశసత్తాంగీకారే గాయత్రీం సావిత్రీం సరస్వతీం, ఛందర్షీణ్ శ్రియం శోభాం బ్రహ్మతేజసమిత్యావత్.

తా. సర్వము శక్తియే గనుక యావనావాహనఁ జేయునపుడు వాని నన్నిటిని ప్రార్థించుచున్నాఁడు. ఓజ మనఁగా నష్టధాతురూపబలమును నీవేయయి యుంటివి. ప్రపంచము ప్రపంచస్థితిహేతువును నీవె గాయత్రీ సావిత్రీ సరస్వతీరూపమగు నిన్నావహించుచున్నాను. శ్రియమును బలమునిమ్ము. దీనికి గాయత్రిఛందము విశ్వామిత్రుండు ఋషి సూర్యుండు దేవత అగ్నిముఖము బ్రహ్మశిరము, విష్ణువుహృదయము, రుద్రుఁడుశిఖ, ప్రాణాపానాదిరూపియు తెల్లనిదియు సాంఖ్యాయన సగోత్రియు, ఇరువదినాల్గక్కరములు గలదియు మూఁడుపాదములు గలదియు నగును. పంచశిఖలతో గురుసమీపగమనము చేయుటే వినియోగము.

బ్రహ్మాణం వినియోగంచ ఛందఆర్షంచ దైవతం అ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

జ్ఞాత్వా పంచమో మంత్రీనసతత్ఫలమశ్నుతే, ఇతియాజ్ఞవల్క్యోక్తేః.

తా. బ్రహ్మను వినియోగమును, ఛందస్సును, ఋషి, దైవతము నీమైదును తెలియని మంత్రవేత్తదాని ఫలముం జెందడు. అని యాజ్ఞవల్క్యుఁడు చెప్పెను.

తేషామావాహన మితిజ్ఞేయం, ఆవాహనం నామాంతరస్యనిజసంవిదాత్మనో మాతురక్షరాత్మనాబహిర్ధ్యేయసం విదిసమర్పణం తదావాహనం. సమరసత్వమితి చతుశ్శతీశాస్త్రోక్తం, తథాచశ్రుతిః, చిన్మయస్యాద్వితీయస్య నిష్కలస్యాశరీరిణః, ఉపాసకానాం కార్యార్థం బ్రహ్మణా రూపకల్పనా. ఇతి. ఏవం ధ్యాత్వాఽవాహ్యాక రాంగన్యాస పూర్వకం గాయత్రీం జపేత్,

తా. ఆదేవతాములనావాహన మాచరించుట యని యర్థము. ఆవాహన మనఁగా లోపలనుండు తన జ్ఞానరూపుఁడగు నాత్మయస్సు మాతృకాక్షరరూపముచే వెలుపలనుండు ధ్యేయమునందు సమర్పించుట, సమ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సభావమని చతుశ్శతీకారుఁడు (అంతరాత్మకు మేయము నకు సమరసభావమనుట) అట్లు శ్రుతి "చిన్మయుఁడు నద్వితీయుఁడును నిష్కలుండగున శరీరియనగు నాత్మకు పాసకోపయోగముకై రూపమును గల్పించుటావాహన మనంబడును) దీనివలన బాలాదుర్గాది విగ్రహములు వాని క్రియలను బట్టి రూపముల నాయుధముల నేర్పఱచి నట్లుదోచును) ఇట్లు ధ్యానించి కరన్యాసముం జేసి గాయత్రిని జపింపవలయును.

షడంగముద్రాదీ న్న్యస్య యోని ముద్రాం ప్రదర్శయేత్, గాయత్రీం సంస్మరేద్ధీమా_ హృదివాసూర్య మండలే, ఇతి శౌనకోక్తేః.

తా. పిమ్మట ముద్రాదులనుంచి యోనిముద్రను గూడఁ జూపనగును, గాయత్రి హృదయమందుగాని సూర్యమండలమున గాని యున్నట్లు స్మరింపనగును. అని శౌనకుఁడు చెప్పెను. దీనివలన బ్రహ్మాండమునకు సూర్యుండును పిండాండమునకు హృదయమును పాసనీయ స్థానములని తోచుచు సామ్యమూహింపఁబడుచున్నది.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నను గాయత్రీజపస్య కరాంగన్యాసపూర్వకత్వేంకి మర్థమితిచే దుచ్యతే.

తా. ఓయి గాయత్రీ మంత్రజపమునకు కరాంగన్యాసపూర్వకత్వమువలన ఫలమేమియని యడుగఁగా చెప్పుచున్నాఁడు.

కర్మేంద్రియమధ్యేకరయో ర్ముఖ్యత్వా త్తత్ర విశుద్ధవిద్యాత త్త్వభావనాద్వారా యోగ్యతా సంపాదనార్థ మితిజ్ఞేయం.

తా. కర్మేంద్రియములగు వాక్పాణిపాదపాయూపస్థలలో చేతులతి ముఖ్యములగుటచేతను క్రియాప్రాధాన్యము లగుటచేతను జపక్రియకు పూర్వము కరశుద్ధి యత్యంతావశ్యకమను నాశయముచే నది యాచరింపఁదగినదని యభిప్రాయము.

తథాచ, ఆత్మతత్వగతయో శ్శుద్ధోరత్ర కర్మకరణాత్మనోర్ద్వయో శ్శుద్ధత్వలయభావనామయ శుద్ధిరాత్మకరయోః పరామతేతియోగినీ హృదయ ఉక్తత్వాత్ కర్మేంద్రియాణాం పాణ్యోః కరయోః అను

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ద్ధత్వాంతర్గతర శుద్ధయోః శుద్ధత్వాలయభావనాపరా శుద్ధిరితిమతా.

తా. అట్లుండ నాత్మకరములం బొందిన శుద్ధులు కర్మకరణరూపమగు కరాత్మల శుద్ధిచేగాని కలుగదని యోగిసీహృదయమందు చెప్పుటచే కర్మేంద్రియములలో శ్రేష్ఠమగు కరశుద్ధిభావనముఖ్యమని తోచుచున్నది.

కించ. అఙ్గుష్ఠః పురుషశ్చైవ హ్యంగుళ్యః ప్రకృతి స్త్రియః, తయోస్తుసంగమేచైవ వస్త్రమాచ్ఛాద యేద్ద్విజ ఇత్యుక్తత్వాద్వ స్త్రాచ్ఛాదన పూర్వక మేవకరన్యాసః కర్తవ్యః.

తా. ఇంతియేకాక బొటనవ్రేలు పురుషుం డని యుఁ దక్కినవ్రేళ్లు స్త్రీ లనియు వాని కలయికయందు స్త్రీ పురుషసంగమ మందువలె వస్త్రాచ్ఛాదన పూర్వక ముగనే కరన్యాస మాచరింపనగును.

అఙ్గన్యాసస్తు, అంగన్యాసోనామ హృదయాదిషుగా యత్ర్యా బ్రహ్మాధ్యాత్మకత్వే నానుసన్ధానమేవేతి జ్ఞే యం. అత్రాఙ్గన్యాసేనమ ఇత్యాది పల్లవానాం నిర్వి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఘ్నేనకర్మ సిద్ధ్యర్థం ప్రయోగ ఇతిజ్ఞేయం.

తా. ఇఁక నంగన్యాసముం జెప్పుచున్నాఁడు. అంగన్యాస మనఁగా హృదయాదులందు గాయత్రిని బ్రహ్మాదిస్వరూపముగా భావనఁజేయుట. ఈ యంగన్యాసమున నిర్విఘ్నముగా జపాదికర్మ జరుగుటకై "నమః" అను పదమును పల్లవముగా చెప్పఁనగును.

తదుక్తం పరాశరసంహితాయాం నమోన్తః ప్రణవాన్తశ్చశాన్తి పుష్టివివర్ధనః స్వాహాన్త శ్శుద్ధిదోఽభీష్టవశ్యాకర్షణమోహనే, పుష్ట్యాదిసాధ్యకో వౌషట్ పల్లవేనయుతో మనుః, హుంకారపల్లవోపేతః విద్వేషేమారణేపిచ ఫడుచ్చాటే వషడ్వశ్య ఇత్యాదివోక్తత్వాత్. ఏవంచ యత్త్వత్రకల్పే క్తమక్షరాణాంఛందర్షి దేవతాకథనం యచ్చాక్షరన్యాసకథనం సుముఖమిత్యాదిచతుర్వింశతి ముద్రాకథనం కామ్యజపవిషయమితి బోధ్యం.

తా. ఆపల్లవము విషయమై పరాశరసంహితయందుఁ "నమః" "ఓం" అనుపల్లవుల నుంచిన శాన్తి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పుష్టులనిచ్చును. స్వాహా, అనునది శుధ్యభీష్టవశ్యాకర్షణ మోహాములనిచ్చును. వౌషట్. అనుపల్లవి పుష్ట్యాదుల నిచ్చును. హుంకారము ద్వేషమారణకర్మలం దూప యోగకరము, ఫట్. ఉచ్చాటనమందును వషట్. వశ్య మందును అని చెప్పఁబడియున్నది. ఇందువలన కల్పో క్తంబులగు ఛందర్షి దేవతాకథనము, అక్షరన్యాసము, సు ముఖాది చతుర్వింశతిముద్రలు కామ్యజపవిషయముగాని నిత్యవిషయముకాదు. ఎప్పుడు నైమిత్తికమగు కామ్య మందు కర్మబాహుళ్యముండును. నిత్యమునం దదియుం డదు. నిత్యమునిష్కామ్యము దానివలన నదృష్టము పుట్టి యున్న తపదవిం జెంద జేయుచుండును. కావున మన వారలు నిష్కామ్యమగు నిత్యకర్మలను బహుళముగ నిర్మించి యుండిరి.

కరన్యాసప్రకారస్తు, తత్సవితుః, బ్రహ్మాత్మనేఙ్గుష్ఠాభ్యాంనమః, వరేణ్యం, విష్ణ్వాత్మనే తర్జనీభ్యాంనమః, భర్గోదేవస్య రుద్రాత్మనే మధ్యమాభ్యాంనమః, ధీమహి సత్యాత్మనే ఽనామికాభ్యాంనమః, ధియోయో

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నః జ్ఞానాత్మనే కనిష్ఠికాభ్యాంనమః, ప్రచోదయాత్స ర్వాత్మనే కరతలకర పృష్ఠాభ్యాంనమః, ఏవమేవ హృదయాయనమః, శిరసేస్వాహా, శిఖాయైవషట్, కవచాయహుం, నేత్రత్రయాయవౌషట్, అస్త్రాయ ఫట్, భూర్భువస్స్వరోమితి దిగ్బంధః.

తా. తత్సవితుః, దీనిచే బ్రహ్మాత్మకమగు నంగుష్ఠ మందు న్యాసము. వరేణ్యం. దీనిచే విష్ణ్వాత్మకమగు తర్జనీన్యాసము. (సృష్టికర్త) (విష్ణువుపాలకుడు) భర్గోదే వస్య. దీనిచే రుద్రాత్మకమగు మధ్యమమందున్యాసము: (ఇతడు సంహారకుఁడు) ధియోయోనః. జ్ఞానాత్మకమగు ననామికయం దున్యసించునది. (ఈశ్వరుండు) ప్రచోద యాత్. కనిష్ఠికాన్యాసము. (సదాశివుండు) ఇట్లే హృద యాదులందు స్వాహాదులనుచేర్చి న్యసించవలయును. పిమ్మట దిగ్బంధనమంత్రమగు భూర్భువస్స్వరోం అని దిగ్బంధన మాచరింపవలయును.

## యోని ముద్రాలక్షణమ్.

మిథఃకనిష్ఠికేబధ్వా తర్జనీభ్యామనామికే, అనామికో

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ర్ధ్వాగ్శ్లిష్ట దీర్ఘమధ్యమయోరథః, అంగుష్ఠాగ్రద్వయంన్యస్యేత్ యోనిముద్రేయమీరితేతి. కల్పోక్తలక్షణేనైవ ధ్యాత్వాఽభ్యర్చ్య తతోజపేదితి శౌనకోక్తేః.

తా. రెండుకనిష్ఠికలను కలిపి, పిదపతర్జనీలచేత నామికలం గలుపవలయును, అనామికకు పైగా కలసిన పొడవగు మధ్యమాంగుళములకుం గ్రిందుగ నంగుష్ఠాగ్రముల రెంటినిడవలయును. ఇది యోనిముద్ర ఇట్లు ధ్యానించిపూజించి పిదపజపించునది యనిశౌనకుండు చెప్పెను.

కల్పోక్తధ్యానమ్.

ముక్తావిద్రుమహేమనీలధవళచ్ఛాయైర్ముఖైస్త్ర్యక్షణైః యుక్తామిందునిబద్ధరత్నమకుటాం తత్వార్థవర్ణాత్మికాం, గాయత్రీం వరదాభయాం కుశకశాశ్శుభ్రం కపాలంగదాం, శంఖంచక్రమథారవిందయుగళం హస్తైర్వహన్తీంభజే.

తా. గాయత్రి నిముత్తియ, పవడ, బంగారు, నీల, ధవళ, వన్నెలుగల మూడునేత్రములుగల ముఖములుగల

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దానిగాను చంద్రుచే నలంకరింపఁబడిన కిరీటముగల దానిగాను తత్త్వములను దెలుపువర్ణములుఁగల దానిగాను, వరద, అభయ, అంకుశ, కశ, శుభ్రకపాల, గద, శంఖ, చక్ర, పద్మద్వయము లుధరించన హస్తముగల దానిగాని ధ్యానింపవలయును. ఇట్టి ప్రతిమను కల్పించవలయును దీనికారణము సూక్ష్మములుగాన గ్రంథవిస్తరభీతిచే వ్రాయ లేదు.

ఇతిధ్యాత్వా, పంచపూజాంకుర్యాత్, తత్ప్రకారస్తు, లంపృథివ్యాత్మనేనమః, గంధాన్, హం, ఆకాశాత్మనేనమః, పుష్పం, యంవాయ్వాత్మనేనమః, ధూపం, రం, అగ్న్యాత్మనేనమః, దీపం, వం, అమృతాత్మనేనమః, అమృతోపహారనైవేద్యం సమర్పయామి, ఇతి కుర్యాత్.

తా. ఇట్లు ధ్యానించి పంచపూజల నాచరింపవలయును. అది యెట్లనిన. పృథ్వీతత్త్వమగులం బీజముచే గంధము నర్పింపవలయును (గంధముగలది పృథ్విగనుక) ఆకసబీజమగు హం అనుదానిచే పుష్పము నర్పింపవల

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యును, వాయుబీజమగు "యం" అను బీజముచే రూప ము నియ్య[illegible]మును, అగ్నిబీజమగు "రం" బీజముచే దీపంబర్పించునది. వమనునమృతబీజముచే నమృతనివే దన నర్పింపవలయును.

గాయత్రీజప విచారః.

అథ గాయత్రీజప విషయేకించి ల్లిఖ్యతే. తత్రయమః, ఆచమ్య, ప్రయతో నిత్యము భేసన్ధ్యే సమాహితః, శుచౌదేశేజప న్జప్యముపాసీతయథావిధీతి, కథమిత్య పేక్షాయామాహశంఖః, కుశబ్రుస్యాంస మాసీనః కుశోత్తరాయాంవా కుశపవిత్రపాణిః ఉదఙ్ముఖస్సూ ర్యాభిముఖో వాక్షమాలామాదాయ దేవతాం ధ్యా యన్జ్వాజపం కుర్యాదితి.

తా. ఇఁకముందు గాయత్రీజప విషయమును కొంచెముగాఁ జెప్పుచున్నాఁడు అందుయముఁడు, ఆచ మించి నియమముగలవాఁడై నిత్యమును భయసంధ్యలం దు దృఢచిత్తుఁడై శుచిగల ప్రదేశమున జపించుచు దేవత నుపాసింపవలయును. అదిచేయు విధమును శంఖుం

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

డు వక్కాణించియున్నాఁడు. దర్భాసనముగఁ గూర్చిండి లేక పట్టి కుశయందునను గూర్చుండి దర్భం జేఁ బూనియు త్తరాభిముఖుఁడై సూర్యాభిముఖుండై యుండయ్యును. జపమాలం బూని దేవతను ధ్యానించుచు జపమాచరింప వలయును.

ఆసనవిశేషమాహ, పరాశరః, కౌశేయం కంబలం వాప్యజినం పటమేవచ దారుజంతాళపత్రంచా ప్యాసనే పరికల్పయేత్, దారుజ మిత్యత్ర దారుజన్మేత్యర్థః.

తా. ఆసనముల నియమింపుచున్నాఁడు. పట్టు వస్త్రము, కంబలము, అజినము, వస్త్రము, పీట, తాటి చాప, ఆసనమందు ప్రశస్తములు. దారుజమనఁగా కొయ్యచేఁ చేయంబడు పీటవగైరాలు.

వంశాశ్మదారుధరణీ తృణపల్లవనిర్మితం వర్జయేదాసనం మస్త్రీ దారిద్ర్యవ్యాధిదుఃఖదం.

తా. వెదురు, రాయి, కట్టె, భూమి, గడ్డి, ఆకులు, నాసనముగాఁ జేయకూడదు చేసినదారిద్ర్యవ్యాధి దుఃఖములు సంభవించును. దారుజ, దారుశబ్దముల వాడు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టచే, దారుజములగు పీటవగైరాలు కూడుననియు కఱ్ఱగా మాత్రమువాఁడ గూడదని తోఁచుచున్నది.

వంశాసనేతు దారిద్ర్యం పాషాణే వ్యాధిసంభవః,
ధరణ్యాం దుఃఖసంభూతిః దౌర్భాగ్యం దారుకాసనే,
తృణాసనే యశోహానిః పల్లవే చిత్తవిభ్రమః,
తృణాసనం కుశవ్యతిరిక్తమ్.

తా. ఆసనములకు ప్రత్యేకఫలములం జెప్పుచున్నాఁడు. వంశాసనము, దారిద్ర్యదాయకము. పాషాణము, వ్యాధిదము. భూమి దుఃఖదము. కొయ్య దౌర్భాగ్యప్రదము. తృణాసనము యశోనాశకము. పల్లవాసమును చిత్తభ్రాంతిదము. తృణాసన మనఁగా కుశనువదలియని యర్థము. ఇట్లే దారుజదార్వాసనములకుగూడ భేదము కల్పింపనగును. అది యెట్లన సంకోచన్యాయ మని యొక న్యాయముగలదు. అది యెట్లన సర్వేభ్యో దధిదీయతాం, తక్రం దేవదత్తస్య (అందఱకు పెరుగు నొడ్డింపుడు. దేవదత్తునకు మాత్రము మజ్జిగనిడుడు. అను న్యాయమందు సర్వాతః పాలియగు దేవదత్తునకు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

విశేషముగాఁ జెప్పుటవలన వానికిపథ్యమని గ్రహించి మాన వలయునట్లే తృణదారువుల నిషేధించినను కుశతజ్జములకు విశేష శాస్త్రముండుటచే నంగీకార్యమునే యగును.

కృష్ణాజినే జ్ఞానసిద్ధిః, మోక్షశ్రీర్వ్యాఘ్ర చర్మణి, అభిచారేతునీలం స్యాత్కంబల వ్యాధికర్మసు, శ్వేత వస్త్రే యశోవృద్ధిః సర్వార్థే చిత్రకంబలః, భిన్నాసనం యోగపట్టం తథైవ మృగచర్మచ, కృష్ణాజినంచ యత్నేనవర్జయేత్పుత్ర వాన్సదా.

తా. కృష్ణాజినము జ్ఞానదాయకము పులిచర్మ మోక్షప్రదము కంబళములో నభిచారకర్మలందు నీలము ముఖ్యము వ్యాధికర్మయందు నట్లే తెలుపగువస్త్రము గాని కంబళముగాని యశోదాయము. చిత్రకంబళము అనఁగా చిత్రాసనము సర్వఫలప్రదంబగును. పుత్రవంతుండగు వాఁడు చిరిగిన యాసనమును .యోగపట్టను మృగచర్మను కృష్ణాజినమును తప్పక విడువవలయును. ఇది విశేషశాస్త్రము.

తత్రదేశ నియమమాహ వ్యాసః, అగ్న్యగారే జలాం

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తేవాజపే దేవాలయేపివా పుణ్యతీర్థే గవాంగోష్ఠే ద్విజక్షేత్రేతథైవచ శంఖోపి, గృహేత్వేక గుణం ప్రోక్తం నద్యాదాద్విగుణం భవేత్ గవాంగోష్ఠేశత గుణ మగ్న్యాగారే శతాధికం, సిద్ధతీర్థేషు క్షేత్రేషు దేవతా యాశ్చసన్నిధౌ, కోటిర్దేవాలయేచైవ మనంతం విష్ణుసన్నిధౌ.

తా. దేశవిశేషములం జెప్పుచున్నాఁడు. అగ్ని గృహమందును, జలసమీపమందును, దేవాలయమందును, పుణ్యతీర్థమందును, అవులకొట్టమందును, బ్రాహ్మణ గృహములందును, జపించుటమంచిది. అందు గృహమందు రెట్టింపుఫలమును నద్యాదులందు ద్విగుణమును ఆవులచావిడియందు శతగుణమును అగ్నిగృహమున శతాధికమును తీర్థక్షేత్రదేవతా సన్నిధులందు కోటిగుణితమును విష్ణుసన్నిధిని యనంతంబును ఫలము గలుగును.

బహిస్సన్ధ్యాదశగుణా గర్తప్రస్రవణేషుచ, శాతాతపోపి,అనృతం మద్యగంధంచ దివాస్వాపంచమైథునం, పునాతివృషలస్యాన్నం బహిస్సంధ్యాహ్యుపాసితా.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తా. వెలుపలకు నెడలిసంధ్యావందన మాచరించుటలోను గుంటకుగాని వాగుకుగాని వెడలుటయందును పది రేట్లధిక ఫలముగలదు. ఈసంధ్య యనృతమును మద్యగంధమును పగటినిద్రను పగటిమైథునమును వృషలాన్నమునుగూడ పవిత్రము సేయును. (అనఁగా ప్రత్యేకము భక్తియున్నఁగాని వెలుపలికి ప్రయత్నముగా వెడలుట గలుగదు.

అక్షమాలామాదాయే త్యత్రవిశేషమాహ, యాజ్ఞవల్క్యః, స్ఫటికేంద్రాక్షరుద్రాక్షైః పుత్రజీవసముద్భవైః, అక్షమాలాతు కర్తవ్యా హ్యుత్తమాచోత్తరోత్తరా, హారీతోపి. శంఖరూప్యమయీం మాలాం కాంచనీమంబుజోత్పలైః, పద్మాక్షైశ్చైవ రుద్రాక్షైః విద్రుమైర్మణిమౌక్తికైః, రచితేన్ద్రాక్షకై ర్మాలాంత థైవాంగుళి పర్వభిరితి.

తా. అక్షమాల విషయమైనవిశేషములం జెప్పుచున్నాఁడు యాజ్ఞవల్క్యుండు స్ఫటికము ఇంద్రాక్షము రుద్రాక్షము పుత్రజీవము వీనివిత్తులవలన చేసిన యక్షమా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ల్ప్రశ స్తము ఒకటికన్న నొకటి మంచిది. హారీతుఁడు శంఖములచేతను వెండిచేతను మాలలఁజేసిన మంచిది. బంగారుమాల మిక్కిలి యధికము పద్మపుగింజలచే ను త్పలములచే పద్మాక్షములచే రుద్రాక్షములచే పవడముల చే మణులచే ముత్తియములచే ఇంద్రాక్షములచే రచిం చిన మాలప్రశ స్తము వ్రేళ్లపర్వములందు వెక్కించుట గాయత్రి కతిప్రాశ స్త్యముం జేయును. ఈలాక్రమం బిది వఱకు వ్రాసియుంటిమి.

అంగులి పర్వభిరిత్యత్ర నిత్యవాచికోపాంశు గాయత్రీ జపవిషయమితి బోధ్యం, తథాచస్మృతిః, అంగు ష్ఠానామికామూలం ప్రదక్షిణమతన్ద్రితః, మధ్యమా మూలపర్యన్తం గాయత్రీజప ఈరితః, గాయత్ర్యై వేదమూలత్వా ద్వేదఃపర్వసు గీయతే, పర్వభిస్తుజపే ద్దేవీంన మాలాభిఃకదాచన, ఇతి, యత్తుగృహ్యపరి శిష్టే. మన్త్రార్థమను సన్దధానః ప్రణవవ్యాహృతి పూర్వికాం సావిత్రీంజపేత్, పంచాక్షమాలయానా మికయామధ్యమాదారభ్య ప్రదక్షిణం దశభిరంగుళి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పర్వభిర్వాగణయే దితిత త్రాప్యుక్తస్మతణాను రో
ధాదతుమాలా కామ్య జపాభిప్రాయేణోక్తేతి వ్యాఖ్యే
యమస్తి.

తా. అంగుళిపర్వలనుటచే నిత్యవాచికో పాంశు
వైన గాయత్రీజప మట్లుచేయు దగినదని భావము. అట్లు
స్మృతులందుగలదు. బొటనవ్రేలునవామికామూలము
నుండి ప్రదక్షిణముగా మధ్యమవ్రేలి మొదటి పర్వవఱ
కుఁ ద్రిప్పి గాయత్రిని జపించునది. గాయత్రి వేదమూల
కమగుటచేతను వేదము పర్వములచేతనే లెక్కింపదగి
యుండుటచేతను గాయత్రిగూడ పర్వలయందే జపింపఁ
దగియున్నదని భావము. మాలలచే నెప్పుడు జపింపఁ
గూడదు. ఇట్లే గృహ్యాపరిశిష్టమందుఁగూడఁ గలదు.
మంత్రార్థమును విచారించుచుఁ బ్రణవవ్యాహృతులతోఁ
గూడిన గాయత్రిని పంచాగుళ్యతుమాలచేతనే యనామి
కా మధ్యమపర్వమున మొదలిడి ప్రదక్షిణముగా పది
పర్వములందు గణనచేయనగును. ఇట్లు విశేషించి చెప్పు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టచేత జపమాలాజపము గాయత్రికి కామ్యవిషయక మని తోచుచున్నది.

జపఫల విశేషార్థం గాయత్రీ జపఃయతోమనురాహ, సహస్రకృత్వ స్త్వభ్యస్య బహిరేత త్త్రికం ద్విజః, మహతో ప్యేనసోమాసా త్త్వచే వాహిర్విముచ్యతే, ప్రణవో వ్యాహృతయస్సావిత్రీచేతిత్రికం, సంవర్తోపి, బ్రహ్మచారీ మితాహారస్సర్వ భూతాను కంపనః, గాయత్ర్యాలక్షజాపేన సర్వపాపైః ప్రముచ్యతే, అయాజ్యయాజనం కృత్వాభుక్త్వా చాన్నంవిగర్హితం, గాయత్ర్యష్ట సహస్రంతు జపంకృత్వా విశుధ్యతీతి. వ్యాసోపి, సంవత్సరం వాషణ్మాసాన్యోజపేద్విధివద్ద్విజః, సోచిరాత్సర్వ కామాంస్తు ప్రాప్నుయాన్నాత్ర సంశయః, ఇతి, ఏతే నాక్షమాలాదిగణనా కామ్య జపవిషయా నాచికోపాంశు విషయావేతి జ్ఞాతుంశ క్యత ఇత ప్రకృతమను సరామః.

తా. ఫలవిశేషముకొఱకై గాయత్రీజపముచే

రియువిధి ప్రణవము వ్యాహృతులు గాయత్రీ ఈ మూ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

డును వెలుపలను సహస్రపర్యాయము లభ్యసించిన బ్రా
హ్మణుఁ డొకమాసము చేయుటవల్ల గొప్పపాతకముల
నన్నిటిని పాఱఁదోలును. అని మనువును. బ్రహ్మచారివై
మితాహారివై (అనఁగా నింద్రియ నిగ్రహము) బ్రహ్మచా
రి యనుటవలన స్త్రీసంభోగమును. మితాహారి యనుట
వలన జితేంద్రియత్వమును విషేధింపఁబడెను.) భూతద
యకలిగి లక్షగాయత్రి జపించిన సర్వపాపముల దొలఁగు
ను. అవి యెట్టివనఁగా యాగానర్హులచే యాగమాచరిం
పఁజేయుట నిషిద్ధాన్నభోజనము. ఇవి ఎనిమిదివేలు జ
పించిన నణంగును. అని సంవర్తుడును సంవత్సరముగాని
యాఱుమాసములుగాని యెవ్వఁడు గాయత్రిని జపించునో
వానికి సమస్తకోరికలు తీరును అని వ్యాసుండు చెప్పు
టవలన నక్షమాలాదులచే జపము కామ్యజపమునకును
వాచకోపాంశు (అనఁగా బిగ్గరగా కొంచెము పెదవులు
కదలునట్లు చేయుజపవిషయకముగాని నిష్కామ్యమాన
సిక జపవిషము కాదు.

నను జపత్వేత్యేవ గాయత్రీం ... త్వా వ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

న్మాత్ర జపేనైవోపాస నాసిద్ధ్యా ప్రణవ వ్యాహృతి సాహిత్యంకి మర్థమితిచే దుచ్యతే.

తా. ఓయి యిరువదినాల్గక్షరములే గాయత్రి యనుటచే నామాత్రము జపించుటచేతనే యుపాసన యగుచుండ ప్రణవవ్యాహృతులేల నని శంకింపఁగా నుత్తరము చెప్పుచున్నాఁడు.

తస్మాదో మిత్యుదాహృత్య యజ్ఞదానతపః క్రియాః ప్రవర్తతె విధానోక్తాః సతతం బ్రహ్మవాదినామితి, భగవద్వచ నాత్తుమన్త్రాగా ప్రణవోచ్చారణస్యా వశ్యకత్వముక్తం పూర్వమేవవ్యాహృతీనాం తదర్థకత్వేన తదభిన్నత్వాద్దురితక్షయ కరత్వాద్వ్యామన్వాది మహర్షివచనాను రోధాద్వాసాహిత్య మితివేదితవ్యం.

తా. గనుక "ఓం" అనియు చెప్పి యజ్ఞదాన తపస్సుల నాచరించునదియని బ్రహ్మవాదులచే విధానోక్తము లన్నియు నాచరింపఁబడుచున్నవి. అను కృష్ణభగవద్వాక్యాను సారముగా మంత్రాదియందు ప్రణవము

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తప్పదు. వ్యాహృతులా ప్రణవార్థకములగుటచే నవియు తప్పవు. దురితక్షయకరములగుటచేఁగూడ తప్పదు. మన్వాది యనేకమహర్షు లాచరించుటచేఁగూడఁ నావశ్యకమే.

తథాచ ప్రణవవ్యాహృతి పూర్వికాం గాయత్రీం జపేదితి పరిశిష్టకారః, ఏతదక్షరమేతాంచ జప్యవ్యాహృతి పూర్వికాం సంధ్యయోః ప్రత్యహం విప్రావేద పుణ్యేనయుజ్యత ఇతి మనుః, ప్రణవవ్యాహృతి యుతాం గాయత్రీంతు జపేత్తత ఇతి. ప్రణవాద్యాంతు సన్ధ్యాంయో జపేద్వ్యాహృతి భిస్సహేతిచ వ్యాసః, ఆశ్వలాయన కారికాకారోపి, జపేత్ప్రణవ పూర్వాభిర్వ్యాహృతీభిస్సహైవతు, తిసృభిర్వ్యాహృప్రభృతిభిర్గాయత్రీం బ్రహ్మరూపిణీ మిత్యాదివచనానాం వేదతుల్యత్వేనోపాదేయత్వాభిధానాత్ గాయత్ర్యాః ప్రణవవ్యాహృతి పూర్వకత్వేన శంకావకాశః.

తా. మీశంక నిజమే ప్రణవ్యాహృతి పూర్వకమగు గాయత్రిని జపింపవలయు నని పరిశిష్టకారుఁడును. ఈ యక్షరములుగల ఈ జప్యమును వ్యాహృతులతో

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గూడ ప్రతిదినము సంధ్యలం దుపాసింపదగు నని మను వును. ప్రణవవ్యాహృతులతోగూడ నుపాసింపవలయు నని వ్యాసులును అట్లే యాశ్వలాయనుండును చెప్పిన వచనములు వేదతుల్యములు గాన గాయత్రి ప్రణవవ్యా హృతులతోనే యుపాసింపఁదగినది గాని వేరొండు కాదు.

ఏవంచ యోగయాజ్ఞవల్క్యేనోక్తం, ఓంకారమా దావుచ్చార్యభూర్భువ స్వ స్తతఃపరం, గాయత్రీం ప్ర ణవం చాంతేజపఏవ ముదాహృత ఇతి.

తా. ఇట్లే యోగయాజ్ఞవల్క్యుండును. ప్రథమ మున నోంకారమును భూర్భువ స్వఃపదములు నుచ్చరిం చుచు గాయత్ర్యంతమందు తిరిగి ప్రణవమును జపింపవల యునని చెప్పియున్నాఁడు.

యచ్చబోధాయనేనోక్తం, ఉభయత్ర సప్రణవాంస వ్యాహృతికాం సావిత్రీ మావర్తయేదితి, యదపిచ వృద్ధమనునోక్తం, షడోంకారాన్జపేద్విప్రా గాయ త్రీం మనసాశుచిః, అనేకజన్మజైః పాపైఃముచ్యతే నాత్రసంశయః.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తా. రెంఁడువైపులను (అనఁగా తుదిని మొదటను) ప్రణవవ్యాహృతులతోఁజేరి గాయత్రిని జపింపవలయు నని బోధాయనుండును. విప్రుఁడోంకారములుగల గాయత్రిని శుచియైమనస్సున జపింపవలయు నని వృద్ధమనుండును చెప్పెను.

త్రిస్రోవ్యాహృతయః పూర్వంపృథగోంకార సంయుతాః, పునస్సం హృత్యచోంకారం మన్త్రస్యాద్యన్తయోస్తథేతి, సోంకార చతురావృత్త్యా విజ్ఞేయాసాశతాక్షరీ, శతాక్షరాం సమావర్త్య సర్వవేదఫలం లభేత్, అనయాజ్ఞాతయానిత్యం వాఙ్మయం నియతం భవేత్, ఉపాసితం భవేత్తేన విశ్వంభువన సప్తకమితి, సోంకారేతి వ్యాహృతిభిర్వినాకేవలోంకార సహితా గాయత్రీ పంచవింశత్యక్షరాసాచతురావృత్త్యాశతాక్షరేత్యర్థః, అత్ర యోగయాజ్ఞవల్క్యవచనం బోధాయనవచన సమానార్థకమితి బోధాయన శాఖావిషయత్వేనవ్యాఖ్యేయం. అన్యద్వచన జాతం కామ్యజపాభిప్రాయక మితిస్పష్టం.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తా. మూఁడు వ్యాహృతులు నోంకారముతోఁ గూడ వేరుగ మొదట నుచ్చరించి తిరిగి సంహారమందు (తుదిని) ఓంకార ముచ్చరింపనగును. ఓంకారముతో గూడ నిరువదియైదైన గాయత్రిని నాల్గావృత్తులుచేసిన శతావృత్తియగును. దానిని జపించిన సర్వవేదఫలమగు ను సప్తభువనో ప్రాప్తియులభించును. ఇచ్చట యోగ యాజ్ఞవల్క్య బోధాయనవచనములు సమానములు గాన నీయోంకార ద్వయపక్షము బోధాయన శాఖవారిది యని తెలిసికొననగును ఇతరవచనము లన్నియు కా మ్యవిషయకము లని స్పష్టమగుచున్నది.

ఏతద్వచన పర్యాలోచన యాతదైవరత్న ప్రతీతేః, అథవా పూర్వోక్తానేకవచనాను రోధేనసంపుట గా యత్ర్యాదికం సర్వమాశ్వలాయన శాఖావ్యతిరిక్త విషయమితిన విరోధః.

తా. ఈ విషయకవచనము లన్నిటి నాలోచింపఁ గా. నివి రత్నములని తోచుచున్నది. లేక వీని యాలో

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చింపఁగా సంపుటమగు గాయత్రియాశ్వలాయన శాఖేత రులకని స్పష్టమగుచున్నది.

ప్రాత స్తిష్ఠన్జపేద్విప్రస్సాయం చైవోపవిశ్యచ, ఉపవిశ్యచ మధ్యాహ్నే జపకర్మసమాచరేదితి, ఉక్తప్రకారేణ జపంకుర్యాత్.

తా. ఉదయము నిలచియు సాయంకాల మధ్యాహ్న కాలములందు కూర్చొనియు జపంబాచరింపవలయును. చెప్పినట్లు జపమాచరించునది.

భావనాశక్తస్య సంఖ్యామాహ, సఏవ, అష్టోత్తరశతం నిత్యమష్టావింశతి మేవవా, విధినాదశకంవాపి త్రికాలేతు జపేద్ద్విజః, ఇతి.

తా. భావనఁజేయు వాని కధికఫలముగలదు. సంఖ్యానియమము లేదు. అట్టి దానియం దశక్తుఁడగు వాని కష్టోత్తరశతముగాని వింశత్యష్టోత్తరశతముగాని త్రిసంధ్యలయందు ప్రత్యేకము పదిపది చొప్పునఁగాని ద్విజుఁడు జపించవలయును.

ఏవం జపానంతరం ప్రాణాయామత్రయం కృత్వాపం

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చోపచారై రభ్యర్చ్యోపస్థానం కుర్యాత్. తత్ప్రకారమాహ శౌనకః.

తా. ఇట్లు జపమయిన పిమ్మట మూఁడు ప్రాణాయామములం జేసి పంచోపచారముల నాచరించి యుపస్థానముం జేయునది. దాని విధిని శౌనకుండు చెప్పియున్నాఁడు.

ఉపస్థానవిధిః.

శౌనకః, జపాన్తే సౌరైః ప్రాతరుపతిష్ఠేత భాస్కరం, సాయంతు వారుణైర్మన్త్రైః ఉభయత్రైకథాబుచా. ఇత్యుక్త ప్రకారేణోపస్థాయ, నమో బ్రహ్మణ ఇత్యుక్త్వా, దిగ్దేవతాభ్యోనమ ఇతి నమస్కృత్యసన్ధ్యాయైనమ ఇత్యాదినా సావిత్ర్యాది నామభిర్నమస్కుర్యాత్.

తా. జపమయిన పిమ్మట సౌరమంత్రములచేఁ బ్రాతఃకాలమందును వారుణమంత్రములచే సాయం సమయమందును సూర్యుని ప్రార్థింపవలయును. రెండు సంధ్యలందు నొకే ఋక్కుచేనైన చేయనచ్చును. పిమ్మట

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నమోబ్రహ్మణేయని చెప్పి దిగ్దేవతలకు నమస్కరించి సావిత్రైనమ ఇత్యాదులను చెప్పనగును.

ఉపస్థానమన్త్రాః.

మిత్రస్యచర్షణీధృత ఇతిచతసృణాంగాధి పుత్రోవిశ్వామిత్రఋషిః, మిత్రోదేవతాగాయత్రీఛందః, మిత్రోపస్థానే వినియోగః.

మిత్రస్యచర్షణీర్ధృతశ్రవో దేవస్యసానసిన్ద్యుమ్నంచిత్రశ్రవ స్తమః.

వ్యా. చర్షణీర్ధృతః మనుష్యస్య వృష్టిప్రదానేనదారకస్యమిత్రస్య దేవస్యసంబంధి, శ్రవః, అన్నం, సానసి సర్వైర్భజనీయం ద్యుమ్నం, త్వదీయంధనం చిత్రశ్రవస్తమః, అతిశయేన చాయనీయకీర్తియుక్తం.

తా. మిత్రస్య యనునాల్గురుక్కులచే గాధిపుత్రుడగు విశ్వామిత్రుండుఋషి మిత్రుండు దేవత గాయత్రీఛందస్సు వినియోగముపస్థానమందు యాభిరాదిత్యః పిబతితాభిః పర్జన్యోవర్షతి యను న్యాయమునుబట్టి వర్షప్రదానముచే మనుజులను రక్షించు సూర్యునియొక్క అన్న

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మను సర్వాదరయమగు ధనమును అదిమిక్కిలి సంపా దింపతగినది.

అభియోని మహినాందివం మిత్రో బభూవసప్రథాః అభిశ్రవాభిః పృథివీం.

వ్యా. యోమిత్రః, మహినా, స్వకీయేన మహిమ్నా దివ మన్తరిక్షమభిబభూవ, అభిభవతి, సమిత్రఃసప్రథాః, ప్రథాప్రసిద్ధిః, తత్సహితశ్రవోభిః వృష్టిద్వారోత్పాది తైః, అన్నైః పృథివీమప్యభిభవతి, బహ్వన్నయుక్తాం కరోతీత్యర్థః.

తా. ఏసూర్యుండాకాశమంతను ప్రకాశముచే నాక్రమించనో యాసూర్యుండు వర్షప్రదుఁడగుచు భూమి నన్నముచేఁ దృప్తిపఱచును గాక యని తాత్పర్యము. (అతండు వర్షము నిచ్చిభూమిని సస్యంవంతమగునట్లు చేయుగాక యనుట)

మిత్రాయపఞ్చయేమి రేజనా అభిష్టిశవసే, సదేవాః విశ్వాన్ బిభర్తి.

వ్యా. పంచజనాః, నిషాదపంచ పంచజనాశ్చత్వారో

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వర్ణాః, అభీష్టిశవసే, శత్రూణామతిక్రాన్తబలయుక్తా యమిత్రాయ, యేమిరే, హవీంష్యుద్యచ్ఛన్తి, సతా దృశోమిత్రః, విశ్వాన్ సర్వాన్దేవాన్, బిభర్తి, స్వస్వ రూపతయాధారయతి.

తా. లోకమందు నిషాదాదులతో నైదగువర్ణముల జనులును శత్రుజయమందతి నిపుణుఁడగు సూర్యునకు హావిర్భాగములిచ్చుచుందురు గాన నట్టి సూర్యుండు సమస్తదేవతాధార భూతుఁడగుటచే మమ్ములను రక్షించు కాక.

మిత్రో దేవేష్వాయుషు జనాయవృక్తబర్హిషే, ఇష ఇష్టవ్రత ఆకః.

వ్యా. మిత్రోభగవానాదిత్యః, దేవేషుద్యోతమానాది గుణేషు, ఆయుషు మనుష్యేషు మధ్యేయోజనః వృక్తబర్హిషే, జనాయ; వృక్తం, లూనం, బర్హిర్యేనసః బర్హిర్లవనస్యశోధనపూర్వకం హవిషోదాతా ఋత్విగిత్యర్థః, తస్మైయిష్టవ్రతాః, ఇష్టాని, కల్యాణాని వ్రతాని కర్మాణి, యాభిస్సిధ్యన్తితాః, ఇషః, తాదృశాన్య

CC-0 Jangamwadi Math Collection. Digitized by eGangotri

న్నాని, అకః, కరోతి, తస్మైదదాతీత్యర్థః.

తా. మిత్రుఁడు దేవతలలోను మనుష్యులలోను నెవ్వండు ఋత్విక్కుగానుండి హవిస్సుల నిచ్చునో వానికి కల్యాణములు సిద్ధించు నన్నము నిచ్చుచున్నాఁడు.

సాయంజపానంతరం వరుణోపస్థానే ఇమం మెవరుణ శ్రుధీహావమద్యాచ మృడఃయేత్యహ్యాజీ గ త్రిరైత్వాశ్వా మిత్రోవా శునశ్శేఫోవరుణో గాయత్రీ, ఇమం మ్మెవ రుణ శ్రుధీహావమద్యాచ మృడయత్వా మవస్యు రా చకే.

వ్యా హేవరుణమేమదీయం ఇమం హావం ఆహ్వానం, శ్రుధి, శ్రుణు కించ, అద్య, అస్మిన్దినే, మృళయాస్మా న్సుఖయ, అవస్యుః, రక్షణేచ్ఛుః, అహంత్వాంవరు ణం అభిముఖ్యేన, చకే, శబ్దయామి, స్తౌమీత్యర్థః.

తా. ఓవరుఁడుడా! నేనిచ్చునాహ్వానమును విను ము. ఈదినమున మమ్ములను సుఖపెట్టుము. నేనురక్షిం చుటకు నిన్నాహ్వానించుచున్నాను. నాకైతిరుగుము.

అవ తేహేళ ఇతి ద్వితీయోమంత్రస్య శునశ్శేఫో ఋషిః

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మోవై శ్వామిత్రశ్చ్ఋషి నశ్శైఘోవరుణస్త్రిష్టుప్, అవ తే హేళో వరుణనమో భిరవయజ్ఞేభిరీమహే, హవిర్భిః క్షయన్నస్మభ్య మసురప్రచేతా రాజన్నేనాంసిశిశ్రథః. కృతాని.

వ్యా. హేవరుణతే, తవ, హేళః, క్రోధం, నమోభిః, నమస్కారైః, అవేమహే అపనయామః, తథా, యజ్ఞేభిః, యజ్ఞైః, అంగానుష్ఠానేన పూజ్యైః, హవిర్భిః, అవేమహే, వరుణం పరితోష్య క్రోధమపనయామహే, అసుర, అనిష్టకోపన శీలప్రచేతః, ప్రకృష్టేణ జ్ఞానయుక్తరాజన్, దీప్యమానవరుణ, అస్మభ్యం, అస్మదర్థం క్షయన్ అస్మిన్ కర్మణినివసన్, కృతాని. అస్మాభిరనుష్ఠితాని, ఏనాంసి పాపాని, శిథిలాని, కురు.

తా. ఓవరుణుఁడా ? నీకోపమును నమస్కారములచేఁ బోఁగొట్టుచున్నాము. అట్లే గౌరవనీయములగు హవిస్సుల నిచ్చియుఁగూడ పోఁగొట్టెదము కోపమననిష్టము లేనివాఁ ప్రకృష్టజ్ఞానవంతుఁడా ! మాకర్మలయందుండి మాచే చేయఁబడు పాపములను పోఁగొట్టుము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఉదుత్తమం వరుణపాశమస్మదవాధమం విమధ్యమం శ్రథ
యా, అథావయమాదిత్య వ్రతేతవానాగసో౽దిత
యేస్యామ.

వ్యా. హేవరుణ, ఉత్తమముత్కృష్టం, శిరసిబంధం పాశం.
అవశ్రథయ, శిథిలీకురు, మధ్యమం నాభిదేశేవస్థితం
పాశం విశ్రథయ, వికృష్యశిథిలంకురు. అథ శిథిలీకర
ణానన్తరం, ఆదిత్య, అదితిపుత్ర, తవవ్రతే ఉపస్థానే
వయమనాగసః, పాపరహితాస్సంతః, అదితయేస్యా
మ, త్వమివేతి శేషః, త్వత్సాయుజ్యం ప్రాప్నుయామ
ఇత్యర్థః.

తా. ఓవరుణుఁడా! నాశిరమునందును నాభియం
దు నుండుపాశములను తెంపి బాగుచేయుము. దీనివలన
నాభి యుదయసంధియనియు శిరమస్తమయస్థానమని
యు నీరెంటియందుండు పాశములే రాక్షసులనియు వా
నిని జంపి ముక్తినొసంగుమనియును పిండాండ సూర్యుని
పరమగు నర్థము సూచించుచున్నది. అట్లుచేసిన పిమ్మట
మేము నీయుపస్థానకర్మయందు దరులమయి నీసాయుజ్య

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ముం జేరెదమని యర్థము. దీనివలన మాధ్యాహ్నికసం ధ్య యౌవనసమమగుచు నామధ్యవయసునందు కామా దివికారము లతిశయింపకుండుటకు కర్మభాగమును కల్పిం ది మాధ్యాహ్నిక సంధ్యనుగూడ నుదయాస్తమయము లకు హేతువను కర్మాంగముగాఁ గల్పించియుండిరి.

## అథ సన్ధ్యావయవోపస్థానమ్.

జాతవేదస ఇత్యస్యసూక్తస్య, మరీచిపుత్రఃకశ్యప ఋషిః, జాతవేదాగ్నిర్దేవతానుష్టుప్ఛన్దః, సంధ్యో పస్థానే వినియోగః, జాతవేదసే సునవామసోమమ రాతీయతో నిదహాతివేదః, సనఃపరుషదతి దుర్గాణి విశ్వానావేవసింధుం దురితాత్యగ్నిః.

వ్యా. జాతవేదసే, జాతానాముత్పత్తిమతాం సర్వేషాం వేదిత్రే, యద్వా, జాతైస్సర్వప్రాణిభిః జ్ఞాయమా నాయ, జాతధనాయ, జాతప్రజ్ఞాయవా; అగ్నయే, లతారూపం సోమం, సునవామ, అభిషుణువామ, జాతవేదాత్మకమగ్నిం యష్టుం సోమాభిషవం కర వామేత్యర్థః, సోగ్నిః రరాతీయతః, అరాతిం. శత్రుమి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వాన్మానాచరతః, శత్రోర్వైదో, ధనం, నిదహాతి నిత రాం దహతు, భస్మీకరోతు అపి చపోగ్నిర్నోఽస్మాన్ విశ్వా సర్వాణి, దుర్గాణి దుర్గమనాని భోక్తుమశక్యాని దుఃఖాన్యతిపర్షతు, అతిపారయతు, అతిక్రమ్యాదుః ఖరహితం సుఖం, ప్రాపయతు తత్రదృష్టాంతః, నావేవసింధుం యథాకశ్చిత్కర్ణధారః గ్రాహాదిభిర్దుష్టస త్త్వైః, ఆకులితాం నదీం, నావా తారయతి తద్వత్, తథా దుంతా దురితాని దుఃఖహేతుభూతాని, పాపాన్యస్మానతిపారయ, దుఃఖనిమిత్తాత్పాపాదస్మానుత్తారయత్విత్యర్థః, అత్రనిరుక్తం, జాతవేదాః కస్మాజ్జాతానివేద జాతానివైనం, విదుర్జాతే జాతే విద్యతఇతి వా, జాతవిత్తో జాతధనో, వా, జాతవిద్యోవా, జాతప్రజ్ఞోవా, యత్తుజాతవేదపశుం నవిందతేతి, తజ్జాతవేదసో జాతవేదస్త్వమితి హిబ్రాహ్మణ మిత్యాది.

తా. ఉత్పత్తిగలవారలకు తెలియదగినవాఁడు ఉత్పత్తిగలవారలచే దెలియదగినవాఁడును పుట్టిన జ్ఞానముగలవాఁడును పుట్టిన ప్రజ్ఞగలవాఁడు నగు నగ్నికొఱకు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సోమము నభిషేకించుచున్నాము. అతఁడు నాశత్రుధన
ము నపహరించు గాత. నాసమస్తకష్టముల నపహరించు
గాత. సుఖమును పొందించుగాత. ఎట్లన సముద్రమును
నావవలెనే. ఈయర్థము నిరుక్తమందు బ్రాహ్మణమందు
ను చెప్పఁబడి యున్నది.

తచ్ఛంయోరిత్యస్య విశ్వేదేవాశ్శక్వరీ, శాన్త్యర్థే వి
నియోగః, తచ్ఛంయోరావృణీమహే, గాతుం య
జ్ఞాయగాతుం యజ్ఞపతయే, దైవీస్స్వస్తిరస్తునః స్వ
స్తిర్మానుషేభ్యః, ఊర్ధ్వంజిగాతు భేషజం, శన్నో అ
స్తుద్విపదే శంచతుష్పదే.

వ్యా. తచ్ఛంయోరితి, శం, శమనం, రోగాదీనాం, యోః,
వ్యాపనం, ఆగామినాం, పృథక్కరణమేవం వైతద్భ
వతి, తస్మాదేవాదరాత్, అవృణీమహే, ఆభిముఖ్యేన
ప్రార్థయామహే, నో, అస్మాకం, దైవీ, దేవసంబం
ధినీ, స్వస్తిరస్తు, అవినాశ్యస్తు, తథాస్మదీయేభ్యశ్చ
మానుషేభ్యస్సర్వేభ్యో వాప్రాజాపత్యాశ్చ స్వస్తిర
స్తు ఊర్ధ్వంజిగాతు ఉద్గచ్ఛతు, కింభేషజం ప్రజా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నామవినాశభూతం భేషజం తదాహ, రాజ్యమేవైశ్వ రం తేజశ్చాస్తు, కించ అస్మదీయాయద్విపదే, చతుష్ప దే, శంసుఖ, మస్తు.

తా. మాకు నిదివరలో నున్నట్టిన్ని రాఁబోవునట్టి రోగములకు శాంతికలుగు గాక. అందుకే నిన్ను వరింపు చున్నాము. మాకు దేవసంబంధమగు మంగళమగు గా త. మాపంబంధులగు మనుజుల కందఱకు శుభమగు గా త. అద్ధి వృద్ధిగానుండును కాక, ఈశ్వర తేజస్సు మాకె ల్లప్పుడు నుండు గాత. మాసంబంధమగు ద్విపదములకు చతుష్పదములకు (మనుష్యపశ్వాదులకు) సుఖము గలు గు గాక.

నను గాయత్రీజపదాగ్న్యుపస్థానేతాం విహాయాగ్నా ద్యుపస్థానంకి మర్థమితిచే దుచ్యతేయథా, అసావాది త్యో బ్రహ్మేత్యత్రతద స్తర్వ ర్త్రిబ్రహ్మ తేజసో గ్రహణం తథైవాగ్న్య స్తర్వ ర్తి తేజస ఏవేతిజ్ఞేయం, కించ, అ హం వైశ్వానరోభూత్వా ప్రాణినాం దేహమాస్థితః, ఇతి భగవద్వచనాచ్చ, జాతవేదో విశేషణాచ్చ, తత్తే

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

జోవిద్ధిమామకం ఇతి, గీతావచనాచ్చ, తదభిన్న గాయత్ర్యుపవేతిన శంకావకాశః.

తా. ఓయి గాయత్రీ జపానంతరము దానిని బలపఱుపనిచ్ఛయించి యుపస్థానమును చేయునప్పుడు, ఆ గాయత్ర్యుపస్థానము యోగ్యముగాని యగ్న్యుపస్థానమే లనను శంకకు సమాధానము ఆసావాదిత్యో బ్రహ్మ అను స్థలమందెట్లు సూర్యాంతర్వర్తియగు బ్రహ్మను గ్రహించుటో యట్లే యిచ్చట నగ్న్యంతర్వర్తి తేజస్సుకే గ్రహణముగాని వేఱుగాదు. దీనికి బలముగా నేను వైశ్వానరాగ్నినై ప్రాణులదేహము నాశ్రయించితి ననియు భగవంతుడు చెప్పెను. ఇది కాక జాతవేదశ్శబ్ద ప్రయోగము మంత్రమందుగలదు. ఆ తేజము నేనే యని గీతావాక్యముగలదు. గాన నాయగ్న్యభిన్న గాయత్ర్యుపస్థానమే యని యర్థము.

తథాచ ఋగపి. ఇంద్రం మిత్రం వరుణమగ్నిమాహు రథోదివ్యస్స సుపర్ణోగరుత్మాన్, ఏకంసద్విప్రాబహుధావదంత్యగ్నింయమం మాతరిశ్వానమాహుః. ఇతి,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వ్యా. అముమా దిత్యం పరమైశ్వర్యయోగాదిం ద్రమా హుః, తథామిత్రం. ప్రమీతేర్మరణా త్త్రాతారమహార భిమానినం తం దేవమాహుః, అగ్నిం, గమనాదిగుణ విశిష్టం, ఏతన్నామకమాహుః, అథో, అపిచ, దివ్యః దివిభవః, సుపర్ణః, సుష్టుపతనః, గరుత్మాన్, గరణ వాన్ ఏతన్నామకోయః పక్షే అయమేవ, కథమేక స్యనానాత్వమిత్యుచ్యతే, అముమేవాదిత్యమేవ వ స్తుతః ఏకం సంతంసద్విప్రాః మేధావినః, దేవతాత త్త్వవిదః, బహుధావదన్తి, తత్తత్కార్య కరణేనా గ్న్యాద్యాత్మానం వదన్తి, ఏకఏవమహానాత్మా దేవ తా ససూర్య ఇత్యాచక్షత ఇత్యుక్తత్వాత్కథం తా హ్యప్రకాశాదికరణే నాగ్నిం దృష్ట్యాదినా ఆదిత్యం మాతర్యంత రిక్షశ్వాసనా ద్వాయుమాహుః, అత్ర కే చిదగ్నిస్సర్వా దేవ ఇతి శ్రుతితః ఇమమే వాగ్ని మేకం మహాన్తమాహుః; బహుధావదన్తి, ఇంద్రం మిత్రం తరుణమగ్నిం దివ్యంచ గరుత్మంతం దివోదివి జోగరుత్మాన్, గరణవాన్ గుర్వాత్మామహాత్మేతి,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఏకం సంతం బహుధాకల్పయం తీత్యాదిశ్రుతయోపి, ఏకమేవాత్మానం బహుధాప్రతిపాదయన్తి, అతోఽగాయత్రీం విహాయాగ్న్యాద్యుపస్థానం కిమర్థమితిశంకా నిరసితేతిజ్ఞేయం.

తా. ఇది సారములోనిది గనుక సూర్యుఁడు ప్రకృతము గ్రహింపఁదగినవాఁడు. ఈసూర్యుని ఇంద్రునిగాను మిత్రునిగాను వరుణునిగాను అగ్నినిగాను గరుత్మంతునిగాను చెప్పుచున్నారు. ఒక్కఁడైన నితనిమంచి బ్రాహ్మణులగ్నినిగాను యమునిగాను వాయువుగాను చెప్పుచున్నారు. కనుక నగ్న్యుపస్థాము చేయుట యుచితమై యున్నది.

అథమాధ్యాహ్నిక సంధ్యావన్దన మన్త్రార్థః.

మధ్యాహ్నేతు విశేషోయ ముపస్థానమథార్ఘ్యకం
అపామంజలి సంపూర్ణ మాకృష్ణేనేతిచక్షిపేత్,
సవితుర్మండలం పశ్యన్నుపతిష్ఠేద్దివాకరం,
ఊర్ధ్వబాహుర్జపేచ్ఛాక్త ముదుత్యంచాతవేదసం,
సూక్తంహిచిత్రం దేవానామితి శౌనకోక్తేః,
మాధ్యాహ్నిక సంధ్యోపస్థాన మన్త్రార్థోనఖ్యతే.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తా. మాధ్యాహ్నిక సంధ్యయం దుపస్థానార్ఘ్య ములయందు భేదముగలదు గాన దానిని వివరించుచు న్నాఁడు. ఉదకాంజలినిపట్టి "యాకృష్ణేన" యను మం త్రముచే నర్ఘ్యమిచ్చునది. చకారమువలన హంసశ్శుచి షత్ " అను దానిచేతను గాయత్రిచేత నని యర్థము. పి మ్మట పైకి బాహువులనెత్తి సూర్యునిధ్యానించవలయు ను. అప్పుడు నుత్యమనుసట్టియు చిత్రం దేవానామను నట్టియు సూక్తములఁ చెప్పవలయును. అని శౌనకమహ ర్షి వచించెను. దానియర్థము నిప్పుడు వివరింపఁబోవుచు న్నాఁడు.

ఉదుత్యంజాతవేదస మిత్రిత్రయోదశర్చస్యసూక్తస్య, క ణ్వపుత్రః ప్రస్కణ్వర్షిః, సూర్యోదేవతా, నవాద్యా గాయత్రీఛందః, ఉద్వయంత మనస్పరీతిచతస్రోను ష్టుభః, చిత్రం దైవానాముదగాదనీకమితిషడర్చస్య సూక్తస్య, ఆంగీరస పుత్రః కుత్సఋషిః, సూర్యోదేవ తా, త్రిష్టుప్ఛందః, సూర్యోపస్థానే వినియోగః.

తా. ఉదుత్యం జాతవేదసమనే ఋక్కులకు పద

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మూడింటికి కణ్వపుత్రుండగు ప్రస్కణ్వుఁడను వాడు కని పెట్టినవాఁడు ఉపాస్యదేవతిసూర్యుండు మొదటిదొమ్మిది గాయత్రీఛందము, ఉద్వయంత మనస్సరి మొదలు నాల్గనుష్టుభులు, చిత్రందేవానామను నాలుఋక్కులకు నాంగీరసుండగు కుత్సుఁడు ఋషి, దేవతసూర్యుండే; ఛందము త్రిష్టుపు, సూర్యోపస్థానమందు వినియోగము.

ఉదుత్యంజాతవేదసం దేవంవహంతికేతవః, దృశేవిశ్వాయసూర్యమ్.

వ్యా. కేతవః, ప్రజ్ఞాపకాః, సూర్యాశ్వాః, యద్వా,సూర్యరశ్మయః, సూర్యం సర్వస్యప్రేరకం, ఆదిత్యం ఉద్వహన్తి, వహన్తి,ఉఇతిపాదపూరణే, కిమర్థం, విశ్వాయ, విశ్వస్మై, భువనాయ, దృశే, ద్రష్టుం, యథా సూర్యేసర్వం పశ్యన్తితథోర్ధ్వం హన్తీత్యర్థః. కీదృశం, త్యం, ప్రసిద్ధం, జాతవేదసం జాతానాంప్రాణినాం వేదితారం, జాతప్రజ్ఞం జాతధనం వాదేవం,ద్యోతమానం, అత్రనిరుక్తం, ఉద్వహన్తితం జాతవేదసం

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దేవమశ్వాః. కేతవో, రశ్మయోవాసర్వేషాం భూ
తానాం సందర్శనాయ సూర్యమితి.

తా. చిహ్నములగు సూర్యుని గుఱ్ఱములు (కిరణ
ములు) సర్వప్రేరకుండగు నాదిత్యునివహించును. అది
ప్రపంచమెల్లను నతఁడు చూచుటకై అతండు ప్రసిద్ధుండై
ప్రాణుల విషయమయి తెలిసినవాఁడు. (అనఁగా సంర
క్షించువాఁడ) వేదశబ్దమునకు ప్రజ్ఞయనియు ధనమనియు
నర్థము గలదు. సర్వప్రజలను చూచుకొఱకు గుఱ్ఱము
లితనిని పైకి ధరించుచున్నవని నిరుక్తకారులుగూడ వ్రాసి
యున్నారు.

అప త్యే తాయవో యథా నక్షత్రా యంత్యక్తుభిః, సూ
రాయ విశ్వచక్షసే.

వ్యా. త్యే తాయవో యథా ప్రసిద్ధా స్తస్కరా ఇవ, నక్ష
త్రా నక్షత్రాణి, దేవగృహరూపాణి దేవగృహా వై న
క్షత్రాణీతి శ్రుత్యన్తరాత్, ఇహలోకే సత్కర్మాను
ష్ఠానాయే స్వర్గం ప్రాప్నువన్తి తే నక్షత్రరూపేణ తథా
చ శ్రూయతే, యోవా ఇహయజతే, అముగ్ంసలో

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కం నక్షతే, తన్నక్షత్రాణాం నక్షత్రత్వమితి, యద్వా తేషాం సుకృతినాం జ్యోతీంషి యన్నక్షత్రాణీ త్యామ్నాయాత్, యేనాస్కఆహ, నక్షత్రాణినక్షతేర్గతి కర్మణో మానినక్షత్రాణీతిచ బ్రాహ్మణమితి, తథా విధాని నక్షత్రాణ్యక్తుభిః, రాత్రిభిస్సహ, ఉపయన్తి, అపగచ్ఛంతి విశ్వచక్షసే విశ్వస్యసర్వస్య ప్రకాశకస్యసూరాయ సూర్యస్యాగమనం దృష్ట్వేతి శేషః, తస్కరానక్షత్రాణిచ సూర్యఆగచ్ఛతీతి భీత్యాపలాయన్త ఇత్యర్థః, తాయవఇతిస్తేననామ, తాయుతస్కర ఇతి తన్నామసుపాఠాత్, అక్తుభిరితి రాత్రినామ శర్వర్యక్తుభిరితి పాఠాత్.

తా. ప్రసిద్ధమగు దొంగలవలె నక్షత్రములు రాత్రులతోగూడ సూర్యుని రాకచూచి మరుగుపడుచున్నవి. తాయుతస్కరశబ్దములును అక్తుశర్వరీశబ్దములు పర్యాయములు.

అదృశ్రమస్య కేతవోవిరశ్మయోజనామను భ్రాజన్తో అగ్నయో యథా.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

